(చిత్రకారిణి: శ్రీమతి జగుమర్తి బుచ్చి కృష్ణమ్మగారు)



పున్నాబాయి త్యాగము

# వాగ్దానము

## గున్నేపల్లి అక్షయలింగముగారు

భక్తివిశ్వాసముల నాత్మఁ బాదుకొల్పి
రాకుమారుని ప్రాణసంరక్షణమునఁ
గన్నకొడుకును బలివెట్టఁగలిగినట్టి
పన్న సాహసోదారసంపన్న గాదె?

స్వార్థమునడంచి, రాజసేవావిధాన
కౌశలముగాంచి పరిచారికలకునెల్ల
నవ్యతరశోభఁగూర్చు పన్నావధూటి
సాటి గుణపేటియగుచేటి జగతిఁగలదె?

రాచపట్టిని గాపాడఁబ్రతినపట్టు
కడుపుచల్లఁగఁగాంచినకొడుకు నకట!
ఖడ్గధారకుఁబాల్సేసి కన్నులార
నేవధూమణి చూచి సహింపఁగలదు?

నెమ్మిమై వంశపునోమ్మక నిలుపుమనుచుఁ
గనుఁగవను వేఁడికన్నీరు గ్రమ్మ వేడు
కొన్న రాజ్ఞియాశయముఁ జేకూర్పఁగలిగి
వన్నెఁగనె నౌర! యన్నులమిన్న పన్న.

పరిణయములందు మరణావసరములందు
నప్పగింతలనూకొట్టు టంతెకాని
వాకొనినయట్లు పచరించువారుగలరె?
చెలువకన్నాకు, పన్నాకుఁజెల్లెఁగాక!

# అభినందనము

కందుకూరి రామభద్రరావుగారు

తరతరాలనిగూఢమయి దాగియున్న
విమలతేజంబు సతుల నుద్వేలమయ్యె
భారతీదేవి స్వాతంత్ర్యభాగ్యమరసి
జయపతాకమునడిపిన సమయమందు.

రవిమరీచులెఱుంగని రమ్యహర్మ్య
భాగములఁబొద్దువుచ్చు సౌభాగ్యవతులు
సౌఖ్యములకాన వెట్టి, వేసవి నిదాఘ
వేళబయలుదేఱిరి శాంతివీథులబడి.

మండువేసవిటెండ కేయెండకరణి
చల్లనై దీక్షకొనగూర్చ నుల్లసనము,
కఱకుకరదండతాడనవిరులసరము
పసిడి గళసీమకిచ్చె నాభరణకలన.

విపణివీథుల భారతవీరవనిత
లాత్మశక్తికి శాంతిసూత్రాన్వయంబు
విప్పిచెప్పంగ పాశ్చాత్యవిబుధులెల్ల
తలలుపంకించి చెవులొగ్గుతరుణమద్ది.

లలితకరకంకణక్వణములు సెలంగ
కదురుఁద్రిప్పుచు భారతాంగనలుపేర్మి
సకలమానవసోదరసామరస్య
భావసూత్రములందీసి ప్రతిభగనిరి.

చెరిగిపోలేదు తొల్లింటిజీవరేఖ
నిలిచియున్నది పుణ్యాంగనల సతంబు
జీర్ణముఖమున రవ్వంత చెలువుదక్క-
అనుపమానోజ్జ్వలంబు దోహదమొనర్చ.




# పున్నాబాయి

చిత్తూరురాణా సంగుడు చనిపోయెను. ఆతనికొడుకు ఉదయసింగు అప్పటికి ఆఱు సంవత్సరములవాఁడు. కావున ఉదయసింగు పెద్దవాఁడగువఱకు వనవీరుఁడనువానిని చిత్తూరు రాజ్యమునకు రక్షకుఁడుగా ఉండునట్లు మంత్రులు ఏర్పాటుచేసిరి. రాజ్యరక్షకుఁడైన వనవీరునకు కొద్దికాలముననే రాజ్యమును తానే కబళింపవలయునను ఆశగలిగెను. ఇక నాయాశా పీడితు డెట్టిదురాగతము తలపెట్టునో?

ఈతని కిట్లు రాజ్యాశపొడచూపుటయు, ఉదయసింగుతల్లి కర్ణావతి చనిపోవుటయు ఒక్కసారియే జరిగెను. కర్ణావతి చనిపోవుచు ఉదయసింగును తన సంగడపుదాసియగు పున్నాబాయి చేతులలోనిడెను. కుడియెడమలు తెలియని కుఱ్ఱతనమునందే తల్లిని దండ్రిని పోగొట్టుకొనిన ఉదయసింగును పున్న తనకొమారునితోబాటు గారబమున పెంచుచుండెను. సమానవయస్సుగల ఆదాసీపుత్రుఁడును, ఆరాజపుత్రుఁడును స్నేహమున మెలగుచు పున్నకు రెండునేత్రములుగ నుండిరి.

ఒకనాటిరాత్రి. ఒకేమంచముపై ఆకుమారులిరువురు పండుకొని నిద్రించుచుండిరి. రాజ్యముపై కన్నువేసిన వనవీరుఁడు నాఁడు ఉదయసింగును చంపదలంపుగొన్న విషయమును పున్న తన చారనేత్రములతో గనిపెట్టెను. వనవీరుఁడు వచ్చు వేళయగుచున్నది. తోడనే ఆమె రాజకుమారుని లేవతీసెను; ఆతనిమెడలోని హారమును తీసివేసెను; ఆతనినెత్తిమీఁది టోపీ ఊడలాగెను; ఆతని శరీరమున ఉన్న వెలగల బట్టలను చప్పునవిప్పివేసెను. పిమ్మట ఆతనికి నల్లమందుమాత్రతో మైకముగల్పించి ఒకపండ్లగంపలో పండుకొనబెట్టెను. పైనకొన్ని పండ్లను, ఆకులనుగప్పెను. విశ్వాసపాత్రుఁడగు నొకమంగలిద్వారా ఆగంపను కోటబయటికి పంపివేసెను.

పున్న చేయవలసిన మిక్కిలి కష్టపుపని ఇంకను మిగిలియేయున్నది. రాజకుమారుని దుస్తులు ఇప్పుడు ఆమె తనకొడుకునకు తొడుగవలసియున్నది. చప్పుచప్పున ఆబట్టలు ఆమె నిద్రపోవుచున్న తనకొడుకునకు తొడిగెను. రాజకుమారుని హారమును తనకుమారుని మెడలో వేసెను; ఆతనిటోపీ పీనినెత్తిమీద పెట్టెను. కడసారి చైతన్యముండగ తనకుమారుని కఱవు తీర ముద్దుపెట్టుకొని రాబోవుకష్టమునకు ఎదురుచూచుచు పున్న వేచియుండెను. ఆమె అట్లు కొంచముసేపుమాత్రమేఉండెను. ఇంతలో ఎవరోవచ్చుచున్నట్లు అడుగులచప్పుడు వినిపించెను. తలుపులుతోసికొని వనవీరుడు ఆమె ఎదుటనిలిచెను. పదునుపట్టిన ఉక్కుకత్తి ఆతనిచేతిలో మెఱసిపోవుచుండెను. "ఏడీ నీవు పెంచుచున్న రాజకుమారుడు? ఉదయసింగుని చూపుము!" అని వనవీరుడు ఆజ్ఞాపూర్వకముగా పలికెను.

ఆస్థితిలో ఆమెకు కడుపుతఱుగుకొని పోవుచుండెను. అగుటచే ఆమెకు నోట మాట రాలేదు. ఒకనిముసము కొయ్యబొమ్మవలె నిలిచియుండెను. మనసు రాయిచేసికొని ఆమె చేయిఎత్తి ఈసంగతిఏమియునెఱుగకనిద్రాదేవిలాలనలోపడియున్న తనకుమారునిచూపెను. వనవీరుడు కత్తిఎత్తెను. ఒక్కటేదెబ్బ. కెవ్వున ఒక కేకవేసి నిద్రించుచున్న దాసీపుత్రుడు నిద్రించుచుండగనే ప్రాణములువిడిచెను. పక్కఅంతయు నెత్తురుమయమాయెను. 'రాచపురుగు నశించినది. ఇక చిత్తూరుకు నేనేరాణాను' అని సంతోషించి వనవీరుడువెడలిపోయెను.

బిడ్డ ఆయువుచెల్లి చనిపోయిననే తల్లిప్రాణము భరింపలేదు. అట్టియెడ బిడ్డకు తనకు తానై చావుగల్గింపవలయుచో ఆమాతృహృదయము ఎంతగా కుతకుతఉడికిపోవునో ఊహింప దరముకాదు. తనకన్నులయెదుటనే తనకన్నకుమారుడు తనచేయిచావుచేత ఖండింపబడుటకు పున్న ఒప్పుకొనుటకు కారణమేమి? సాటిలేని ఆమెరాజభక్తి. చిత్తూరురాజకుటుంబమువారి ఉప్పు చాలకాలమునుండితినిఉన్నది కావున పున్న ఆరాజకుమారుని ప్రాణములు కాపాడుటకు తనకుమారుని ప్రాణములను బలిఇచ్చినది. అపూర్వత్యాగ మొనర్చినది. ఆచంద్రతారార్కముగు కీర్తినిబడసినది.

ఇట్లు పున్నాబాయిచే రక్షింపబడి ఉదయసింగు పెరిగిపెద్దవాడై సేనలకూర్చుకొని వనవీరుని యుద్ధమున ఓడించి తనతాతతండ్రులు పాలించిన చిత్తూరురాజ్యమునకు రాణా ఆయెను. ఇదిఅంతయు పున్నచేతిచలవ. ఇది ఆమెపెట్టినదీపము. ఆనాడు పున్న ఉదయసింగునకు బదులు తనకుమారుని ప్రాణములు అర్పింపకుండినచో ఆనాడే సంగరాణావంశము నశించిపోయిఉండును; నేడు ఉదయసింగు ఇట్లు రాణాఅగుటయు జరుగకఉండును. రాజకుమారుని క్షేమముకొఱకు కడుపుతీపి చంపుకొని తనకుమారుని బలివెట్టిన ఈరాజభక్తురాలిని బంగారు పువ్వులతో పూజింపవలసిఉన్నది. పున్నఅనగా హిందీభాషలో వజ్రమని అర్థము. స్వామిభక్తియందు పున్న నిజముగా ఒకగొప్పవజ్రము. ఈరాజభక్తురాలి ఎముకలపై సిద్ధహస్తుడగు శిల్పినిర్మించిన చలువరాతిసమాధి నేటికిని రాజపుత్రస్థానమున యాత్రాస్థలమైయున్నది.

# లవణసాగరమథనము

శ్రీమతి రాజేశ్వరి గారు (ఆంధ్రగీర్వాణసాహిత్యపరిషత్తు)

ఆసబర్మతీతీర ఋష్యాశ్రమంబు
బయలువెడలిన సత్యతపస్వి వెంట
పరువులిడినది సకలప్రపంచదృష్టి
యే ప్రళయవహ్ని పుట్టునో యేమొయనుచు.

ఎక్కడి దండీ తీరం
బెక్కడి శాంత్యాశ్రమంబు! యా క్రోశశత
మ్మొక్కరణి నడచునో యా
ముక్కాఖులముసలియనిరి ముగ్ధప్రజయున్.

నొసటన్ కుంకుమచుక్క శౌర్యవిజయానూనాంకమై యొప్ప; శాం
తసము తేజముగొల్పు కన్గొనలు "స్వాతంత్ర్యంబు నాజన్మహ
క్కుసుమా!" యంచువచింప; చేతగల స్టిక్కున్ టక్కుటక్కంచు తా
పసియుక్కుండరుదేర నల్దెసలకున్ మార్మ్రోగె తద్ధ్వానముల్.

దారిపొడవున శాంతిస్వతంత్రసమర
జైత్రయాత్రాపురోగామిచరణసరణి
ధన్యమైనట్టిధూళి నౌదలధరించి
పొంగిపోయెను భూదేవి నింగిదాక.

విశ్వసౌభ్రాతృత్వవిద్యోతమానానురాగగీతమె మందరాగమయ్యె
శాంతిసామ్రాజ్యనుశాసకనిష్కామభూషణమ్మె యాదిశేషువయ్యె
ఒకవంకపశుబల మ్మొకటసాత్త్వికనిరోధంబు దానవదైవతంబులయ్యె
లాఠీప్రయోగావలంబనస్రవదుష్ణరక్తకుల్యములె హాలాహలమయ్యె

లవణసాగరమథనవేళాప్రభూత
దర్శనాతీరసత్త్వస్వతంత్రభార
తీయరాజ్యేందిరయె రమాదేవియయ్యె
మోహినీమూర్తియె మహాత్ముండు వెలసె!

# చిన్నబాబు — శ్రీరంగం శ్రీనివాసరావుగారు, బి.యె. (కవితాసమితి)

౧

శిశిరాగమవేళ అది. మాఘమాసము. లోకానికి మంచు తెరలుకట్టుచున్నది. హేమంతనిశీథములే పరిపక్వముచెంది పవళ్ళనుకొరికి బహుదీర్ఘములగుచున్నవి. వత్సరానికావహించిన వార్ధక్యము జీర్ణపర్ణపుంజీభూతములైన చెట్టుచేమలలోనను స్పష్టవిస్పష్టమగుచున్నది. పువ్వులతోపాటు ప్రకృతికి నవ్వులునులేవు. అట్టి అకాలమున ఆకసమాక్రమించినవి మేఘమాలికలు. తదీయవిజయభేరి నదించిన దురుములమిషమున. మరు నిమిషమున జగతిని ముంచెత్తినది కుంభద్రోణముగా కురిసినవాన. శీతకాలవర్షార్భటి చిత్రాతిచిత్రము. ప్రకృతికది రుజాప్రపీడనమును పోలినది. తదాహతులలో దైన్యమొక్కటే ధ్వనించుచుండును. ఆప్రకృతిదైన్యమే ప్రాణముగొన్నవిధాన ఒకకుక్కపిల్ల చలిలో గజగజవడకుచు మంద్రరవళి నాక్రందించినది. ఆచలిలో, వానలో-ఆదరిద్రదీనను ఆదరించువారున్నారాఅని ప్రకృతిమాత ప్రశ్నించినది. అంతకుముందే అది అరచిన ఆక్రోశ మొకపసిఎడదలో ప్రతిధ్వనించియుండెను. ప్రకృత్యాదేశమును పరిపాలించుటకట్లుగా, అట్లుగా కుక్కపిల్లనుచేరినాడు చిన్నబాబు. ఆబాలుని అమృతశీతలలోచనాంతములయందు ఘృణాప్రపూతనిధులే కలవు. నవనీతప్రసన్నమగు అతని లేతగుండెలో వత్సలతారసాపగలేగలవు. పదిలముగ కుక్కపిల్లనెత్తికొని చిన్నబాబు లోనికి తీసికొనివెళ్ళినాడు. పాలుత్రాగించి సేదదేర్చినాడు. దానిలో కళాకాంతులు స్ఫీతములైన క్షణము బాలునిలో సుదృఢహృదయశాంతియు నెలకొన్నది. బాలుడు కుక్కపిల్ల కన్నులలోనికిచూచినాడు. కుక్కపిల్ల బాలుని కన్నులలోనికి చూచినది. అర్థమెరుగరాని వాదృక్పాతములు. బాలునికన్నులలో కృతజ్ఞత అన్వయించినచో తదీయమిథోబంధనమున వారియందు స్నేహబాంధవ్యము జనించెనని చెప్పవచ్చును. ఆస్నేహమును ఆమోదించిన ప్రకృతికూడ హిమశీతలాశ్రువులతో ద్రవించినది.

౨

చావడిలో కుర్చీమీదకూరుచున్న అన్ననుచూచి చిన్నబాబు "అన్నయ్యా! పెంచుకోవడంఅంటే ఏమిటీ?" అని ప్రశ్నవేసినాడు. చదువుచున్నపుటమీది దృష్టులను తమ్మునిమీదికిత్రిప్పి ఒకసంభాషణకు సిద్ధముపడినట్లుగా అతడు "నువ్వు మమ్మల్ని వదలిపెట్టడం, వాళ్ళయింట్లోనే ఉండిపోవడం" అన్నాడు.

"వాళ్ళయింట్లో నన్నెందుకుండనిస్తారూ?" అని మరల బాలునిప్రశ్న. ఇంతలో ఇంటిలోనుండి కుక్కపిల్ల కుర్రవానికాళ్ళదగ్గరకువచ్చి ముడుచుకు కూర్చున్నది. సంభాషణ ఏకాగ్రతతో వినుచున్నట్లు కనిపించుచున్నది.

"ఎందుకుండనిస్తారా? నిన్ను పెంచుకుంటారుకాదూ మరి?"

"ఐతేను నేనిక్కడికి మళ్ళీరాకూడదూ?"

"నువ్విక్కడికిరావు. మేమే అప్పుడప్పుడువచ్చి నిన్ను చూస్తూంటాము."

"మరి నేనక్కడ ఉండిపోవాలికదా, నాతో మీరెవరూ రారుకదా. పోనీ నాకుక్కపిల్లని తీసుకు పోవచ్చునా?"

"............................"

"పాపం, అదేమిచేసింది? నాతో నేఉంటుంది; నేనంటే దానికెంతోఇష్టం."

"వాళ్ళది ఆచారమైనకుటుంబంకదా. కుక్కపిల్ల నక్కడ నిలవనిస్తారూ?"

"అన్నయ్యా! ఆచారంఅంటే ఏమిటీ?"

"మడికట్టుకొనిఉండడం, మడికట్టుకొని భోజనంచేయడం."

"పోనీ కుక్కకూడా మడిగా నేఉంటే?"

ఆగనిఅన్ననవ్వే దీనికిజవాబు.

అన్న మాట్లాడకపోవుటచూచి చిన్నబాబు "అన్నయ్యా! పాపం కుక్కపిల్ల నాతో ఉంటేనేమి? అదంటే నాకూ ఇష్టమే" అన్నాడు.

"నీకక్కడ ఉపనయనం కాబోతున్నది. అప్పుడు పక్కన కుక్కపిల్లని కూచోపెట్టుకుంటారా ఎవరేనా?"

"ఉపనైనమా? అంటే?"

"ఒడుగన్నమాట. నువ్వు బ్రాహ్మడివౌతావు. బ్రాహ్మలు కుక్కల్ని ముట్టుకోరు."

"ఇప్పుడు నేను బ్రాహ్మణ్ణికానూ. ఇప్పుడు నేను కుక్కని ముట్టుకోలేదూ? నాయనమ్మ నన్ను పెద్ద బ్రాహ్మడిఅంటుందే!"

"మనింట్లో మనకి తప్పలేదు. మనింట్లోఅయినా ఒడుగునాడు కుక్కని ముట్టుకుంటారా?"

"పోనీ తర్వాతో?"

"తర్వాతమాటచూసుకోవచ్చు. ఇప్పుడుమాత్రం అక్కడికి కుక్కపిల్లని పట్టికెళ్ళకూడదు."

"ఒడుగవుతుందనేనా? పోనీ ఆతర్వాత నాకుక్కపిల్లని తెచ్చిపెట్టవూ అన్నయ్యా?"

"అలాగే తెస్తానుకాని, అసలు అక్కడఉండడం నీకు ఇష్టమేనా? అపల్లెటూరిలో నీకు కాఫీ ఉండదులే."

"మరేమిటి ఉంటుంది?"

"చద్దిఅన్నం, ఆవునెయ్యీ, గేదెపెరుగూ."

"అయితేనేం? నాయనమ్మ ఇవే మంచిఅంటుందివంటికి."

"అయితే నువ్వక్కడికి వెళతావన్నమాటే. అక్కడ నీకు ఆడుకుందికెవరూ ఉండరులే."

"నాకు కుక్కపిల్లవుంటే అదేచాలు."

## 3

అపల్లెటూరి అగ్రహారమున ఆచారమగుకుటుంబములే కలవు. అన్నియు చూచినంతనే బ్రాహ్మణ గృహములుగా పరిచయములు కాగలవు. ఒకఇంటిలో ఇప్పుడు చిన్నబాబు దత్తపుత్రుడు.

అతని ఉపనయనము జరిగినది. వటూత్తమడతడు. ద్విజుడు.

పండుగసందడితగ్గుచున్నది. ఉపనయనానంతరము బంధువులందరు బయలుదేరి పోవుచున్నారు. అప్పుడు మెల్లగా చిన్నబాబు అన్నను సమీపించినాడు.

"అన్నయ్యా! కుక్కపిల్లని తెచ్చిపెట్టవూమరి?"

ఎట్లు గడపినాడో ఈరోజులు. ఇప్పుడు మరల ఒక్కమారుగా కెరటమై పొంగినది కోరిక. కుక్కపిల్లను తీసికొనిరాక తీరదన్నాడు.

అన్న సమ్మతిచెప్పిపోగా చిన్నబాబు తృప్తితో మరలినాడు. అప్పటినుండి నిరీక్షణమే అనుక్షణమా బాలుడు.

ఆకసమాక్రమించినవి మేఘమాలికలు. లోకమును ముంచినది వర్షధార. ప్రకృతి నొక్కట ప్రబలముగ ఊగించినది చలి. జగతికి కారుక్రమ్మినచీకటి కప్పికొనుటకు కంబళిఐనది.

చిన్నబాబు వ్యాధిపీడితుడైనాడు. మంచాని కంటుకొనిపోయినాడు. నిరీక్షఫలించక, నిరాశచే నిస్పృహకలిగి వాని మనస్సువాడి క్రోమైనది. అన్న ఎప్పటికిరాకపోవుటచే బాధ మరియు ప్రబలమైనది. కాని అన్న రాకుండుటకు కారణమేమో? ఆతనికి తమ్మునిఆత్రము పూర్తిగా తెలియును. అయినను రాలేదు. ఎట్లురాగలడు? ఇంటిలో కుక్కపిల్లలేదు. అందరును ఊరికివచ్చినప్పుడు ఆకుక్కపిల్ల ఒంటరిది, ఎక్కడకు పోయినదో ఎవ్వరికిని తెలియదు. అన్న ఎట్లురాగలడు? కుక్కపిల్లలేకుండ వచ్చుటన్నది ఎందులకు? అన్న కుక్కపిల్లను అట్టుకొనాడ్డు. పారిపోయినదా విశ్వాసము తెలియక?

*                    *                    *                    *

తీవ్రముగా గాలి. క్షోణీపాతముగా వాన. కొరికితినునట్లుగా చలి. జంగమములు కదలవు. స్థావరము లెగిరిపోవుచున్నవి. చిన్నబాబు కివ్వాలుడు. చిన్నబాబు శోషిల్లిపోవుచున్నాడు.

*                    *                    *                    *

గుమ్మములో, మడికట్టుకొని చలికి కప్పుకొని కూరుచున్నదొకర్తు. కుంపటిఒకటికూడ కలదచ్చట. అప్పటికిని చలి ఆగుటలేదు. ఆబాధ బోధపడుమనే ఉన్నదామెకు.

*                    *                    *                    *

చిట్టచీకటినిచీల్చి మెరసిన దొకవిద్యుల్లత. ఒక్కమారు ఢీకొని కాలాంబుదములు గట్టిగ గర్జించినవి. ప్రకృతి కొక్కమారుభయావేశము కల్గినది.

*                    *                    *                    *

గుమ్మములోనిఆమె కూర్చుండియేఉన్నది. చలిచే మూల్గుచుండకపోవనులేదు. కుంపటిమీద చేతులు వెచ్చచేసికొనుచు నేఉన్నది.

అప్పు డతిదీనముగా, సన్నగొంతుతో జాలిజాలిగా మూర్మురించుచు ఒకకుక్కపిల్ల చేరవచ్చినది. తల నిండనిండిన దానికండ్లలో ఆయాసము, ఆశ, కిస్ఫుటముగాఉన్నవి. ఒడలంతయు తడిసిపోయి, కఠుతీవ్రపు చలిచే గడగడవడకుచున్న దాకుక్కపిల్ల.

ఆమెమాత్రము "మడిచెడగొట్టినావే రాక్షసిముండా!" అని దయాశూన్యముగా కుక్కపిల్లను దూర ముగా విసరికొట్టినది.

చిన్నబాబు వేయిచెవులతో వినుచున్నాడు. అంత జ్వరములోకూడ గుమ్మములోనికి వచ్చినాడు. "ఏదీ కుక్కపిల్ల?" అని అరచినాడు. వీథిలో మహాకరుణమైనఅరుపు వినిపించినది. ఏమో అరిగించికొన్నట్లు రుండయినని గాలి అప్పుడు రొదచేసినది.

"వానరా, తడుస్తావు ఆగు, ఆగు!" అనుమాటలు చిన్నబాబు వీథిలోనికి వెళ్ళినంతలో విన్పించినవి. బాలుడు లక్ష్యపెట్టలేదు; పరుగెత్తిపోయి కుక్కపిల్ల నెత్తుకొన్నాడు.

ఆవానలో, గాలిలో, నిర్మానుష్యమగు ఆవీథిలో చిన్నబాబు, చేత కుక్కపిల్లయుమాత్రమే. కాని ఆశాబకమున జీవకళలేదు. తుది అరపుతో ప్రాణములిదివరకే ఎగిరిపోయినవి.

వేడికన్నీటితర్పణములతో చిన్నబాబు కుక్కపిల్లను దీనముగాచూచినాడు. అప్పుడే ఆకుర్రవాని నింటిలోని కత్తుకొనిపోయి రెవ్వరో తొందరతొందరగా! ఉష్ణములోన ఉప్పొంగిపోవుచున్నది.

కుక్కపిల్లను వదలలేదు. వడకుచేతులతో హృదయమున కదుముకొన్నాడు. "ఇది నాకుక్కపిల్ల. నేనెరుగుదును. ఇదే, ఇదే! ఇదే కావాలి నాకు."

ఇవే ఆబాలునిమాటలు.

# జోల పాటలు

1. శ్రీమతి యన్.వి. సరళాదేవిగారు

జోలల్లుపాడితే బాలలకుతూగు
నాగస్వరంపాడితే నాగులకుజోగు
కాకమ్మవచ్చింది కబురుతెచ్చింది
అత్తయ్యయేమందో అడుగుమీ తండ్రి!
లేదుఅదురుగుండె పిలికికండయును
లేదు మీవంశాన నీకు భయమేల?
పూచికాచినయట్టి మావినిజూడ
నినుగన్న మీయమ్మ జ్ఞప్తికొచ్చింది.
కొట్టినారెవ్వరే చిట్టియబ్బిని
కొట్టిగులాబీలు చిదిమివేశారు
గజ్జలుమువ్వల్లు గల్లురనగ
మాచిన్నికృష్ణయ్య! మముచేరరమ్మ
రావెరావేరథమ! రత్నాలరథమ!
అబ్బాయియెక్కితే అందమొచ్చేని
గుఱ్ఱంబునెక్కితాను మాచిన్నరాజు
పల్లంబుతేరమ్మ పాపల్లుమీరు.
మావిగుబురులలోన కోయిలాకూసె
అబ్బాయియింటిలో కిలకిలానవ్వె.
అబ్బాయినిలిచేటి అంగణములోన
శ్రీలక్ష్మిదేవైతె తాండవించేను.
అబ్బాయిపద్యమ్ము చెప్పుకోగానే
పలుకులవెలదియు కిలకిలానవ్వె.
అందములకుసీమ ఆచందమామ
అబ్బాయితోవచ్చి ఆడిపొయ్యేని.
అబ్బాయిమాటంటే కోయిలాపాట
అబ్బాయిచూపంటే వెన్నెలాతేట.
ఆడుతూపాడుతూ అబ్బాయిరాగా
చిన్నికృష్ణుడు మాకుజ్ఞప్తికొస్తాడు.

2. శ్రీమతి పురాణం జ్ఞానమ్మగారు

గోవింద! గోవింద! గోకులానందా!
రార! పరమానంద! రామగోవిందా!
పూరేలువుత్తముడ! జగమేలుస్వామీ!
మమ్మేలు యేడుకొండలవెంకటప్పా!
వూరుమంచీదమ్మ వుభయకావేరీ
వాడమంచీదమ్మ వైష్ణవులవాడా
అయ్యమంచీవాడు శ్రీవెంకటప్పా
అమ్మమంచీదమ్మ అలుమేలుమంగా.
అలుమేలుమంగమ్మ ఆటకూటానా
అడిగితెచ్చాకొందు అయిదువలెనమూ
గోవిందరాజూల కొలుకూటానా
కోరితెచ్చాకొందు కొంగుబంగారూ.
పొద్దుప్రొద్దునలేచి మొక్కుదుముకొండా
మ్రొక్కుదుముమాపాలి వెంకటప్పటికీ
కొండలెక్కేవారు గోవిందులమ్మా
గోగుపూవుకోశేవారు రామలక్ష్మణులూ
కొండమీదఅప్పయ్య కోలాటపరుడూ
కోరీనావారీకి కొడుకూలనిచ్చు
కొడుకూలని నేను యేమిలంచమ్మా
పిడికిటిరూకలూ బిడ్డతనపేరూ.—
ఎరుగనిరాజ్యాన నన్ను స్థిరైనా
యేమిరా పెద్దన్న ననుచూడరావు?
నినుచూడనాకుంది నేనేమిచేతూ
రాచకార్యమువల్ల రాతీరలేదు.
రాచకార్యమువల్ల రాతీరకుంటె
చేతిలేఖలనైన వ్రాసంపరాదా?
చేతిలేఖలకూడ రాసిపంపకుంటే
నోటిమాటలతోను చెప్పంపరాదా?

## "ఆగదిలోనే"

శ్రీమతి యు. సత్యబాలసుశీలాదేవిగారు

"పిన్నమ్మకొడుకు విమల్ బొమ్మలాక్కోగానే మాతృసమక్షంలో తీర్పుకోరడానికి అమలా పరుగెత్తిందాగదిలోకే." "మొన్న ఈలాగే అరుస్తూ పరిగెత్తివస్తే చూడమ్మా! ఇక్కడ నొప్పికాదూ! అని అమ్మ చూపించగానే అల్లరంతా మానేసి తనచిన్ని చేతుల్తో ఆమె ఫాలభాగమంటి న్నొప్పా అమ్మా! ఇక్కలా! అంటూ గదినాలుగువేపులాచూస్తూ కాస్సేపు నిలబడి మెల్లగా బయటికొచ్చేసిందా గదిలోంచే." "మొదటిసారి అమ్మవొళ్లో చెల్లినిచూసి బెదిరిచూస్తూ వెనక్కుతగ్గిందాగదిలోంచే." "చెల్లి పరిచయమయ్యాక గంటలకొద్దీకబుర్లు చెప్పుకొంటూ చెల్లిచిన్నకాళ్లూ, బుల్లిచేతులూ, చిట్టిబొజ్జా, ముద్దులాడిందాగదిలోనె." "తన ఏడురోజులచెల్లికోసం ఏడుస్తోన్న అమ్మను చెల్లేదమ్మాఅంటూ. కుమ్మేస్తూంటే చెల్లి దేవుడిదగ్గరకెళ్లిందమ్మా అని కళ్లుతుడుచుకుంటూవచ్చినతండ్రికి ఎత్తుకోమని చేతులందించిందాగదిలోనే." "తరువాతమూడురోజులకునిద్రబోతూన్న అమ్మచుట్టూ నాన్న, అత్త, పిన్ని అంతా ఏడుస్తోంటే తాను అమాయకంగా, ఆర్తంగా చూస్తూ దూరంగానుంచుందాగది లోనె." "అందరూగోలగాఏడుస్తోంటె అమ్మను పూలరథంలోపెట్టి తీసికెళ్లినదృశ్యం చెమ్మగిల్లిన పెద్దకళ్లతో నిశ్చలంగా చూసిందా గదిలోంచే. "అమ్మ పడుకున్న మంచంమీదపడి దొర్లుతూ అమ్మేదత్తా! అని కళ్లునులుపుకుంటూఅడిగితే అత్తవచ్చి కొంగుతోకళ్లొత్తుకుంటూ బలంన్నెత్తికెళ్లిందాగదిలోంచే." "ఇప్పుడు అపరిమితవేగంతో పరిగెత్తివచ్చిన తన పాదద్వయాన్ని హృదయవిదారకశూన్యదృశ్యం, హఠాత్తుగబంధించేసిందాగదిలోనే." "గుక్కతిప్పుకోలేనంత బరువుగా తెచ్చిన విమల్ మీద చాడీలన్నీ గాలికెగిరిపోయి రిక్తహృదయం శూన్యమందిరాన్ని ప్రతిఘటించిందాగదిలోనే."

"అమ్మేదీ అని ఏడుపుమొగంపెట్టి బరువుగా అడుగువేసుకొంటూ ఇల్లంతావెతికొచ్చేసి అందరూ అలసి నిద్రబోతూన్న ఆమధ్యాహ్నకాలంలో, నేలమీద బోర్లపరుండి ఏడ్చిఏడ్చి నిద్రించిందాగదిలోనే." "సాయంత్రానికి, నిప్పుసెగ జిమ్ముతూన్న అమలాశరీరాన్ని అత్తవచ్చి బాధాకలితమైన నిట్టూర్పుతో మంచంమీద చేర్చిందాగదిలోనే."

"మర్నాడు తీవ్రజ్వరంతో అమ్మేదీఅని పలవరిస్తూన్న అమలాను శిథిలహృదయంతో వస్తుందమ్మా అని తండ్రి ఓదార్చిందాగదిలోనే. "అమ్మేదీ"అన్వేషణవనాదం ప్రతిధ్వనించిన నిశ్శబ్దనిశీథంలో, నిశ్చలంగా జాలిచూపులు విదరాలుస్తోన్న నేత్రాలు, బ్రహ్మత్వమందిన యోగినివలె శాశ్వతకాలమునకు ముకుళించిన అమలాపవిత్రశరీరమున్నదాగదిలోనే."

"సుందరమందహాసం విరజిమ్ముతూండే అమలాయోగిని చిన్ని పెదవులు జపించిన అమ్మేదీ యను పావనమంత్రము సర్వకాలముకు వినబడకుండబోయినదాగదిలోనే."

అహో! ఆగృహమేధి కెంతహృదయవిదారకదృశ్య మాగది?

# పేరంటము

హరి రాధాకృష్ణమూర్తిగారు

సకలకళావిలాసంబున దనరారు వాణి యేకులమందుఁ బ్రభవమొందె
సర్వసర్వంసహాచక్రంబు సేవించు సిరి యేకులంబునఁ జెన్నుమీరె
జన్మపరంపరాసంధానకర్త్రియౌ మాహేశ్వరే యెందుమహిమగాంచె
అలత్రిమూర్తులనైన జలదరింపఁగఁజాలు పరదేవతయె యెందుఁబ్రణతులందె
అట్టినారీకులమ్మున నవతరిల్లి
జ్ఞానశూన్యత కాలమ్ముజరుపుకొనుచు
నెచటనో కన్నుమూయ నీకేలమఱల
నిలుపుమమ్మా శుభాంగి! పూర్వులప్రతిష్ఠ.

ఓచపలాక్షి! కంటివె యనూనహితైకపదాభిలాష, వి
ద్యాచయముంగడించి సరితామరసాక్షులలో సమేతులై
నీచెలులెల్లఁ గీర్తినిగణించుట నీవిటునేరవేల, ఔ
నోచినవారిభాగ్యమది నోమనివారికి వచ్చునే ధరన్?

లేరొకో మానినీమణులు రేఁబవలెల్లను మాతృదేశ దు
ర్వారవిశృంఖలార్థ మెదురై తలలిచ్చెడి ధీరలెన్న వా
రైరె జనాపహాస్యమున కాదరణీయులుగారొ వారిలోఁ
జేరగనేల నింతకృషిఁ జేయవు సందియమేల మానినీ!

నిముసంబులో శత్రునివహంబుగూల్చిన రాణిభవాని వీర్యంబువినవో
శత్రురాజులఁ బట్టిసముతోడఁ దునుమాడినట్టి ఝాన్సీలక్ష్మిపట్టువినవో
వైరివర్గము భీతిఁబారగాఁజేసిన చాందుబీబీ సాహసమ్మువినవో
పల్నాటిసీమ నిర్వాహకత్వముచేసినట్టి నాగమ్మ విఖ్యాతివినవో
వారుపుట్టినదేశాన వరలవమ్మ
వారుదిన్నట్టి యుప్పునఁ బ్రదుకవమ్మ
వారిరక్తంబు మేనునఁ బారదమ్మ
వారిమరపింపవేలనో వనిత! నీవు.

తనువుదేశమునకై ధారఁబోయఁగ సరోజని కబలాత్వమే సరణినడ్డె
దేశవిముక్తికై తిరుగాడుకమలకుఁ బతివ్రతామహిమయేపగిదినడ్డె
పరిపాలనకుఁబాటుపడు రుక్మిణికిని సంతానవతీత్వమేదారినడ్డె
సభలలోఁబల్కఁగా హాసనాజుకు మతాచారవర్తిత్వమేచాయనడ్డె
నీకునడ్డునె పూనికనిలచియున్న
గచ్చకాయలతోఁ బ్రొద్దుగడుపనేల
తిరిగి కదనతూర్యధ్వనులొరయునపుడు
రమ్ము, మానినీ! పోరిపేరంటమునకు.

# కథ (?)

తాత కృష్ణమూర్తిగారు బి. ఏ; యల్. టి.

"అర్ధరాత్రికావచ్చింది. ఇంకా యేమిటా వ్రాత? ...ఇంతకూ, ఎన్నాళ్ళకైన పూర్తిఅవుతుందిగనకనా, ఆ నవల?"

కుర్చీవెనక నిల్చుని, నాభుజంమీదనుంచి వంగి, టేబిలుపైనున్న కాగితాలవైపు చూస్తూవుంది, ఆ కొంటెకళ్లతో. కలంవిడిచి చిరునవ్వుతో తిరిగేను, ఆమెవైపు. ఎదురుగావున్న గడియారం గంటలు కొడుతూవుంది. చూస్తే, తొమ్మిదిగంటలే అయింది! అర్ధరాత్రి కావచ్చిందనే లక్ష్మిని యేమనాలి?

పూర్వం కార్లయిల్ కవి యిట్లానే బల్లదగ్గర వ్రాసుకుంటూవున్నప్పుడు భార్యవచ్చి, చెయ్యిపట్టుకు లాగేదట—ప్రేమతో. పాపం ఆయిల్లాలిహృదయం తెలుసుకోలేక, ఆయన మూర్ఖంగా తనవ్రాత గొడవలోనే తన్మయుడై ఉండిపోయేవాడట. ఈకథ జ్ఞాపకంవచ్చి, లక్ష్మికి చెప్పేను. ముసిముసినవ్వుతో తలతమాషాగా పంకించి, "అవును మరి. 'కలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్?' అని చెప్పలేదూ, మీపెద్దనామాత్యుడు?" అన్నది.

"ఏడిశాడు. లోకానుభవంలేని పొల్లునీతులు పలికే దద్దమ్మ! అబద్ధాలు, దొంగమాటలు చెప్పడం యీ కవులకు పరిపాటయింది."

"కవిత్వమంటే అదేగా?" అని నవ్వుకుంటూ, వయ్యారంగా వెనక్కితిరిగి వెళ్ళిపోబోయింది.

"ఉండు. వెళ్ళిపోతావేం? ఇట్లాకూచో, యీ కుర్చీమీద." అని చెయ్యిపట్టుకున్నాను.

"ఎందుకు? నాకు నిద్ర వస్తూవుంది. పోయి పరుంటాను. మిమ్మల్ని పిలవడానికేం రాలేదిప్పుడు—ఆతగాడి పెళ్లాంవలె." అని నవ్వుతూ, "మీరు వ్రాసుకోండి. ఆపదమూడో ప్రకరణమేనా, ఇంకా?" అంటూ నాబలవంతంమీదకూచుంది, కుర్చీలో.

"నువ్వు ఆక్షేపించే ఆ నవల కాదు, నేనిప్పుడు వ్రాస్తూవున్నది."

"మరొక నవల ప్రారంభించేరా? యేమిటి, కొంప దీసి?" అంటూ విరగబడినవ్వడం ప్రారంభించింది.

నాఅంతబద్ధకిష్టి భూలోకంలో యెవడూలేడని ఆమె అభిప్రాయం. లేకుంటే, యీపాటికి నేనొక 'డికెన్సు' నో, 'షా' నో అయివుందునని వెర్రినమ్మకం కాబోలు! పుస్తకం ప్రారంభించడంలో ఉండే చురుకుదనం నాకు పూర్తిచేయడంలో లేదని ఎప్పుడూ చెప్పుతూఉంటుంది. "లేదు నవలకాదిది. ఏదైనా ఒకచిన్న కల్పితకథ వ్రాద్దామా అని కూచున్నాను—పత్రికకోసం—ఏమీ ఊసుపోక" అని సమాధానం చెప్పేను.

"వెనకటికెవడో ఊసుపోనిమంగలి పిల్లిని పట్టుకున్నట్లు—"

"అదిగో, నాకవిత్వం, రచన, ప్రజ్ఞ, అంటే నీకంతవేళాకోళంగా ఉన్నాయికదూ?" అన్నాను, కొంచెం నొచ్చుకొని.

"ఛా, లేదు. మీరు వ్రాసే అబద్దాలు యెంతో బాగుంటాయి."

"హాస్యాలకక్కడికిగాని, యీకథమీద నీఅభిప్రాయం చెప్పు" అని బుజ్జగించేను.

"మంచికత్తే, నాకు! నేరకపోయివచ్చేను మీగది లోకి.—" "ఆయితే వినవూ?"

"వింటాను—కథ సాంతం వ్రాసినపిమ్మట. సగంలో యేం తెలుస్తాయి, దాని మంచిచెడ్డలు? ఇంతకూ, యేకథవ్రాసినా, మన ప్రతాపాలేగా అందులో వర్ణించేవి?" అన్నది.

"అనుభవంమీదవ్రాసే విషయాలకూ, కేవలం ఊహాశక్తివలన కల్పించినవాటికీ, యెంతో తేడావుంటుంది, మరి నిజంరుచించినట్లు అబద్ధం రుచిస్తుందా?" అని సమాధానంచెప్పడం ప్రారంభించేను.

"ఆమాటకొస్తే, నిజంకంటె అబద్ధమే యెక్కువ రుచి! పచ్చికూరకంటె వండినకూర రుచియెక్కువ.

మీరెంత నిజం వ్రాసినా, కొద్దో గొప్పో అబద్ధం మిశ్రమం చేస్తేనే కాని కథ అనిపించుకోదు కదా?"

"అడ్డువాదన మానవు కదా? అసలు, కథ వినకుండానే యీ చర్చ యెందుకు?"

"విన్నతరవాత కథ బాగులేదంటే, మీకు ఆగ్రహం రాదూ మరి?"

ఆమాటకు నాకు నిజంగానవ్వొచ్చింది. కాని సమాళించుకొని, "కథచదవమని నన్ను ప్రోత్సహించడానికిబదులు, చదవనియ్యకుండా చేస్తున్నావు. పోనీ, వినడానికి నీకంత యిష్టంలేనప్పుడు బలవంతమా యేమిటి? వెళ్లి పడుకో" అన్నాను.

నాముఖవైఖరి, కంఠంలో కోపం, అన్నీ కనిపెట్టి, బుగ్గలు లొత్తపడుతూ మధురంగానవ్వి, లేచి నా భుజాలుపట్టుకొని కళ్ళలోకి చూస్తూనిల్చుంది.

సాయంత్రం తలంటుకుందికాబోలు, జుట్టురేగి కళ్ళలోను, చెంపలమీద, పడుతూవుంది గాలికి. నవ్వుతూ వుంటే, ఆతాంబూలంనోట్లో ఎర్రగా దానిమ్మగింజలవలె కనిపిస్తున్నాయి పళ్ళు. యాలకు గింజలవాసన గుప్పున కొడుతూవుంది, నా మొహం మీద. పెద్దగా వెలుగుతూవున్న టేబిలులైటు కాంతిలో చెంపలు నిగనిగ మెరుస్తున్నాయి, అద్దాలవలె. మాధుర్యం, కొంటెతనం, చనువు, ప్రేమ—అన్నీ మిశ్రమమై కనిపిస్తున్నాయి, ఆమెచూపులో. పెంకెది లక్ష్మి! నాకంటె పదేళ్ళుచిన్నది. ఇరవై రెండోయేడు కాబోలు. కాని, యింకా చిన్నతనం, పెంకెచేష్టలుమానదు. రంగు, పరిమళం, పువ్వును సహజంగా అంటుకొనిఉన్నట్లే పెంకెతనం, శృంగారం లక్ష్మిజీవితంలో ఐక్యమైఉన్నాయి.

స్కూలువిద్య అట్టేలేదు కాని, పుస్తకజ్ఞానం, లోకానుభవం చాలా సంపాదించింది. వచ్చీరాని యింగ్లీషుముక్కలు, కొత్తగా నేర్చుకుంటూవున్న హిందీభాష, గ్రామఫోనుపాటలు కూనిరాగంతో పాడగలనేర్పు, వెక్కిరింతబొమ్మలు వ్రాయగల చిత్రలేఖనానైపుణ్యం—ఇవి, ఆమెకుగల యితర విద్యాభూషణాలు. తెలుగుపుస్తకాలు, పత్రికలు అర్థం చేసుకొని చదువుతుంది. అప్పుడప్పుడు వాటినిగూర్చి నాతో చర్చిస్తుంది—మొండివాదనతో కొమ్ములు తిరిగిన కవినైనా వెక్కిరించకమానదు.

నేనంటే అసలే లక్ష్యంలేదు. ఏమనుకుంటానో అన్నైనా సంకోచించదు. నోటికివచ్చినంతమాటా అని తీరుతుంది. నన్ను ఎగతాళిచేసి, విసిగించి, కోపం తెప్పించి, బుజ్జగించి, నవ్వుతుంది. "ఏమాటన్నా ఉడుక్కుంటారేం?—ఊరికే తమాషాకిఅంటే?" అంటుంది, పైపెచ్చు.

"ఆకథయేదో చదవండి మరి, వింటాను." అంటూ కుర్చీలోకూరుచుంది మళ్ళీ. "ముందే చెప్పండి, కథవిని పొగడాలో, ఖండించాలో! అనక నన్ను నిష్టూరం మాటలనక—"

"చదవను. నువ్వు వినక్కరలేదులే."

"అదిగో, ఎందుకూ ఆకోపం? కవీశ్వరులకు కోపం కూడా అదొకలక్షణం కాబోలు, లేక భూషణమో! చదువుతున్నవారు కనక, చెప్పండి—మీ షేక్స్పియరు, కాళిదాసు, తిక్కన, వీరంతా కోపిష్టివాళ్లేనా?"

ఏడుస్తున్నవాళ్ళనైనా నవ్వించగల శక్తిఉంది, లక్ష్మిలో. ముద్దుగా బుజ్జగిస్తుంది.

మెల్లగానవ్వుతూ "నాకేమీకోపంలేదు. దా, ఆకుర్చీకాస్తదగ్గరగా జరుపుకో. కథ చదువుతాను. శ్రద్ధగావిను మరి—అడ్డుప్రశ్నలువెయ్యక. కాని నీకు సందేహాలుంటేమాత్రం, అవశ్యంఅడుగు. చెప్తాను." అని కాగితాలు సరిచూసుకొని, చదవడానికి సిద్ధపడ్డాను.

బుద్ధిగాకూచుని, నావేపు ఓరగాచూస్తూ, "చదవండి చప్పున. ఈలోగా పిల్లవాడుకానిలేస్తే—" అంటూ యేమో సణిగింది.

"లేస్తే, ఆపిల్లవుందిగా, దాది?"

"దాన్ని కూచోపెట్టి చదివేస్తారా, తక్కిన కథ?"

"అయితే కథలు వినిపించడానికాయేమిటి, దాదిని కుదుర్చుకోవడం?" అని నవ్వుతూఅడిగినాను.

"కాకపోవచ్చును. కాని, యింట్లో అడమనిషి అంటూఉన్న తరువాత, యేపనికైనా అక్కరకు

వస్తుంది—మెత్తనిదయిలే. పురుషుడు భార్యను పెళ్లాడడం కథలు వ్రాసి వినిపించడానికా యేమిటి? కాని, నేను కూచుని వినడంలేదూ, బుద్ధిగా?"

చేతపట్టుకున్న కాగితాలు బల్లమీద పడేశాను.

"అదేమిటది? మళ్ళీవచ్చిందాయేమిటి బుస్సు?"

"బుస్సూలేదు గిస్సూలేదు. ఇప్పుడు చదవనుకథ. ఇంకా పూర్తికాలేదు. పద—పోయి పరుండాం, హాయిగా" అంటూ లేచి నిల్చున్నాను.

"వ్రాసినంతవరకూఅయినా చదవండి. వినాలని కుతూహలంగావుంది, నాకు. నిద్రకూడా తేలిపోయింది. కూచోండి."

"కీలుబొమ్మనిచేసి ఆడిస్తున్నావు నన్ను. నీ యిష్టంవచ్చినప్పుడుచదివి, యిష్టంలేనప్పుడు మానేస్తాననుకున్నావా యేమిటి?" అన్నాను.

"చదవరా, యింత బ్రతిమాలుతూ వున్నా?" దీనంగా పెదవుల్లో ముద్దులు తొణికేటట్లు అన్నది, ఆమాట-రెప్పలుపైకెత్తి నావేపు నిదానంగాచూస్తూ. పెద్దచారడేసికళ్లు లక్ష్మివి. మృగాన్నయినా మంత్రించి మచ్చికచేయగలచూపు, అది!...మళ్ళీ కుర్చీలో చతికిలబడ్డాను.

నిజంగా లక్ష్మికి కథలంటే యెంతో సరదాఅని నాకు తెలుసు. వొల్లమాలినకథలువచ్చు దానికి. పురాణకథలు, సాంఘికకథలు, హాస్యంకథలు, డిటెక్టివుకథలు, భూతకథలు—యెన్నోచదివింది. ఏ యింగ్లీషుపుస్తకంనేనుచదివినా, అందులోవున్నకథ చెప్పేదాకా, ఊరుకోదు. షేక్స్పియరునాటకకథలు, డీకామెరన్ కథలు, హెప్టామెరన్ కథలు, అరేబియన్ నైట్స్కథలు, అన్నీ వరసపెట్టిచెప్పేను. స్ట్రాండ్, నాష్, మొదలయిన మాసపత్రికలలోవుండే కథలన్నీ చెప్పమని పోరుతుంది. షెర్లాక్ హోమ్స్ కథలంటే కొన్నాళ్ళు చెవికోసుకొనేది. ఠాగోర్ గారికథలు, లాక్ దొరగారి నవలలు వినిపించినతరవాత, పోలీసు కథలమీద మోజుతగ్గింది. అదిగాక, వయసుమారుతూ వున్నకొద్దీ లక్ష్మికి ఆశయాలలోను, అభిరుచులలోను, మార్పు వస్తూవుందనుకుంటూ. తీక్ష్ణంగా ఆలోచనను రేపగలకథలు కావాలంటుంది.

"లక్ష్మీ! కథచదివి వినిపిస్తానుకాని, ముందు నువ్వొకషరతుకు వొప్పుకోవాలి." అన్నాను చిరునవ్వుతో.

"నాకుతెలుసు, ఆషరతు. అందుకు వొప్పుకుంటే, కథవినిన ఆనందమేవుండదు నాకు. కథ సాంతం వినకుండా విమర్శించకూడదంటారు—మధ్యమధ్య ప్రశ్నలడగకూడదంటారు—కొయ్యబొమ్మలవలె నోరుకట్టుకొని కూచోమంటారు!"

"అఛ్ఛే, అట్లాటి అన్యాయంషరతుకాదు. నీ యిష్టంవచ్చినట్లు చర్చించవచ్చు. ప్రశ్నలడగవచ్చు. వెక్కిరించవచ్చుకూడా. మధ్యమధ్య నీప్రశ్నలు,సందేహాలు, ఆక్షేపణలు—ఇవిలేకపోతే సాగనేలేదు." అని అభయంయిచ్చేను.

"అయితే మరేమిటాషరతు?" అని అడిగింది, ఆశ్చర్యంతో బొమలుపైకెత్తి.

"ఏమీలేదు. బాగాఆలోచించి, నువ్వే యీకథకు నామకరణంచెయ్యాలి." "అంటే?"

"అంటే, యేపేరుపెడితే బాగుంటుందో చెప్పాలి. సరియైనపేరు నాకేదీ తోచలేదు. నీ సహాయం కావాలి." అని చెప్పేను.

"ఓ, అలాగే! నన్నుకూడ కవిత్వంలో తర్ఫీదు చెయ్యాలని సంకల్పమాయేమిటి?...తాచెడ్డకోతి వనమంతా చెరచిందట!" అన్నాది నవ్వుతూ.

"కవిత్వధోరణి నీలో స్వతహాగావుంది. నాబోటి లేనివాళ్ళు కృషిచేసుకోవాలి. నీకు నేను నేర్ప నక్కరలేదు. ఆమాటకొస్తే, నువ్వేనాకు నేర్పగలవు." అని కాస్త పొంగవేశాను.

"పోనీ,మీరన్నమాటే వాస్తవమైతే, నన్ను గురువుగా పెట్టుకోరాదూ?"అన్నాది, పెంకెగా చూస్తూ.

"బెత్తందెబ్బలకు భయం!" అన్నాను హాస్యానికి.

"బెత్తంకూడా యెందుకు? శాస్త్రంలో మాకు ఆయుధం నిర్ణయించబడేవున్నది." అంటూ తన పొడుగైన త్రాచువంటి జడపట్టుకొని వయ్యారంగా బెదిరించింది.

లక్ష్మిసౌగసరి. అందంకలదని కించిత్ గర్వంకూడా!

"జడతో నేర్పవలసినపాఠాలు వేరు! వాటికోసం శిష్యరికంచెయ్యడం నాకు ముచ్చటే." అన్నాను సరసంగా.

సిగ్గుతో తలవంచి, ముసిముసినవ్వు నవ్వుకుంది. క్షణం ఊరుకొని, "కథచదవండి" అని ప్రోత్సహించింది.

కిటికీలోనుండి చల్లనిగాలి వీస్తూవుంది, శ్రావణమాసపు నీటిగాలి. దాదాపు పదిగంటలరాత్రి కావచ్చింది. లక్ష్మికట్టినచీర అందం, ఆమెతొడిగిన రవికరంగు, అన్నీ పరిశీలిస్తూ కూచున్నాను, పరిపరివిధాల ఆలోచిస్తూ.

చిత్రమైనమనిషి, లక్ష్మి! క్షణంక్రిందట కథచదువుతానంటే, మొర్రోవద్దని ఘోషపెట్టింది. ఇప్పుడు చదవమని నిలవదీస్తూవుంది. నిజంగా కథవినాలని కుతూహలమో, లేక నన్ను వెర్రికుట్టనిచేశామని సంకల్పమో? భర్త చిన్నవాడనీ, చదువుకున్నవాడనీ, సరస్వతీకటాక్షంవల్ల కవిత్వంచెప్పగలశక్తిమంతుడనీ, సంతోషించి గర్వించే అమాయకురాలుకాదు లక్ష్మి. నాయింగ్లీషువిద్యని తృణీకరిస్తుంది. పద్యాలు వ్రాయడానికి కూచుని, యతిప్రాసలకోసం నేనుపడే ఆవేదన చూసి, జాలిగా పెడుతుంది ముఖం. "ఆరునెలలు సాముచేసి, మూలనున్న ముసలిదాన్ని రొదిరించాడట, వెనకటికో యోధుడు! అట్లావుంది, మీ కవిత్వపటిమ! బియ్యేలు, యంయేలు చదువుకున్నామని ప్రగల్భాలు—తుదకా విద్యాప్రభావం యీరీతిగా పరిణమిస్తూవుంది. వ్రాసే దొకగీతపద్యం, లేకుంటే పిట్టకథ. అదైనాపోనీ, అర్థం తాత్పర్యం ఉన్నదైతే యేమో అనుకోవచ్చు" అని వెక్కిరిస్తుంది.

"భావకవిత్వమంటే మరేమిటనుకున్నావు?" అని యేదో సమాధానం చెప్పబోయాను, లోగడ.

"చాల్చాలు, ఊరుకోండి. వెర్రిమొర్రి గీతాలు వ్రాసి భావకవిత్వమనడం, ఉచ్చం నీచంలేని పిచ్చికథలు వ్రాసి ప్రాబ్లెమ్‌స్టోరీస్ అనడం—ఇదేగా మీ సజ్జాయిషీ?" అని యెదురుతిరిగింది.

లక్ష్మిధాటికి ఆగలేక, యీమధ్య పద్యాలువ్రాయడం బొత్తిగా మానుకున్నాను. చిన్నచిన్నకథలు, నవలలు వ్రాయడానికికూడా జంకుగానేవుంది.

స్వతంత్రగ్రంథాలే వ్రాయాలంటుంది. తర్జుమాలు, అనుకరణాలు, దాస్యబుద్ధిని నిరూపిస్తాయంటుంది. 'చిత్రంవిచిత్రం మహాచిత్రం' అన్నట్టుండాలట కథలు. అంతేకాని, పాడినపాటేపాడు దాసరీ అని, పాతపడిన తొక్కువిషయాలు మళ్ళీమళ్ళీవ్రాస్తే, యేం ప్రయోజనమని అడుగుతుంది. కథ నూతనంగా ఉండాలట, వ్రాత నూతనంగా ఉండాలట, ఆశ్చర్యం, సంతోషం కలుగుతూఉండాలట, చదువుతో ఉంటే ఫలానాకథమోస్తరని చెప్పడానికి వీలులేకుండా ఉండాలట. అప్పుడుకాని రక్తి కట్టదట, కథ. అన్నీహిరణ్యాక్షవరాలు, దానివి.

పురాణకథలువ్రాస్తే, "యెంగిలికూడేకాని రుచించదా మీకు?" అని అడుగుతుంది. సాంఘికకథలు వ్రాస్తే, "ఎంతసేపూ దేశభక్తి, పాతివ్రత్యం, విధవావివాహాలు, తోటికోడళ్ళతగవులు—ఇవేగా? తలనొప్పి!" అంటుంది. డిటెక్టివ్‌కథలువ్రాస్తే, "దొంగతనాలు, హత్యలు, విషం, రక్తం, కత్తులు, తుపాకులు, పోలీసులు—చదివేవాళ్ళకు పాడుకలలువచ్చి, ఆరోగ్యంచెడి, రోతపుడుతుంది" అని చెప్తుంది. ఇక ప్రకృతిశాస్త్రం, మానసికశాస్త్రం, నిరూపించేకథలు వ్రాస్తే, "స్వర్గానికివెళ్ళినా సవతిపోరు తప్పదన్నట్లు, కథల్లోకూడా యీశాస్త్రచర్చ యెందుకు?" అని చికాకుపడుతుంది.

"నీకు నచ్చినకథ వ్రాస్తే ప్రయోజకత్వమున్నా, లేకుంటే చేతకానితనమూనా?" అన్నాను, ఒకమారెప్పుడో.

"విద్యాజ్ఞానము, విమర్శనాశక్తి లేని నాబోటి ఆడదానికే మీపుస్తకం రుచించనప్పుడు, లోకానికేం రుచిస్తుంది? ఉట్టికెగరలేనమ్మ స్వర్గానికెగిరిందట!" అని రెత్తిపొడిచింది.

అంచేత, యేదైనా కథవ్రాయడానికి నిశ్చయించినప్పుడు, ముందుగానే లక్ష్మితో కలబోసుకోవడం

నాకు పరిపాటయింది. ఆమెతో చర్చించినపిమ్మట, ఒక్కొక్కప్పుడు వేసుకున్నప్లాటు తల్లక్రిందుగా మారిపోవడంకూడా కద్దు. మొండివాదనైనా, లక్ష్మిది సూక్ష్మబుద్ధి. నిజంకనిపెట్టి నిర్మొగమాటంగా చెప్తుంది. తిక్కతిరిగి శ్లాఘించడానికి ప్రారంభించినా, అంతే. భుజాలుపొంగేటట్లు పొగడి, ఆకాశాని కెత్తేస్తుంది. తెలుగుపుస్తకాలలో అప్పారావుగారి "కన్యాశుల్కం"వంటి ఆదర్శగ్రంథం మరొకటి లేదని వాదించింది, నాతో అనేకసార్లు. ఆమోస్తరుగా వ్రాయడానికి ప్రతీవాడికీ చేతవుతుందా, మరి?

నవ్వుకథలంటే బలేసరదా లక్ష్మికి. హాస్యరసం వ్రాయలేనికవిని శుంఠగా భావిస్తుంది—అతగాడెంత ఉద్దండపండితుడైనాసరే. అయితే విషాదాంతకావ్యాలలోను, యేడుపుకథలలోను, ఉండే స్వారస్యం గ్రహించలేదనికాదు. "ఒథెల్లో" నాటకం చాలా గొప్పదని పొగడుతుంది. ద్విజేంద్రలాల్ రాయిగారి "షాజహాన్" నాటకం హిందీలోచదివి, "షేక్స్పియర్ వ్రాసిన 'లియర్' నాటకంకంటె, రెండున్నరెట్లు బాగుంది, యిది" అని అభిప్రాయం యిచ్చింది.

మొత్తంపైని యేకథచదివినా, అందులోఉండే లోపాలే ముమ్ముందు కనిపిస్తాయి, లక్ష్మికళ్ళకి. ముఖ్యంగా నేనువ్రాసిన కథలైతే, బూరెల్లోపురుగు లెంచినట్లు, వాట్లోవుండే లోటుపాట్లను వెతికివెతికి పైకితీస్తుంది. చిన్నకథైతే, యెందుకీ బాలకవిత్వమంటుంది. పెద్దకథైతే, చేంతాడులాగుచదివిన కొలదీ పెరుగుతూవుందేమని చికాకుపడుతుంది. కథలో నాయకిని రూపవతిగావర్ణిస్తే, "అవును, నాయకి అన్నది అందంగాఉండకపోతే కథనడవదు. మీపెద్ద కవులెవరూ కురూపినాయకిన్నిగూర్చి వ్రాయలేదుగా?" అని యెగతాళిచేస్తుంది. నాయకిని సామాన్యంగా చిత్రిస్తే, "కథలోకూడా ఆడదాన్ని అసహ్యపరచాలా? మాటవరసకైనా స్త్రీని గౌరవించకూడదు కాబోలు! మీమొగవాళ్ళకంటికి, ఆమెలోఉండేలోపాలే ముమ్ముందుగోచరిస్తాయా?"అనిపోట్లాడుతుంది.

ఒకమారెప్పుడో నవ్వుకథేదో వ్రాశాను. సంతోషిస్తుందికదా అని లక్ష్మికి చూపించాను. శ్రద్ధగా తనలో చదువుకొని, యేమీఅనకుండా చేతి కందించింది.

"నవ్వు రాలేదూ,—ముంగిలాగు మూతిముడుచుకొని చదివావు?" అన్నాను.

"ఏడవలేక నవ్వాలి, మీకవిత్వంచూసి."

"అదిగో, నోటిదురుసుతనం మహా ఉందిసుమా, నీకు!" అన్నాను కోపంతో.

"నిజంఅడితే నిష్ఠూరం! ముందుగానే చెప్పలేకపోయారూ, యీకథచదువుతూ నవ్వాలిసుమా అని? నాకేంతెలుసు, అది హాస్యంకథఅని? మీవంటి కోపదారికవులు హాస్యాలువ్రాస్తే, దూర్వాసముని సరసంవలె ఉంటుంది."

చిన్నబుచ్చుకొని ఊరుకున్నాను. నావేపు అట్టే నిదానించిచూసి, పకపకనవ్వుతూ, "ముక్కుమీద ఉంటుంది, కోపంమీకు! ఏమంటారో చూదామనే, నేనూ రెట్టిస్తేను. నవ్వొచ్చినా అణిచిపెట్టుకొని, నవ్వలేదు. అంతేకాని, మరేంలేదు. కథ చాలా బాగుంది" అని సమాధానంయిచ్చి, వొళ్ళుపులకరించేటట్లు పొగడింది.

ఇట్లాంటిముచ్చట్లువెనకటివన్నో జ్ఞాపకంవచ్చేయి. కథ చదువుదామన్న అభిలాషకొంచెం తగ్గింది. కాని చదవకపోతే లక్ష్మికి కోపంవస్తుంది. సొగసుకత్తెలకు అలకకూడా ఒక శృంగారమే అన్నమాట యెరుగుదునుకాని, లైటు కొంచెంపెద్దదిచేసి, కాగితాలు తీశాను, కథచదవడానికి.

అకాల వర్షం ప్రారంభమైందికాబోలు, చినుకుల చప్పుడు వినవచ్చింది. గాలి తీవ్రంగా వీస్తూవుంది, కిటికీలలోనుండి దీపం నిలిచేటట్లులేదు. ఉయ్యాల్లో వున్నపిల్లవాడు కెవ్వున యేడుస్తూలేచేడు. తృళ్లిపడి లేచింది లక్ష్మి.

"పోనీ, రేపు చదువుకుందాంలే, కథ. ఇంకా కొద్దిగా వ్రాయవలసివుందికూడా. పద, నాకూ నిద్ర వస్తూవుంది" అంటూ దీపంతగ్గించి లేచేను.

# దుఃఖమయ ప్రపంచము

తుమ్మలపల్లి వేంకటసీతారామారావుగారు (సాహిత్యమండలి)

'బాబూ! చాలాపొద్దుపోయింది. నిద్దరపట్టించుకో' అన్నది శాంత. 'నిద్దుర రావటంలేదే, అమ్మా!' అన్నాడు మంచముమీదపండుకొని బాబు. 'కళ్లుమూసికొని మాట్లాడకుండాపడుకో అదేనిద్రపడుతుంది.' బాబు కళ్లుమూసుకొన్నాడు. ఉలిక్కిపడి 'అమ్మా! ఎవరేవచ్చింది?' 'ఎవరూ రాలేదు. నువ్వు నిద్రపో.' 'అమ్మా! ఎందుకుఏడుస్తావు? నీకుభయంవేస్తూన్నదా?' 'లేదు. బాబూ! నువ్వు కండ్లుమూసుకొని పడుకోవాలి, లేకపోతే జ్వరంతగ్గదు.' 'నాన్నగారు ఏరే డాక్టరునుపిలవడానికి?' శాంతహృదయం తరుక్కుపోయింది. కంటినుండినీరు బొటబొట ప్రవహిస్తూవున్నది. గతభర్తృకఅగు శాంత పుత్రుణ్ణి ఊరడించలేకపోయింది. కొంచెముసేపటికి ధైర్యముతెచ్చుకొని 'మామయ్యవెళ్లేడు డాక్టరుకోసం' అని జవాబుచెప్పింది.

'మామయ్య ఎప్పుడు వచ్చేడే?' అన్నాడు బాబు. 'నిన్నరాగానే నిన్ను పలకరించలేదు? అప్పుడే మరచిపోయినావు?' 'లేదులే! నేను ఎక్కడికన్న వెళ్లి క్రొత్తఊళ్లు చూడాలి.' 'జ్వరం నయంకాగానే మామయ్యగారి ఊరువెళుదువు గానిలే.' 'మామయ్యగారి ఊరువెళ్లను. అదంతా నేనుచూచేను. నాకు అక్కడ బాగుండదు.' 'మరి యింకెక్కడికి వెళతావు?' 'నేను చెప్పను. చెప్పితే నువ్వు కూడావస్తానంటావు.' 'నేనురాను. చెప్పు!' 'నేనువెళ్లేక నీకుఉత్తరం వ్రాస్తాను.'

శాంత దృష్టిఅంతా బాబుమీదనే ఉన్నది. అతడి ఒళ్లంతా ముచ్చెమటలుపోసినవి. దుర్గుణములు అధికమైనవి. ఇక లాభములేదని డాక్టరు వీధిలోనుంచే వెళ్లిపోయినాడు. వేంకటరావు గ్రుడ్లల్లో నీరు కుక్కుకొంటూ చెల్లెలి దగ్గరకువచ్చేడు. 'డాక్టరు ఏడీరా? అన్నయ్యా!' అన్నదిశాంత. 'వస్తున్నాడు' అని విచారంతో బదులుచెప్పేడు.

శాంత రోగి ముఖవికాసాన్ని క్షణక్షణము ఆత్రముతో పరిశీలిస్తూంది. బాబుముఖమండలంలో ఒకచిరునవ్వు మెఱసింది. నవ్వుతూ గదంతా ఒక్కమారు కలియచూచేడు బాబు. శాంత దైన్యముతో అతనివంక తేరిపారచూస్తూన్నది. తనగుండెలమీదఉన్న ఆమెచేతిని తనశిరోభాగాన అలంకరించేడు. బాబు చిరునవ్వుతో 'అమ్మా! నేనువెళతాను' అని కండ్లుమూసుకొన్నాడు.

పెద్దనిట్టూర్పుతో శాంత అతని శరీరంమీదవ్రాలి ఆక్రోశించింది. గృహమంతా హాహాకారములతో నిండిపోయింది.

# స్త్రీ స్వాతంత్ర్యము

వి. గోపాలకృష్ణమూర్తిగారు

స్త్రీ పురుషుని సౌఖ్యార్థమై సృజింపబడిన విలాసవస్తువని కొందరి యుద్దేశ్యము. ఆమె జన్మించునది, జీవించునది, మరణించునదికూడ పురుషునికొరకే. పురుషసేవయే ఆమె జీవితపరమావధి. వినయము, కష్టసహనము, సేవ, పాతివ్రత్యము—స్త్రీయనిపించుకొను ప్రతియామెకు నుండి తీరవలెను. భర్త ఎంత దుర్మార్గశిఖామణియైనను భార్య అవగింజంతయైన అవిధేయత చూపరాదు. అతనిదుశ్చేష్టల విమర్శింపరాదు. తుదకు నోరెత్తనైనకూడదు. రేయనక, పవలనక, కొట్టినభరించి, పెట్టినతిని, నిష్కల్మషహృదయముతో భర్తృపాదపంకజముల భజించుచుండవలెను. భర్తతన్నన్నిహక్కులలో ననుభవించుట కెట్టిభంగమును వాటిల్లనీయకుండుటకై, తనయాకృతి నెవ్వరును జూడకుండ, తనశరీరము నెవ్వరు స్పృశించకుండ జాగ్రత్తపడవలెను. ఏకారణముచేనైన సర్వస్వామ్యసంకలితమగు నాభోగ్యపదార్థము నెవ్వరైన ముట్టినచో—లేక నట్టిసందియమున కెడమున్నచో చాలును. చిల్లిపడిన మట్టికుండవలె విసరిపారవైచెదరు. ఇందులకు సంఘము సహాయపడదు. ప్రభుత్వమడ్డురాదు. ఈభర్తృసేవాభిలాష అనన్యప్రేరితముగ, సహజముగ, సాంఘికనియమబద్ధముగ కాక, హృదయమునుండి పొంగిపొరలివచ్చెడి ప్రేమఫలితముకాదు. ఐనచో నిక చిక్కేయుండదు. స్త్రీ, స్త్రీగా పుట్టుటయే కారణముగ నామెకట్టివిధులు నిర్ణయింపబడినవి. ప్రపంచము పుట్టినప్పుడేపుట్టినదీపద్ధతి. దీనినిగూర్చి ప్రశ్నించుట కెవ్వరికిని హక్కులేదు. దీనిని ఋజువుచేయుట కణుమాత్రమైన శ్రమపడు టనవసరము.

ఊహాప్రపంచమున మాత్రము కొంతమంది స్త్రీకి అత్యంతగౌరవనీయస్థానము నొసగెదరు. స్త్రీ శక్తిస్వరూపిణి, వీరమాత, త్యాగమూర్తి, సౌందర్యావతారము—ఇత్యాది కడుమధురమగు నామాంతరములనిడి పలువిధముల కీర్తించెదరు. లోకమునంతటిని సమ్మోహితమొనర్పగల వైరాగిచిటికెలుగలవట ఆమెవద్ద! కవిశిఖామణులు తమ యనర్గళకవితాధారచే స్త్రీసౌందర్యమును కీర్తించుచుందురు. కరస్పర్శమొనరించినంతనె కందిపోయెడి మృదుహస్తములు, తాకినమాసిపోయెడు పదియార్వన్నెల బంగారుమేనిఛాయ, తుమ్మెదరెక్కలవంటి కనుబొమలు, ఆణిముత్తెములబోలు పలువరుస ప్రతికవికిని కావలసినంత కవితాసామగ్రిని చేకూర్చినవి. వీరి యమూల్యకవితాప్రవాహముచే పురాణములు, కావ్యములు, ప్రబంధములు నిండిపోయినవి. సంసారనావకు కర్ణధారిణి, గాఢాంధకారప్రపంచమున దారిజూపెడి దివ్వెయని స్త్రీని వీనులవిందగు వాక్యరత్నములలో వర్ణించినారు. స్త్రీ గృహలక్ష్మియనియు, అర్ధశరీరమనియుకూడ కీర్తించుచుందురు. కొంచెమాలోచించినచో నీవిషలిప్తఅమృతగుళికల రహస్యము తెలియకపోదు. స్త్రీకి తనదుస్తుల నిర్ణయించుకొను నధికారము లేదు. మగనికిపెట్టుటకుముందు భుజించు ప్రాప్తములేదు. మగడులేక గాలి పీల్చుటకైన బయటికి కదలెనా, ఆమెను సాంఘికబహిష్కరణ మొనర్చుటకు తగినంత కారణము. కనుకనే స్త్రీలను బండిలోనెక్కించి, సూర్యకిరణములనైన లోనికిరానీక, పైయుత్తరీయములతో గట్టిగబంధించి బండిప్రక్కనే నడచెడు పురుషసింహులను పెక్కుమందిని చూచుచున్నాము. కాళ్ళుకాలకుండ చెప్పులను, నెత్తిమాడకుండ గొడుగునైన నుపయోగింపనోచుకోని స్త్రీ హృదయమునకు రాణి, గృహమునకు లక్ష్మి, ప్రపంచమునకు ప్రభ్వియనెడు బిరుదావళిచే సంతృప్తిపడవలెను కాబోలు! విద్యావతియైనచో తనఅన్యాయాధికారమును తిరస్కరించునేమో, ప్రపంచపరిస్థితుల నెరిగినచో స్వతంత్రతాజాడ్యమామె కంటునేమో, ఇంకేమి జరిగిన నేమిమునుగునోనని సర్కసులోని జంతువునువలె స్త్రీని సాకుచున్నాడు పురుషుడు. స్త్రీకి సంఘమునందు స్వతంత్రస్థానములేదు. రాజుగారికుమార్తె కూలివానిని పెండ్లాడినచో దాసియగుచున్నది. కూలివానికుమార్తె రాజును పెండ్లాడినచో

రాణియగుచున్నది. స్త్రీస్థానము పురుషునిస్థానమునుబట్టి నిర్ణయింపబడుచున్నది. స్త్రీ పెండ్లియైనంతనె భర్తయధీనరాలైపోవుచున్నది. అప్పటినుండి ఆమెయభీష్టములను, అభిప్రాయములను, అభిరుచులను భర్త పరిపాలించుట కారంభించును. ఆమె సూర్యోదయము మొదలు మరల సూర్యోదయమువరకొనర్చెడు కార్యక్రమమంతయును భర్త సంతృప్తికొరకే. ఆమె ఏయేసందర్భములలో నెట్లు మెలగవలెనో, చక్కని శ్లోకములలో వల్లి భర్త అవసరమగునప్పుడెల్ల వానినివిసరుచు కర్తవ్యమును నిర్ణయించుచుండును. మంచిచెడ్డల వివక్షత లేక, పురుషసేవ బాగుగనొనర్చిన స్త్రీరత్నముల జీవితచరిత్రలను, బాలికాపాఠశాలలలో పాఠ్యపుస్తకములుగ నియమించి, బాల్యమునుండియును వారికి పురుషసేవాభిలాషను పెంపొందింపజేయును. ఆమెకునేర్పు విద్యయొక్క ఆదర్శమిదియే. ఈవిధముగ స్వేచ్ఛను కాలదన్నెడి స్వతంత్రాభిప్రాయశూన్యయగు భార్యను తయారుచేయుచున్నాడు. భార్యాత్వము దాస్యత్వమునకు పర్యాయపద మొనర్చినాడు.

స్త్రీజన్మ పురుషుని సౌఖ్యముకొరకేనని స్త్రీనికూడ పురుషుడు నమ్మించినాడు. పురుషునికంటె ముందు స్త్రీ తనసౌఖ్యము నాలోచించుకొన్నచో, మహాపాతకమను విశ్వాసమునెన్నటికి చలింపనట్లుగా నామెయందు నాటినాడు. ఈనాడు స్త్రీకి స్వతంత్రతనిచ్చెదమన్నను "వలదు! వలదు!"ని గోలపెట్టుటాశ్చర్యజనకము కాజాలదు. విజయసూచకమందహాసముతో పురుషుడు "ఆమె స్వేచ్ఛను కోరుటలేదు. నాయధీనమున నుంటయే యామెకు సౌఖ్యదాయకము!" అని ప్రపంచమునకు చాటుచున్నాడు. పాపము! స్త్రీ, పురుషసహాయములేని తన జీవనమునుగూర్చి యూహింపనైనలేకున్నది. మానసికముగ ఆర్థికముగ, శారీరకముగ, రాజకీయముగ స్త్రీని పెద్దగుండుసున్నగ, తన ఛాయామాత్రముగ, ఎటుబట్టినటు తలయూపెడి గంగిరెద్దువలె పట్టుకొనివచ్చినాడు పురుషుడు. దినదినమును మెల్లమెల్లగ ఆమె హృదయమును తినుచు చిత్రవధగావించి తుదకు స్వాభిప్రాయశూన్యగా నొనర్చుచున్నాడు. స్త్రీబుద్ధి ప్రళయాంతకమనియు, స్త్రీని చెప్పుక్రింది తేలువలె పాలింపకపోయినచో ముప్పువాటిల్లుననియు శాస్త్రములరచించినాడు.

ప్రభుత్వములుకూడ స్త్రీపట్ల నిట్టియనాదరణమునె చూపుచున్నవి. పురుషులచే, పురుషులకై నడుపబడు ప్రభుత్వము స్త్రీపట్ల నిట్లుగాక భిన్నముగ వర్తించునని యాశించుటకాని, ఊహించుటకాని వివేకశూన్యత కాక మరేమగును? ఈపరిస్థితి యీదేశమునకేగాదు. ప్రపంచమునందంతట నింతగనెయున్నది. స్త్రీ పురుషుని సొత్తను సిద్ధాంతము మాత్రమన్ని దేశములలో నాచరణలోనున్నట్లే. అచ్చటచ్చట వినోదమునకో, అలంకారార్థమో ఒకరిద్దరు స్త్రీలను చట్టసభలలోను, మంత్రివర్గములోను చొప్పించుచున్నారు. వీరినిజూచి స్త్రీలోకమంతయును సంతోషతరంగముల నోలలాడవలె కాబోలును. మనదేశపుపరిస్థితులు మరియు విపరీతములు. హిందూన్యాయశాస్త్రమునందలి వారసత్వము వివాహము మొదలగు చట్టముల హాస్యాస్పదోదంతము జెప్ప బూనుచో నదియొక యుద్గ్రంథమగును.

బానిసత్వమమలులోనున్న కాలమున నొకబానిస యజమానితో "బానిసత్వము భగవదిచ్ఛకు కేవలము విరుద్ధముకాదా?" యని నీవు ప్రశ్నించుచో నాతడేమి చెప్పెడివాడో తెలియునా? "అది పొరపాటు. బానిసమీద నాకన్నిహక్కులునుగలవు. నేనాతనినెక్కి తిరుగవచ్చును. కోసితినవచ్చునని సమాధానమిచ్చెడివాడు." స్త్రీపై తననిరంకుశాధికారమును సమర్థింపనెంచెడి పురుషునితార్కికజ్ఞానసంపత్తి ఇంతకంటె అభివందనీయమా? "స్త్రీలందరును మాయధీనలు. వారిమాంసము, రక్తము, మనసు, హృదయము—సర్వమును మాసొత్తు"ని పోరాడుట భగవత్సృష్టినే నిరర్థకమొనర్చుటకాదా?

స్త్రీలు స్వతంత్రలైనచో, అరరే......ఇక నేమున్నది? ప్రపంచము తారుమారై, సాంఘికశాంతి నశించి నరకతుల్యమైపోవునని పెక్కుమంది భయకంపితులగుచున్నారు. వారికట్టి తలపువచ్చినంతనె, కొన్ని భయానకదృశ్యములు వారి మనోనేత్రమునకెదుట కన్పట్టుటచే వారు మూర్ఛితులగుచున్నారు. ఇంత యార్భాటమేల? ఇంత హడావిడి యెందులకు? తరతరములనుండి చలాయించుచున్న పురుషుని యధికారమంతర్ధానమగుననుభయమే దీనికికారణము. తనయుద్దేశ్యము నిట్లున్నదున్నట్లు చెప్పక "స్త్రీ స్వేచ్ఛగ చరించినచో అవినీతి కవకాశముండునుకదా" యని తనధర్మసందేహమును బయల్పరచును. పురుషుడొనర్చెడు అకార్యపరంపరకేమి సమాధానమయ్యాయనినచో "సృష్టిలో స్త్రీపురుషభేదమేల కల్పింపబడినద"ని ప్రశ్నింప సాహసించును. పురుషజన్మ అధర్మాచరణమున కాజ్ఞాపత్రమని కాబోలు వీరియుద్దేశ్యము. పురుషుడు తప్పు చేయుచో నెవ్వరతని వద్దుచున్నారు? అతని అక్రమవర్తన నెవ్వరాపుచున్నారు? సంఘము, భగవంతుడని సమాధానమీయవచ్చును. ఆసంఘమే, ఆభగవంతుడే స్త్రీనికూడ నేల పరిపాలింపరాదు? మధ్య పురుషుని కరణీకమేల? భారతీయుల శ్రేయమునకే ఇన్నివేల మైళ్ళదూరమునుండివచ్చి ప్రయాసకోర్చి వారిని పాలించుచున్నామని కొంతమంది ఆంగ్లేయులు చెప్పెడి త్యాగపూరితోపన్యాసములపట్ల మనవారాగ్రహావేశులగుచున్నారే? స్త్రీజనశ్రేయమునకే వారిని అస్వతంత్రులుగ నొనర్చితిమనుట న్యాయబద్ధమెట్లగును?

స్త్రీలు స్వతంత్రలైనచో వారవినీతివర్తనులగుదురనుట కేవలమవివేకప్రభావమే. స్వాతంత్ర్యనిరోధమే అవినీతికి ప్రోత్సాహకరము. స్వేచ్ఛావాతావరణమున విశాలదృష్టితో నెదిగినవారు నీతివర్తనులగుట సహజము. కలికమునకైన స్వేచ్ఛనెరుగని వారవకాశమున్నపుడెల్ల నకార్యములనొనర్చుట స్వాభావికము. మానవసహజమును. జన్మసత్వమునగు స్వతంత్రతాప్రభావమునెరిగినవారెవ్వరును దానిని దుర్వినియోగపరచరు. ఇది స్వేచ్ఛాధర్మము. ఒకవేళ దానికి ఎచ్చటనో కొన్నిచోట్ల భిన్నముగజరిగిన జరుగుగాక. అంతమాత్రమున నసలు సిద్ధాంతమునకేమియు భంగమురాదు. ఇందులకుకూడ కొంతమంది స్త్రీస్వాతంత్ర్యప్రతిపక్షులంగీకరింపకపోవచ్చును. ప్రపంచమునగల సగముకంటె నెక్కువజనసంఖ్యను దాసిత్వమునసుంచి, తత్ఫలితముగ నిట్టియతులకుబెట్టిన కృత్రిమశాంతినివరించుట గుమ్మడికాయను వదలి ఆవగింజను గట్టిగబట్టినట్టు.

కొందరు స్త్రీస్వాతంత్ర్యమునకై ఇంత యాందోళనమొనర్చుట వెర్రియనియు, స్త్రీ అవసరమును అర్హమునగు దానికంటె నెక్కువ స్వేచ్ఛనే ఇప్పుడనుభవించుచున్నదనియు, పురుషుడు సంపాదించి తెచ్చిన దానిని ఇంటనుండి భుజించుట స్త్రీకి మిక్కిలి సౌఖ్యదాయకమనియు చెప్పుదురు. కనుకనే ఆమెను ఎండ తగులనీయక, వానకు తడువనీయక, ఇంటిబయట పనిచేయనీయక, ఆలోచింపనీయక విలువగల బొమ్మవలె వాడుచుందురు. ఆమె పనిచేసినచో బాధకల్గునేమోనని పురుషుడు తానే శ్రమపడి సంపాదించి యామెను పోషించుచుండును. ఆలోచించినచో నామె మెత్తనిమనసు వ్యాకులపడునేమోనని తానె యోజించి ఆమెకొరకై సర్వకార్యముల నిర్వహించుచుండును. శ్రమపడి కళాశాలలకువెళ్లి చదువలేదని, తానె విద్యనభ్యసించి పట్టభద్రుడగుచున్నాడు. ఆహా! ఏమిఔదార్యాతిశయము!--స్వతంత్రతాప్రాథమికోద్దేశ్యమునెరిగిన వారెవ్వరు నిట్లు పలకరు. తాను స్వీకరించెడి ప్రతిఫలమునకు తగిన పరిశ్రమను తానొనర్చినప్పుడే, ఆమె యాఫలితమున కర్హురాలు. తానితరులకుచేయు పరిచర్యకైనను తనయిష్టములేనపుడు మానివేయునధికారముండినప్పుడే అది స్వచ్ఛందమగుసేవ యనిపించుకొనును. లేనియెడల దాస్యముక్రిందనే చేరును. స్త్రీ ఆర్థికముగ స్వతంత్రత నొందవలెను. ఆమెకూడ తనకై తాను సంపాదింపగలిగియుండవలెను. తిండికిని, గుడ్డకును పురుషుని దేవురించెడు నవస్థయంతరించవలెను. ఆర్థికముగ తనకాళ్ళమీద తాను నిలబడగలశక్తిని సంపాదింపవలెను. స్త్రీపురుషులిద్దరును, ఆర్థికముగ సమానమగుబాధ్యతను వహింపవలెను. అసలు స్త్రీపరాధీనతాజాడ్య మిచ్చటనే

అంకురించినది. ఔషధమిచ్చుట పడిననేకాని రోగనివారణ జరుగదు. పురుషులొసగెడి యాభరణములతోను, అతడిచ్చెడు దుస్తులతోను స్త్రీకులికినచో ప్రయోజన మావంతైన లేదు. ప్రభుత్వముకూడ నిప్పట్ల శ్రద్ధవహించి వారసత్వము మొదలగు చట్టములసవరించి స్త్రీపురుషపక్షపాతమును తొలగించవలెను. సంఘముకూడ తన బాధ్యతను గుర్తించవలెను. స్త్రీని పురుషునికంటె ఎక్కువగాగాని తక్కువగాగాని చూడరాదు. సరిసమానముగ పరిగణించవలెను. స్త్రీస్వాతంత్ర్యసమస్యపట్ల పురుషుని విశాలదృష్టికి గర్వము, అధికారవాంఛ, పూర్వాచారము నడ్డుతగ్లుచున్నవి. ఉదారస్వభావ పూరితుడైవగాని, తనజన్మను సార్థకపరచుకొనజాలడు. సంకుచితదృష్టినివీడి స్త్రీపరాధీనత ప్రపంచమున కెన్నటికినిపోని పెద్దమచ్చయని పురుషుడెంతత్వరలో తెలిసికొన్న అంతమంచిది.

స్త్రీయాజ్ఞలచే పరిపాలింపబడు పురుషులుకూడ కొంతమందిగలరనియు, వారు రేయుంబవళ్ళు పొలములోను, ఆఫీసులలోను చెమటయోడ్చి తెచ్చెదు కష్టార్జితమంతయు వారిస్త్రీల చీరలకును, రవికలకును సరిపోవుచున్నదనియు, వారికి కూడుగుడ్డయైన సరిగలేదనియును కొందరు చెప్పుచున్నారు. పాప మిట్టిపురుషులకు మా సంపూర్ణసానుభూతి దెల్పుచున్నాము. వారు తమ హక్కులకైపోరాడి త్వరలో దాస్యవిముక్తులగుదురుగాక! ఇతరులహక్కుల భంగపరచుట గొప్పపాపమని, వారిస్త్రీలు తెలిసికొనుట మిక్కిలి యవసరము.

స్త్రీ, పురుష భేదములేక సర్వజనులును స్వాతంత్ర్యదేవత నారాధింతురుగాక!

# భారతనారీమణి

డొటుకూరు సత్యనారాయణరావుబహద్దర్ గారు

అట భేరీధ్వనియున్ కృపాణమును రథ్యల్ లేవు, యుద్ధావనీ
తటముల్ శాంతగభీరముల్ సెలగె కాంతాలోకపాదాంచల
స్ఫుటదామూలవినూత్ననూపురరవోన్మాదంబు; ఈత్యాగ మెం
తటి మాహాత్మ్యనకైన పాతమగుగాదా తల్లినర్చింపగన్.

ఆశాంతమ్ముల దాకబ్రాకినదొ శంఖారావ మంతఃపుర
ప్రాసాదమ్ముల స్తన్యమిచ్చు పసిపాపన్ తొట్లెనూరార్చి ఆ
వేశస్ఫూర్తిని మాతృదాస్యహృదయోద్వేగమ్ము వేధింప నీ
వో శంపానుకుమారమూర్తి! చనినావో బంధిఖానాలకున్.

కనులన్ జెంచెనుతండ్రి, సర్వమునునీకై కూర్చి నీప్రేమ భి
క్షునె యర్థించెను భర్త, పూజ్యగృహరాజ్యశ్రీవి, నీగాత్రమె
ల్లను దండాహతమయ్యె, శోణితముకాల్వల్ గట్టె, ఈబాధలో
ననె శాంతంబట వెట్టితల్లి! ఇటులెన్నండేని నీవోర్చితే!

జిలుగుంబావడ లెందుపోయినవో, కాంచీస్వర్ణఘంటారవ
మ్ములవే ప్రాన్పడిమూగవోయె, భువనమ్ముల్ భ్రాంతిరేకెత్త ని
శ్చలప్రేమైకరసోదయోచ్చలితవీక్షాసాధురేఖాళి కం
జలియైతైన్; తరియించె నీభరతవంశంబెల్ల నీదీక్షచే.

# బేరీ వెంకు

పాటిబండ మాధవశర్మ గారు

[పద్మనాయకలక్ష్మికి కన్నుకుట్టిన విజయరామభూపతి బొబ్బిలిం దనచే నేలించుమని బూసీకి పాదాక్రాంతుడైనాడు. పండ్రెండులక్షలవెండితో కన్నులుమిరుమిట్లుగొన్న పరాసుడు బొబ్బిలిపై నెత్తిన ఘోరరణములో నద్భుతవిక్రయము నెరపిన కోమటికొమ్మ వెంకు.]

౧

"వీరకుమారులంగనిన వెల్మకులాంగనలార! లెండు! ని
ద్రారతమైయణంగిన పురారణవిక్రమ లేలి? హావజి
హ్వారటితస్ఫుటత్స్వరశ్రవఃపుటలై యరిలోకభీతికృ
న్మారణమూర్తులై విహరణమ్మొనరింత్రు సమిద్ధరాస్థలిన్.

౨

వనితమెపూనుకున్నతరువాత పరాసులలెక్కయేమి? పో
రున నిలువంగలారె యమరుల్ సయితమ్ము? ఇకచూతురేల? లెం
డనియొనరించి బొబ్బిలిగడమ్మును చుట్టిన యీపిశాచిమూ
కనుబరిమార్చి కాచెదముగాక ప్రభున్ మనరంగరాయనిన్."

౩

అనియుద్బోధయొనర్చు వెంకు విలయవ్యాఘూర్ణితాబ్ధచ్యుత
స్తనితధ్వానము వెంట లేచినవి వందల్ వేలులక్షల్ ఖణిల్
ఖణిలంచున్ మిరుమిట్లుగొల్పు శితఖడ్గశ్రేణితోడన్ ఘణం
ఘణనిక్వాణిత హేమకంకణమనోజ్ఞస్త్రైణహస్తాగ్రముల్.

౪

కీలిత హేతిహస్తములు, కింశుకరక్తముఖమ్ము లుష్ణకీ
లాలపిపాసులౌను పులులాయవి? మాహిషరాక్షసాధమో
న్మూలిమహాశివాప్రళయమూర్తులొ? కాకవి యాడువేపులా?
వేలకువేలుగా బయలువెళ్లెను బొబ్బిలికోటవాకిటన్.

౫

ఆవిర్భూతసహస్రతిగ్మఘృణితేజోఽఖిలసంవర్తవే
ళావాలాహకమాలికాగళితతాళతళ్యశంపాసహ
స్రావాసమ్మగు వెల్గువెల్గినదటా సాయంవివస్వద్ద్యుత
స్త్రీవక్త్రోపరిలంబికై శికచద్ధల్ఘోరమౌ బొబ్బిలిన్.

౬

వెంకుపల్కునపల్కు శబ్దించుచున్న
వెంకునిట్టూర్పు వేడికొల్పించుచున్న
వెంకుకన్నీటి ధారద్రవించుచున్న
గాలివీచిన దాంధ్రలోకమ్ముమీఁద.

౭

మాయాకృత్యవిదగ్ధుఁడౌ విజయరామక్ష్మాపుపై న్యాలనే
డీయూకుంబులితోఁడ డీకొనెనుదండిరగల్గువీరుండు? ని
ర్మాయల్ నిష్కపటాత్మలౌ సతుల దుర్మార్గుండుబూచీ పడం
ద్రోయించెన్ జ్వలదగ్నికుండమున విద్రోహంపువ్యూహమ్మునన్.

౮

ఆవీరప్రమదాప్రతాపనిధు లన్యాయమ్ములయ్యెన్ దహత్
దావంబందు!—తదీయగాత్రములమీఁదన్ రేగి నర్తించుజ్వా
లావర్చస్సులకంజలింత్రు నయరుంద్రధ్వాంతలై నిచ్చలున్
జీవచ్చిత్రములైన యాంధ్రధరణీసీమంతినీసంఘముల్.

—ఈగాథ జానపదగీతములనుండి గృహీతము.

# శరద్రాక

ఏటుకూరి వేంకటరామయ్యచౌదరిగారు

వేలుపుబువ్వ, పాల్కడలివెన్న, శరద్రమచేతిదివ్వె, కం
కాళము, కాలపూరుషుని కమ్మనిచల్వలబెంకి, కల్వపూ
బాళి, చకోరపాళి తుషభక్తము, సౌధపుముద్ద, శంకరో
త్తాలశిరోవిభూషణము దా శశి పూర్వనగంబుఁ బ్రాకెడిన్.

నిగనిగవెండిపూత బురుణించెడునంబరమధ్యవ్రేలు గొ
జ్జగిపువుసోనకాళ్లఁ జిఱుజాజిజవాజుల జగ్గునిగ్గు మే
ల్జిగిశరదాంతచంద్రికలఁ జిందుమొగుళ్లనిగారమెత్తి సం
పెఁగపాదరిండ్లఁ జంద్రశిలఁ జేరినమీఁగడనింపె శార్వరుల్.

ఈమృదుచంద్రికావిసర మీనవశారదకాంతమైన పూ
గీమునఁ గమ్మపుప్పొడులఁ గీల్కొనుచిక్కని తేనెవార్చి యెం
తో మహనీయమైపొసఁగెఁ దోరఁపుబంతి చకోరవార మా
రామమునందుఁ బెట్టెను విరామములేక మధుప్రసక్తితో.

మనిఁగర్పూరపరాగపాండురము శుంభద్వేగమై పర్వ న
ల్లన గంధానిలడింభకాగ్రణి జగల్లావణ్యముం బేర్చి వా
సనలోఁ గట్టె శరద్భ్రమాకరవ్యాపృతిన్ సన్యాసియై విశ్వమో
హనపాదచ్యుతుఁడౌచు వీడెనన సౌరభ్యంబు వాసించెఁగా.

వెన్నెలతీవెల స్తగిరవీఁగిన యామినిఁద్రవేగిపోవ సం
పన్నలినాక్షియాలయముఁ బాసి సువర్ణపటాంచలంబు సం
ఛన్నముగాఁగ విశ్వముఁ బసందుగఁ గప్పిన మోహవృత్తిన
భ్యున్నతివీడెనీప్రకృతి పూచిన వెన్నెల వీచికాయగన్.

పూవులబుట్టనాఁగ గగనపూర్వతలంబు నడించి యామినీ
సేవఁ దొలంగి శారద వసించుకుఘుంగము పూవుఁ దేనెఁ గో
కావిలమై బసిండియలుకై పరిపూరితసాధమై శుభం
భావుకమై సువాసనలపట్టయి మించఁగ గిల్కరించెడిన్.

శశికాంతద్యుతిజాలు వారె జగదాశాపాండిమంబీఁగఁ బూ
విశిఖంబుల్ జెలరేఁగ మోహనరసావిర్భావముం బేర మే
నిశితంబై గణునొచ్చె దంపతులు నిర్ణిద్రాత్తరాకాశర
న్నిశిసౌరభ్యచకోరకంబయి జగన్నీరంధ్రమే పారెడిన్.

జలజలకొండరాలవయి సాగెడు వెండిరసప్రవాహమం
గళనినదంబు బర్వెడు జగచ్ఛ్రివణామృతమూరగా సుధా
విలసితమై భవాండమున వెన్నెలకుప్పలు చెల్లుగుట్టలై
వెలసెడునేత్రపర్వమయి విన్ననపున్నమచంద్రుఁడొప్పగన్.

కురియుతుషారవర్షమునకు న్వలిగొన్న జగత్తు వింతశా
ర్వరియనునల్లదుప్పటముఁ బార్శ్వమునం జవరించెనాఁగ న
ల్దరుల మలీమసంబులవె దార్కొనె చందురుఁ డేటవాలుగాఁ
జరమగిరీంద్రశృంగవిలసన్మణికూటమునాఁగ గ్రుంకెడిన్.

గడచెపున్నమరాతిరి వాడిచెవెలుఁగు
చరమదశనందె చంద్రుఁడు విరిసెఁ దరణి
రాజు డిందినఁ బెరరాజు రాజిలండె
ధరణిఁ బరమాభ్యుదయము లీకరణి దెలియ.

# పరివర్తనము

కనుపర్తి రామకోటయ్యచౌదరిగారు

౧

రైలు ఈలవేసి నెమ్మదిగా కదలిపోతూయుంది. స్త్రీలపెట్టెలో కూర్చునియున్న రక్షాదేవి మొగముపై నున్న ముసుగును కొంచముతొలగించి వెలుపలివైపుకుచూచుచూ వియోగవిహ్వలహృదయముతో యొక నిట్టూర్పువిడిచింది. ఆమె తలవంచి "మరల నేనెప్పుడువచ్చెదనో? ఈసమయములో మానాయన వసారాలో గూర్చుని హుక్కాత్రాగుతూయుంటాడు. మాతల్లి వంటచేస్తూయుంటుంది. నాచిన్నితమ్ముడు ఆడుకుంటూ యుంటాడు"అని భావించింది.

రక్షాదేవికి తనతల్లిమాటలు ఒక్కొకటి జ్ఞాపకమొచ్చినప్పుడు అధీరరాలై పోవుచున్నది. ప్రయాణసమయములో తల్లితనను ఏవిధముగా కౌగలించుకొని ప్రేమించినదియూ, ఏవిధముగా వెక్కివెక్కి ఏడ్చినదియూ, ఆమె తనభర్తతో "నాయనా! నేటినుండి నీచేతులలో నొప్పగించుచున్నాము. ఈరోజునుంచి యీమెపై మాకు హక్కులేదు" అని చెప్పుసమయములో నామె కంఠస్వరమెంత కంపించిపోయినదియూ, "రక్షను మేమెంతయో ప్రేమగా పెంచుకున్నాము. ఆమెమనస్సును దుఃఖపెట్టవలదు"అనిపల్కు తనతల్లిదీనవాక్యములును తలచుకుని ఆమెమనస్సు నిండిపోయినది. ఆమె తనతలను ఆకొయ్యగోడకుఆనించి ఏడ్చుట మొదలుపెట్టింది.

బండి వేగంగావెళ్ళుతుంది. రక్ష తన హృదయమును కుదుటజేర్చుకుని ముసుగును కొంచెముతొలగించి యిటునటుజూచింది. ఆపెట్టెలో మరొకస్త్రీయుంది. ఆస్త్రీవయస్సు ఇరువదిరెండో, యిరువదిమూడో సంవత్సరములుంటవి. తెల్లనిరంగు, గుండ్రనిమొగము చాలా చక్కగాఉంది. ఇంతలో ఆమెగూడా యిటు చూచింది. రక్షాదేవి ఆశ్చర్యపడ్డది. ఈమె సావిత్రి. తనగ్రామములోనే నివసించేది. ఆమె పెండ్లిఅయి ఇప్పటికి నాలుగేండ్లయింది. ఈకొద్దిసమయంలోనే ఎంతమార్పయింది? పల్లెటూరిపిల్ల అనుకొనుటకే వీలులేదు. ముఖముపై ఎంతగంభీరత? ఎంత ప్రతాపము? రాణీలాగాఉందే? రక్ష కొంచముసేపటివరకూ చూస్తూ యుంది. తరువాత లేచి ఆమెవద్దకువెళ్ళి "ఆహా! సోదరీ! ఇంతలోనేనన్నుమరచితివా?" అందిచిరునవ్వుతో.

సావిత్రి ఆమెవంకజూచింది. వెంటనే కౌగలించుకుని "ఓ నాప్రియరక్షా! నీవెక్కడనుండివచ్చేవు? (చిరునవ్వుతో) ఈమూల పెద్దపార్శిల్ లాగాపడివుంది, అందులోనుంచివచ్చేవా? మరల నన్నొకసారి కౌగలించుకో (కౌగలించుకున్నతర్వాత) ఓనాపార్శిల్! ఎక్కడకుపోవుచున్నావు?" అంది.

రక్ష:—నీపార్శిల్ కు వివాహమైంది.

సావి:—ఈవిషయం స్పష్టంగానే తెలుస్తుంది. కాకపోతే! ఈవిధంగా ముసుగువైచుకొని పార్శిల్ (మూట)లాగా ఒకమూల పడియుండేదానవేనా? ఇదే మొదటిసారి అత్తగారింటికిపోవటం అనుకుంటాను.

రక్ష:—అవును, సోదరీ! ఇదే మొదటిసారి. పెండ్లిఅయి రెండేండ్లయింది. మనుగుడుపుయిప్పుడైంది.

సావి:—ఎక్కడ వివాహమైంది?

రక్ష:—(తలవంచి నెమ్మదిగా) సయాల్ కోటలో.

సావి:—మరదిగారేమిచేయుచున్నారు?

రక్ష:—లాహోరులో నౌకరీచేయుచున్నారు.

సావి:—లాహోరులో? (చిరునవ్వుతో) అయితే పరస్పరసమ్మేళనముజరుగుతూయుంటుంది. మేము గూడా అక్కడేయున్నాము. మరదిగారెట్లాయుంటారు? అందవిహీనులు కారుకదా?

రత్న:—(తలవంచి నెమ్మదిగా) నాకేమి తెలుస్తుంది? ఇంతవరకూ వారివంక సరిగా తలఎత్తిఅయినా చూడలేదు.

సావి:—ఆయన జనంలో కలిసిపోయి కాన్పించకుండాయుంటే ఎట్లా వెతుక్కుంటావు?

రత్న:—నిన్ను పిలవనంపుతాను. వచ్చేదవా?

సావి:—నీవు భక్తితో పిలచినట్లయితే తప్పక వస్తాను.

రత్న:—మంచిది, నీవిషయం వినిపించు. ఏమిటి పరిస్థితులు?

సావి:—సోదరీ! పరమాత్మునికృపచే ఏవిధమయినకష్టములేదు. వకీలుపని చేస్తున్నారు. నెలకుమూడు నాలుగువందలరూపాయీలవరకూ రాబడి. వారిస్వభావం ఇంతమంచిదని ఏమిచెప్పేది? ముఖము ఎల్లప్పుడూ గులాబీలాగా వికసించియుంటుంది. కోపపడడం ఎటువంటిదో ఎరుగరు. నాకు సంపూర్ణస్వాతంత్ర్యం యిచ్చేరు. ఎక్కడికైనా, ఎప్పుడైనా పోతాను, వస్తాను. ఏవిధమైన అభ్యంతరములేదు.

రత్న:—అయితే నీవు దొరసానిలాగా బజార్లవెంట తిరుగుతుంటావా?

సావి:—(చిరునవ్వుతో) బహుశా నీకు తెలియదుకాబోలు. ఘోషా ఆయనకు అసలు పనికిరాదు. (పెట్టెలోనుంచి ఒకపుస్తకంతీసి) ఇదిచూడు. వారొకపుస్తకంవ్రాశారు. ఇందులో ఘోషాపద్ధతి చాలా మూర్ఖమైందనీన్నీ, స్త్రీలకు చాలా హానికరమైందనీన్నీ సిద్ధపరిచారు. దీనిని ఆద్యోపాంతంగా చదువు. అప్పుడు నీకళ్ళు తెరవబడతవి.

రత్న:—(పుస్తకముతీసుకుని) అయితే నీకుగూడా తెల్లవాళ్ళగాలి సోకిందా?

సావి:—(చిరునవ్వునవ్వి) నాకు మొదటినుంచి ఘోషాపద్ధతి రుచించదు.

రత్న:—అయితే ముఖమెత్తుకుని బజార్లవెంట తిరుగుతూయుంటే సిగ్గుగాఉండదా? ఎవరైనా మన వాళ్ళుచూస్తే ఏమనుకుంటారు? నేనుచచ్చినా ఇటువంటి లజ్జాహీనమైనపనికి వప్పుకోను.

సావి:—నీకు మరొక కబురు వినుపించుతాను. వారొకసొసైటీని స్థాపించేరు. సంఘోద్దేశము ఘోషాపద్ధతి నిర్మూలించుట. ఈవిషయాన్ని గురించి పంజాబులో చాలాచోట్ల ఉపన్యాసాలిచ్చేరు. వచ్చే నెలలో సయాల్‌కోటగూడావస్తారు. నీవురమ్మంటే నేనుగూడావచ్చేదను. కాని ఒకషరతుంది.

రత్న:—ఏమిటి?

సావి:—నీవు నిండుసభలో "ఈఘోషాపద్ధతి చాలాఘోరమయింది. ఇది స్త్రీలకు చాలా హానికరమయింది" అనిచెప్పాలి.

రత్న:—నావల్ల ఆయాశ పెట్టుకోవద్దు. కాని కేవలం స్త్రీలసభఅయితే లేచి అనర్గళంగా ఉపన్యసించి నీకు హడలెత్తిస్తాను.

సావి:—అట్లనా? నీధైర్యము నాకుతెలియదూ! సభలోనుంచోడముతోటే నీశరీరమంతా చెమట పోస్తుంది. నోరుతెరవలేవు. గడగడ వణకిపోతావు.

రత్న:—(గట్టిగా నవ్వి) సోదరీ! నిజంగా నాస్థితి అంతేఅవుతుంది. అయితే నీవు అక్కడగూడా ఈవిధంగా అనర్గళంగా మాట్లాడగలవా?

సావి:—భయమెందుకు? ఎవరేమంటారు?

రత్న:—నేనయితే ఒకఅక్షరమైనా చెప్పలేను. చెపుదామనుకున్నా నోటినుండి మాటరాదు. నాల్గు వైపులా మనుష్యులముజూచే గాభరాఅవుతాను.

సావి:—ఇదే ఘోషావల్లవచ్చే మొదటిఅనర్థకం. ఇదే స్త్రీలను అబలనుచేస్తుంది. దీనివల్లనే వారియుత్సాహము పోతూయుంటుంది. వారేదయినా సంకటములోబడి సర్వనాశనమైపోవుచున్ననూ,...ఆఖరుకు ప్రాణముపోవుచున్ననూ కాస్త ధైర్యముతో ఎదుటవానితో మాట్లాడలేరు. కాస్త గోలన్నా చేయలేరు. ఈఅనర్థకమంతా ఘోషావల్లనే.

రత్న:—ఇటువంటిస్థితిలో నీవేమిచేస్తావు?

సావి:—ఎవడైన్గా కుదృష్టితో నన్నుజూచినచో బూటు (చెప్పు) తో నెత్తివాయగొడతాను.

రత్న:—చెప్పంట సులభంకాని సమయంలో చెయిలేవదు. ధైర్యమూయుండదు.

సావి:—ఇప్పుడు నానోటితో ఏమిజెప్పేది. అటువంటిసమయంవచ్చినచో చేయి లేస్తుందో లేదో, ధైర్యముందో లేదో నీకే తెలుస్తుంది. (బండి నెమ్మదిగాపోవటంచూచి) వజీరాబాద్ స్టేషన్ వచ్చింది. ఇక్కడ మీరుదిగి మరొకబండిలో ఎక్కాలి. నేను సరిగా లాహోరువెళ్ళుతాను. ఉత్తరం తప్పకవ్రాయాలి. నాఅడ్రసు పుస్తకములోఉంది.

రత్న గుడ్డ సరిచేసుకుని నుంచుంది. ముఖముపైకి మునుగులాక్కుంది. సావిత్రిజూచి నవ్వింది. "అయితే నన్ను సయాల్ కోట రమ్మంటావా? వద్దంటావా?" అంది.

రత్న:—(మునుగులోనుంచి ఆమెవైపుజూచి నెమ్మదిగా) ఎందుకురావు? తప్పకుండారా! నేనుచిరునామా వ్రాసిపంపుతాను. ఇంతలో బండి పూర్తిగానుంచుంది.

సావి:—నాషరతు నీకు స్వీకారమేకదూ? నీవు సభలో ఘోషాకువిరుద్ధంగా చెప్పాల.

రత్న:—(నెమ్మదిగా) ముందునీవు ఎవరినైనా చెప్పుతో కొట్టిచూపించు. తర్వాత నేనుగూడాఘోషా చెడ్డది...కాని.

వాక్యము పూర్తికానేలేదు. రత్నాదేవిపతివచ్చి పెట్టెకెదురుగా నుంచున్నాడు. రత్న మునుగును మరికాస్త పొడిగించి బండిదిగింది. సావిత్రి గట్టిగానవ్వి "కానరాక పడిపొయ్యేరు" అంది. ఇంతలో చాలా మందిస్త్రీలువచ్చి ఈపెట్టెలోనే ఎక్కేరు. సావిత్రి చూస్తూఉంది.

రత్నాదేవి సరిగా చూచిపోవుటకు మునుగడ్డమైనందువల్ల జనములో త్రొక్కిళ్ళుపడుచూ నిశ్శబ్దంగా భర్తవెనువెంటనే పోతూయుంది. నవయువకుడునూ అనుభవశూన్యుడునైన రత్నాదేవిపతి గుంపును తనచేతులతో యిటునటునెట్టుచూ ముందుకు సాగిపోతూయున్నాడు. పాపము ఒకసారి ముందుముందు తనసామాను తీసుకెళ్ళు కూలివానివంక చూస్తాడు, ఒకసారినిండామునుగువైచుకొని తనవెనుక నేవచ్చుభార్యవంక చూస్తాడు. ఇంతలో పతి నలుగురైదుగురుమనుష్యులను దాటి ముందుపోయినందున రత్న మునుగునుకొంచెముపైకెత్తి నలువైపులజూచింది. కాని ఆమె తనపతిని గుర్తించలేకపోయింది. "ఎటువెళ్ళేరు? ఇప్పుడు నాముందరనేవెళ్ళుచున్నారు. నేను వారివెనుకనే ఒకనిమిషమైనా ఆలస్యముచేయకుండా వస్తూయున్నాను. ఎటు వెళ్ళియుంటారు? బహుశా వెనకబడియుంటారా?" అనుకుని నుంచుంది. వెనుకకు తిరిగిచూచిందికాని నిష్ప్రయోజనం. ప్రయాణీకులు ఇటునటు హడావిడిగా పరుగెత్తుచున్నందున ఆమె అక్కడనుంచునుట దుస్సహమైంది. చాలాకష్టంగా ఆగుంపులోనుంచి బయటబడి తలవంచి యొకచోటనుంచుంది. తనభర్త వెతకుతూ తనవద్దకు వచ్చునని ఆశించింది. కాని చాలాసేపయింది. ఇంతవరకూ రాలేదు. రత్నాదేవి భయపడ్డది. తనభర్తను ఎట్లా వెతకాలి? ఆమె ఆయనను సరిగానైననూచూడలేదు. తనభర్త బాదామిరంగుగల బూటుధరించేడని మాత్రమామెకు తెలుసు. చూస్తూయుండగానే అనేకమంది బాదామిరంగు బూటువారువచ్చేరు. వెళ్ళిపొయ్యారు.

ఆమెవద్ద ఎవరూ నుంచోవలేదు. బండినిండామనుష్యులే. తనభర్త ఎక్కడా కాన్పించడు. ఎక్కడఉన్నాడు? బండి యీలవేసి బయలుదేరింది. రత్నాదేవి తనప్రాణముపోవుచున్నట్లు భావించింది. ఇప్పుడామెరక్షింపబడుటకు ఏయుపాయముకాన్పించలేదు. ఆమె మునుగుపైకెత్తి పోవుచున్న బండివంక జూచి బండిఆగుటకు పరమాత్ముని ప్రార్థించింది. కాని భగవంతుడామెమొరను ఆలించలేదు.

ప్లాట్‌ఫారం జనశూన్యమయింది. ఇప్పుడే ఇంతకుముందే అక్కడ ఎంతో కోలాహలంగాఉంది. ఎంతజనముండెను?...కాని, ఇప్పుడు అనిర్భాగ్యురాలును, అల్పవయస్కురాలును అగు నాబాలికతప్ప మరెవ్వరును లేరు. రత్నాదేవి గోడవంక ముఖముత్రిప్పుకొని తన దౌర్భాగ్యమునకు వెక్కివెక్కి ఏడ్చుటమొదలుపెట్టింది.

౨

సాయంసమయము. ఒకరైల్వేకర్మచారి తనయింటికిపోవుచూ మన రత్నయున్నవైపుకే వచ్చేడు. రత్నాదేవినిజూచి "ఈమె ఎవ్వరు? ఎవరు మనిషిగూడా దగ్గరలేడు. ప్లాటుఫారమంతా జనశూన్యంగాఉంది. ఈమె ఒంటరిగా ఇక్కడేమిచేయుచున్నది?" అని అనుకున్నాడు. వెంటనే వానికి జ్ఞాపకమొచ్చింది. "నేనీమెను మధ్యాన్నమప్పుడుగూడా చూశాను. ఆసమయంలోగూడా ఈమెవెంట ఎవ్వరులేరు"...రైల్వే బాబు మెల్లమెల్లగా ఆమెవద్దకు జరిగేడు. రత్న వాని పాదధ్వనివిని ఉలికిపాటుతో, అతని పాదములవంక జూచింది బాదామీరంగుబూటేమోనని. కాని ఆభాగ్యమెక్కడ? రత్న యొకనిట్టూర్పువిడిచి తలవంచింది.

బాబు:—(రత్నను రెప్పవాల్చకుండాజూచి) నీవు ఇక్కడేమిచేయుచున్నావు?

రత్న మునుగును ఇంకాపొడుగుచేసింది. ఏమియు సమాధానముచెప్పలేదు.

బాబు:—నీవెంట ఎవ్వరైనా పురుషుడున్నాడా లేడా?

రత్న ఎవ్వరూలేరను అర్థముతో తలయూపింది. రైల్వేబాబు తననోట్లోయున్న సిగరెట్టువంకజూచి, గట్టిగా ఒకదమ్ముపీల్చేడు. "నీవు యిక్కడకు ఒంటరిగా ఎట్లావచ్చేవు? ఎక్కడనుంచివస్తున్నావు"

రత్న:—(అస్ఫుటస్వరంతో) గుజరాతునుంచి.

బాబు:—నీటిక్కెటు ఎక్కడఉంది? ఉన్నదా లేదా?

టిక్కెట్టుమాట వినుటతోడనే రత్నాదేవిముఖము వాడిపోయింది. మాట్లాడవలయునని ప్రయత్నించినను మాట్లాడలేకపోయింది. నిన్నటిరోజున ఈసమయంలోనే తనయింట్లో ఎంతసుఖముగాఉన్నదియూ జ్ఞాపకమొచ్చింది. కాని నేడో?...రత్నాదేవికన్ను లశ్రువులచేనిండిపోయినవి. ఇకముందేమవుతుంది? ఆమెకన్నుల ముందంధకారము వ్యాపించింది.

బాబు:—నీటిక్కెట్టు ఎక్కడఉందో చెప్పదువా లేదా?

రత్న గడగడ వణకప్రారంభించింది. "బాబూ! నన్ను కరుణించు. నిన్ను పరమాత్ముడు రక్షించుగాక" అంది.

బాబు:—(బెదరించి) టిక్కెట్టు యివ్వు?

రత్న:—(ఏడ్చుచూ) వారివద్దఉంది.

బాబు:—(క్రోధంతో) అయితే వారినిపిలువు. ఎక్కడయున్నారో?

రత్న:—(వ్యాకులితహృదయంతో) బాబుగారూ! ఇప్పుడెక్కడయున్నారో నాకెట్లా తెలుస్తుంది? గుంపులో తప్పిపోయారు. ఎక్కడకువెళ్ళేరో తెలియదు.

బాబు:—ఎంత విచిత్రమయినమాట! పురుషుడు తనక్రొత్తభార్యను వదలిపోవునా? మంచిది! దీనితో మాకేమి? బండిచార్జి యివ్వు.

పిల్లిపంజాలోచిక్కిన ఎలుకకుగూడా ఇటువంటిస్థితి సంభవించదు. మనస్సులో ఈఆపద ఏవిధముచే నయినా దాటవేయుమని భగవంతుని ప్రార్థించింది. "ఈసమయంలో సావిత్రివచ్చినచో ఎంతబాగుండును" అని అనుకుంది.

బాబు నలువైపులా జూచేడు. బొత్తిగా నిశ్శబ్దంగాఉంది. అప్పుడు రక్షాదేవికి ఇంకాదగ్గిరగావచ్చి నెమ్మదిగా "సరే...నంటే నాజేబులోనుంచి తీసియిచ్చి రశీదుతీసుకుంటాను. ఒకమారు చిరునవ్వుతో 'సరే'ను. నష్టమేముంది? ఇదే నాకు చాలాసంతోషము" అన్నాడు.

రక్షాదేవి చెవులలో సీసముపోసినట్లయింది. ఇటువంటి కపటప్రపంచమును ఆమెఎప్పుడుఎదుర్కొనుట తటస్థించలేదు. ఆమెకు రైల్వేబాబు మెడను నులిమివేత్తామా అనిపించింది. క్రోధముంది కాని సాహసములేదు. నిర్బలునికి క్రోధమొచ్చినచో ఏడ్చును. ఇంతకంటె ఏమియుచేయలేడు. రక్షకూడా ఏడుస్తోంది. ఇంతలో ప్లాటుఫారం రెండవవైపునుంచి యొకస్త్రీ ఇటువైపే వస్తోంది. బాబుచూచి కంపించిపోయ్యాడు. చూస్తూ చూస్తూఉండగానే ఆమె వీరివద్దకవచ్చి నుంచుంది. రక్షాదేవికి ప్రాణములో ప్రాణమొచ్చింది. ఆస్త్రీ చెవి వద్ద ముఖముంచి "సోదరీ! నన్నురక్షించు! ఈపిశాచి..."తరువాత ఆమెనోరుమూతపడ్డది. కాని ఆస్త్రీఅంతా తెలుసుకుంది. ఆస్త్రీకళ్ళనుండి అగ్నికణములు రాలుచున్నవి. ఆమె ఆబాబువంక క్రోధపూరితనయనములతో వానిని తింటుందోఏమి అన్నట్లుగాజూచింది. క్రోధముతోగద్దించి "నీకుతోబుట్టువులులేరా?" అంది.

కంఠస్వరము వినుటతోనే రక్షాదేవి ఆనందమున కంతులేదు. ఈమె సావిత్రియా? ఆమెకు పోయిన ప్రాణము తిరిగివచ్చింది. నీళ్ళలోమునిగిపోవువానికి ఒడ్డుదొరకినట్లయింది. ఇప్పుడామెకు ఏవిధమయిన చింతా లేదు. తనయింట్లో, తనతల్లియొడిలోగూర్చున్నట్లే భావించింది.

సావిత్రి రైల్వేబాబువంక రోషపూరితనయనములతో జూచుచూ "ఈవిధంగా కులాంగనలను కష్ట పెట్టుచున్నావే నీకు తోబుట్టువులులేరా?" అంది.

రైల్వేబాబు నెత్తిపై పర్వతం విరిగిపడ్డట్టయింది. అతనినోటినుండి యొకమాటైన రాలేదు. "ఈమె ఎవరో పెద్దయింటికన్యగాఉంది. ఇందులో సుశిక్షిత. లేనిచో ఇంత నిర్భయంగా, ఇంత స్వతంత్రముగా ఎప్పుడూమాట్లాడదు. ఇప్పుడేమిచెయ్యాలి? ఎట్లా తప్పించుకోవాలి?" అనుకున్నాడు. కొంచము సేపటికి "నేనేమన్నాను? టిక్కెట్టుయివ్వు? లేదా చార్జియివ్వు అన్నాను. ఇంతే యిందుకే ఏడుస్తోంది" అన్నాడు.

సావిత్రి రక్షాదేవి ముఖమువద్ద చెవిపెట్టి "డబ్బు యివ్వమంటున్నాడా? మరేదయినా...అంటున్నాడా?" అంది.

రక్షాదేవి ఆమెచెవిలో నెమ్మదిగా ఆగిఆగి "కొంచెమునవ్వు! నీచార్జి నావద్దనుంచిఇస్తాను. నామనస్సుకెంతో ఆనందంగాఉంటుంది" అన్నాడు అని చెప్పింది.

సావిత్రి ఈమాటలువినుటతోనే క్రోధావేశయై "నీపేరేమి?" అంది.

"నాపేరడిగేదానవు నీవెవరవు?"

సావిత్రి గ్రుడ్లెర్రజేసి "నేనెవరినో నీకెందుకు? నీవు పేరుచెప్పు" అంది.

బాబు భయపడ్డాడు. అయినను సాహసించి "ఏం బెదరిస్తావు? ఆమె టిక్కెట్టులేకుండా ఎందుకొచ్చిందో అడగవేం?" అన్నాడు.

సావిత్రి ముందుకువచ్చి బాబు మెడపట్టుకుని కదలించి "నీవు నీపేరుచెప్పెదువా లేదా? నీపేరేమి? నేను నీపై రిపోర్టుచేస్తాను" అంది.

మనుష్యుడు నిరాశాహృదయుడైనప్పుడు సాహసించుతాడు. ఆదేవిధంగా బాబు సాహసికుడయ్యాడు. వెంటనే సావిత్రి చెయ్యిపట్టుకుని తీసివేసి "జాగ్రత! నేను తగ్గిపోయినకొలదీ నీవు పైకిపోవుచున్నావు. నేనే మయినా అన్నచో నీమర్యాదేమియునుండదు. రిపోర్టుచేసుకో. నాకేమియు భయములేదు" అన్నాడు.

సావిత్రి ఇక సహించలేకపోయింది. తక్షణమే కాలినుండి బూటుతీసి బాబునెత్తిపై నాలుగైదు మార్లు ప్రయోగించింది. ఈకోలాహలమంతా విని రైల్వే కర్మచారులు కొందరువచ్చి దూరంగానుంచుని తమాషాచూస్తూన్నారు. అందులో కొందరు ఆ! ఆ! అంటూ నేయున్నారు. ఇంతలో బాబుగారి బుర్రకు బాగామరమ్మత్తయింది. సావిత్రి ఆకస్మాత్తుగా బూటుతో మీదబడి కొడుతున్నందుకల్ల బాబుకు ఏమిచెయ్యవలసిందియూ తోచలేదు. ఇంతలో రైల్వేబాబులు మెల్లగా దగ్గరచేరి "అమ్మా! మీరు చెప్పతో కొట్టడం బాగాలేదు" అన్నారు.

సావిత్రి తీవ్రకంఠస్వరంతో "మీరు చెప్పతో అంటున్నారు. వీడు ఇక నోరుమెదపిన వీని రక్తము పిండుతాను. వీడు కులవధువులను అవమానపరచుచున్నాడు" అంది.

బాబు నిశ్శబ్దంగానుంచుని రొప్పుచున్నాడు. నోటినుండిమాట వెలువడడంలేదు. మరొకబాబు ఇతని చెయ్యిపట్టుకు ఎట్లనో బయటికిలాగేడు.

రెండోబాబు:—ఇతనికి దయ్యంపట్టింది. మేము ఇతనికి చెప్పిచెప్పి అలసిపోయాము. ఎవ్వరిమాట వినడు. మీరతనిని బాగాశిక్షించేరు. జ్ఞాపకముంటుంది.

మూడవబాబు:—సోదరీ! నాకు చాలాసంతోషమైంది. కులీనులగుస్త్రీలను కుదృష్టితో జూచువాడు ఎన్నడు మానసహానుభూతికి పాత్రుడుగాజాలడు. ఇందువల్ల నేవాడు నిశ్శబ్దంగా ఊరుకున్నాడు. మేమంతా విరోధులమని నోరెత్తితే వీరంతా మీదపడతారని వాడికి తెలుసు.

నాల్గవబాబు:—తమరు చాలా సాహసంగా పనిచేశారు. ఇదేవిధంగా ప్రతినెల రెండుమూడు జరుగుతూయుంటే దుర్మార్గులకు బుద్ధివస్తుంది.

## 3

తర్వాత సావిత్రి, రక్షాదేవి ఒకబల్లపైకూర్చున్నారు. "నీవు ఇక్కడకు ఎట్లావచ్చేవు? నీవులాహోరు చేరిపోయియుంటావనుకున్నాను" అంది రక్ష.

సావి:—లేదు! నీవు అటువెళ్ళుటతోనే యొకస్నేహితురాలుకాన్పించి వెళ్ళనీయనందున సాయంత్రం బండికివచ్చెదనని వారికి టెలిగ్రామిచ్చి ఆమెయింటికివెళ్ళి మరల ఈబండికివెళ్ళుదామని వచ్చుచున్నాను.

రక్షాదేవి సావిత్రి ధైర్యసాహసములుచూచి ముగ్ధురాలైపోయింది. ఈమె రాకపోయినచో తనగతి యేమయేదో అని చింతించింది. ఈఆపదలో తనను రక్షించినందులకు ఆమెను ఎంతో పొగిడింది.

ఇంతలో సయాల్‌కోటనుంచి బండివచ్చింది. అందులో రక్షాదేవిపతికూడా వచ్చేడు. పాపము వ్యాకులహృదయంతో బండిదిగేడు. ముఖము కళావిహీనంగావుంది. బండిదిగుటలోనే యిటునటూ వెదుకుట ప్రారంభించేడు. సావిత్రి వానిని జూచుటతోనే గుర్తించి సైగతో దగ్గరకు పిలచింది. "తమవస్తువేదయినా పోయిందా?" అన్నది.

రాంజీదాస్:—ఆఁ! అవును! ఏమిచెప్పేది? నాకళ్లు...ఇంతలో ప్రక్కనే కూర్చునియున్న రక్షవంక జూచేడు.

సావిత్రి:—ఆఁ! చెప్పండి! తమరు ఎందుకు ఆగుతారు?

రాంజీదాసు జవాబుచెప్పలేదు. నిశ్శబ్దంగా రక్షవంకజూచుచున్నాడు..."బహుశా! యీమెయే అయివుంటుందా?"అనుకున్నాడు.

సావిత్రి:—(కనుబొమలుముడిచి) తమరు అటుఏమి చూచుచున్నారు? ఘోషాస్త్రీలను ఆవిధంగా రెప్పవాల్చకుండా చూచుచున్నావు. నీకు సిగ్గుగాఉండలేదా? ఎవరైనా పోలీసువానిని పిలువవలయునా?

రాంజీదాసుముఖము మలినమయింది. గద్గదకంఠముతో "నాభార్య తప్పిపోయింది. ఆమెవిగూడా యిటువంటిగుడ్డలే. ఇట్లేమాదిరిఉంటుంది"అన్నాడు. ఈమాట చెపుతూయుండగానే అతనికళ్లవెంట నీళ్లు కారినవి.

సావిత్రి:—(చిరునవ్వుతో) స్త్రీపోయిందీ! చాలాతమాషైనమాటే. పాపము యీదిక్కులేనిపిల్లకు గూడా భర్తతప్పిపోయ్యాడట. మీరు సయాల్ కోటనుండి వచ్చుచున్నారా ఏమి? అయితే చూచి గుర్తించండి! మీస్త్రీ అవునో? కాదో?

రాంజీ:—(సందిగ్ధంగా) ఈమెను ఏమిగుర్తించుతాను? గుడ్డలుమట్టుకు గుర్తించుతాను. ఇదేమాదిరి గుడ్డలు. ఈమెయే ననుకుంటాను.

సావిత్రి:—చాలావిచిత్రంగాఉంది. భర్తను భార్య గుర్తించలేదు. భార్యను భర్త గుర్తించలేదు.

రాంజీదాసుకు ఆమెయే తన స్త్రీయని దృఢమయిన నమ్మకముతోచింది. సంతోషహృదయంతో "సయాల్ కోటనుంచి యింటివరకూ ఎట్లావచ్చేనో ఆపరమాత్మునికే తెలియాలి. ఇప్పుడు నాదుఃఖము దూరమైంది"అన్నాడు.

సావిత్రి:—ఈమెయే మీస్త్రీయని ఎట్లాగ్రహించేరు? అవునో? కాదో?

రాంజీ:—సోదరీ! పరిహసించవలదు. చాలాడస్సిపొయ్యాను. ఇంతవరకు మనస్సుఎట్లానోయుంది.

సావిత్రి:—నీవు ఈమెనువదలి వెళ్లినప్పుడు యీమెసంతోషించింది గాబోలు!

రాంజీ:—నేనేంచెప్పేది? గుంపులో వెళ్లుతూ బండిదగ్గిరకుచేరేము. ఇంతలో ఒకస్త్రీ జనానా పెట్టెలో ఎక్కుతూయుంది. ఇదేవయస్సు. ఇవేగుడ్డలు. నేనీమెయే అనుకున్నాను. ఇకనిర్భయంగా ప్రక్కనేయున్న పెట్టెలో ఎక్కేను. సయాల్ కోట వెళ్లినతర్వాత సంగతంతా తెలిసింది.

సావిత్రి:—వెళ్ళండి! మరుగెత్తికొంచెము మీతాయితీసుకరాండి, నోరు తీపుగాంది ఈమెను యివ్వను...కాని సయాల్ కోటవరకూ తీసుకెళ్ళగలవా?

రాంజీ:—ఎందుకు? యింకా సందేహమా?

సావిత్రి:—మార్గంలో ఎక్కడయినా పోగొట్టుకొందువేమోయని నాకుభయంగాఉంది. రమ్మంటే మీవూరువరకూవచ్చి పంపుతాను.

రాంజీ:—సోదరీ! ఇంకానన్ను లజ్జితునిజేయవలదు. ఈశిక్ష జన్మపర్యంతముంటుంది.

తరువాత సావిత్రిజరిగిన కథంతా చెప్పింది. అంతావిని సావిత్రిని ఎంతోపొగిడి "తమయీఉపకారమునకెల్లప్పుడు కృతజ్ఞుడను. ఇటివంటి సాహసమే స్త్రీలందరికిఉన్నచో ఏకష్టముండదు"అన్నాడు.

సావిత్రి:—ఇదంతా మీమగవాళ్ల చేతులోనేయుంది. ఇక నేవెళ్లుతాను బండివేళయింది.

రాంజీ:—(ఉత్కంఠతతో) తమ అడ్రసుయిచ్చినచో మాసోదరునికి యొకకృతజ్ఞతాపత్రమైననూ వ్రాయుటకు వీలుండును.

సావిత్రి:—అడ్రసు రక్షవద్దయుంది. కృతజ్ఞతాపత్రము మాటటుంచండి. ఆయన వకీలు, వారికిఫీజు కావాలెకాని కృతజ్ఞతాపత్రముకాదు. ఇంతపెద్దపనిచేశాము. ఫీజువదలరు" ఇట్లనిరక్షాదేవివద్ద సెలవుతీసుకుంది.

## ౪

కొన్ని నెలలు గడచినవి. సావిత్రి, రక్ష, మరల రైలుబండిలోనే కలియుటతటస్థించింది. కాని యీ రక్ష మునుపటిరక్షకాదు. ఆమెను జూచినచో ఏదో స్వతంత్రజాతిమహిళామణిలాగా కాన్పించుచున్నది. ఘోషాగాని, ముసుగుగానీ నామమాత్రంగూడాలేదు. ఆమెవెనుకనే కూలివాడు సామానుతీసుకుని వచ్చుచున్నాడు. ఆమెసరిగా సావిత్రియున్న పెట్టెవద్దకేవచ్చిఉంచుంది. కూలివానిచే సామానులోపలవేయించి, డబ్బులెక్కించి వానికిచ్చిపంపివేసింది.

సావిత్రి ఈదృశ్యమును కూర్చుని ధ్యానపూర్వకంగా చూస్తోంది. కొంచెముసేపటికి ప్రసన్నహృదయంతో "హా! సోదరీ! చాలావీరవనితవయ్యావే!" అంది. రక్షయులికిపాటుతో తలపైకెత్తింది. సావిత్రి ఎదుటనుంచుని నవ్వుతూయుంది. రక్షవెంటనే ఆమెమెడ కౌగలించుకుని "సోదరీ! మనమిద్దరము మరల కలియుట అసంభవమని చాలానిరాశపొందేను. మీయింటికి రెండుమార్లు వెళ్లేను, కాని రెండుమార్లు నీవుపట్నములోనేలేవు. ఈరోజున ఆకస్మికంగా మనమిద్దరముకలియుట తటస్థించింది. నాకెంతో సంతోషంగా ఉంది"అంది.

ఇంతలో రాంజీదానువచ్చి "సామానుసరిగాఉంచేవా?" అన్నాడు. రక్ష చిరునవ్వుతో "చూడండి! సోదరిదొరికింది. నమస్కరించండి, మరల ఏస్టేషనులో దిగిపోతుందో"అంది.

రాంజీదాను తలవంచి సావిత్రివంకజూచి నమస్కరించి "రెండుమార్లువచ్చేము. కాని మీరు కానుపించలేదు"అన్నాడు.

ఇంతలో బండియీలవేసింది. సావిత్రి నమస్కారమునకు ప్రత్యుత్తరమిచ్చుచూ "మంచిది! తమరు వెళ్లి కూర్చోండి. బండిబయలుదేరుతుంది"అంది.

రాంజీదాను వెళ్లిపొయ్యాడు. బండిబయలుదేరింది. సావిత్రి "ఆముసుగు ఎక్కడపోయింది?"అంది రక్షతో.

రక్ష చిరునవ్వుతో "వజీరాబాదుస్టేషనులో ఆరోజునేపోయింది"అంది.

సావి:—కాని ఈపరివర్తన మెట్లాజరిగింది?

రక్ష:—ఆకథంతా చాలా పెద్దది. సోదరీ! నేనీస్థితిలోనికి వచ్చుటకు ఎన్నెన్నికష్టములు వచ్చినవి? వారుగావున అవన్నిదాటగలిగేరు, గాని మరొకరైనచో సాహసించలేరు.

సావి:—సోదరీ! ఏదీ! ఆకథంతా సంగ్రహంగాచెప్పు. వినవలెనని కుతూహలంగాఉంది.

రక్ష:—నయూల్‌కోటకేరగానే వారు యింట్లోవారితో ఇక ఘోషాలో ఉంచనని ఖుట్టిగాచెప్పేరు. ఇంట్లోవారు యీమాటవినుటతోనే ఆశ్చర్యములో మునిగిపొయ్యారు. తమ పిల్లవాడు ఈవిధంగా చెప్పునని వారు కలనైనాభావించలేదు. చాలారోజులవరకూ నెమ్మదిగా బోధించుచూవచ్చేరు. కాని ప్రయోజనమేమీ లేకపోయింది. పైగా మీమాటప్రతీది వింటాను కాని ఘోషావిషయంలో మాత్రంవినను అని ఖండితంగా చెప్పేరు. రెండురోజులవరకూ ఈచర్చజరుగుతూనేయుంది. మూడోరోజు ప్రాతఃకాలమే నన్నుబయటికి షికారుతీసుకెళ్లేరు. మరల యింటికి వచ్చేవరకు అందరిముఖకళలు మారిపోయియున్నవి. ఒకరుగూడా మాట్లాడలేదు.

తరువాత నావిషయంలో ఏమేమిజరిగినవో అవి నాకె తెలుసు. ఇల్లాంతా నాకువిరోధమయింది. ఒకరుగూడా అనుకూలంలేదు. అన్నంతిన్నావా? లేదా?అని అడిగేవారుగూడాలేరు. నేను రోజంతయూ ఏడుస్తూకూర్చుంటాను. ఈవిధంగా పదిహేనురోజులు గడచిపోయినవి.

సాయంసమయము. ఆకాశమంతా మేఘావృతమైయుంది. మామగారు బయటినుంచివచ్చేరు. వచ్చుటతోడనే "ఏం, ఎక్కడున్నావు?"అన్నారు. అత్తగారుగదిలో కూర్చుని బావగారికుమారునకు తలదువ్వుతూ ఉంది. వినుటతోనే బయటికివచ్చి "ఎందుకు? ఏమిటీకోపంగాఉన్నారు?"అంది.

మామ:—కోపంగాఉండక ఏమిచెయ్యాలి? పిల్లవాడు నామర్యాద మంటగలిపేడు. బజాళ్లో అందరునవ్వుచున్నారు. నేను బజారున పోవుచుంటే నావంకవ్రేళ్లెత్తి చూపుచున్నారు. విషముద్రాగి చచ్చిపోదామా అనిపిస్తోంది.

అత్త:—విషం మీవిరోధులు త్రాగాలి. కాస్తగట్టిగామాట్లాడితే ఇకనెవ్వరునోరెత్తరు.

మామ:—నేనెవరితోవని పోట్లాడేది? బజారంతానవ్వుతుంది. ఇవ్వాళ ఏదోయొకటి పైసలు కావలసిందే. రాంజీయింట్లోయున్నాడా? లేడా?

ఇంతలోవారు రానేవచ్చేరు. నాకుభయమేసింది. మామగారు వారిని జూచుటతోనే "యీనిర్లజ్జతా వ్యవహారం ఇకనాయింట్లోసాగదు. నీభార్యను ఘోషాలోఉంచెదవా? నాయింట్లోనుండి నడచెదవా? ఏది నీకిష్టము?"అన్నారు. వారు కొంచెముసేపటికి "ఘోషా యింతప్రియమైందా?"అన్నారు.

మామ:—ఇంతకంటెగూడా ప్రియమైంది. పుత్రుడుగూడా దీనిముందు ఒకలెక్కగాదు. దీనిని నీవు ఘోషాఅంటున్నావు. నేను దీనిని ప్రతిష్టగా భావించుకొనుచున్నాను.

వారు:—మంచిది నేను యిల్లువదలుతాను.

ఏమిగానున్నదోయని నాహృదయము వ్యాకులపడ్డది. ఇంతలో అత్తగారు "తండ్రిఎదుట ఈవిధముగా జెప్పుట నీకు సిగ్గుగాలేదా? మీయిష్టమొచ్చినట్లేచేస్తాను అని చెప్పలేవా? తల్లితండ్రియుండగా కోడలి విషయంలో నీవునోరుగూడా మెదపగూడదు. ప్రపంచములో అందరికిపెళ్లిళ్లు అయినవికాని నీవంటినిర్లజ్జగల వాడెవ్వడూయుండడు"అంది.

మామ:—అయితే! ఇంతే నిశ్చయించుకున్నావా? చూడు పశ్చాత్తాపపడతావు. బాగావిచారించుకో.

వారు "నేను విచారించుకోవలసిందేదో విచారించుకున్నాను" అన్నారు దృఢంగా.

మామ:—అయితే దయచేయండి! తమస్త్రీనిగూడా వెంటబెట్టుకొనివెళ్ళండి. ఈరోజునుంచి నాకు నీవు చచ్చిపొయ్యావు. నీకు నేను చచ్చిపొయ్యాను"అంటూనే గదిలోకివెళ్లేరు. అత్తగారు ఏడ్చుచూ అనేక విధముల కుమారునకుబోధించిరి. కాని లాభములేకపోయింది. చూస్తూయుండగానే ప్రయాణమయ్యారు. ఇంట్లోవస్తువేదిగూడా వెంటతీసుకోలేదు. వివాహసమయంలోవచ్చిన వస్తువులుగూడా ముట్టుకోలేదు. నావద్దకు వచ్చి "పద"మన్నారు.

నేను వెంటనేలేచి నుంచున్నాను. వారు తల్లితో "చూడు అంతాఇక్కడే వదలిపోతున్నాను"అన్నారు.

తల్లిఏమియుసమాధానముచెప్పలేదు. తలవంచినుంచుంది. కాని వదినెగారుమాత్రం ఊరుకోలేదు. "ఎట్లా వదలిపోతున్నా ఆమె ఉందిగా శరీరంనిండా సొమ్ములతో"అంది వ్యంగంగా.

"ఆవస్తువులుగూడా తీసిఇవ్వు. ఈరాక్షసికళ్లు చల్లబడతవి"అన్నారు. నేను నిశ్శబ్దంగావస్తువులు ఊడదీయుచున్నాను. అత్తగారు ఏడ్చుచూ "అమ్మా! ఉండనివ్వు! అయ్యో! ఏమిపనిచేయుచున్నావు? పిచ్చిదానవయ్యావా?"అంది. "తీసిఇవ్వు! భగవంతుడిచ్చినదో ధరించుకుందాములేనిచో లేదు"అన్నారు వారు.

వస్తువులు తీసియిచ్చి వారివెంటనే బయటికివచ్చేను. అత్తగారు ఏడుస్తూయుంది. బాజారుకువచ్చేవరకు ఆకాశంగూడా ఏడ్వడం ప్రారంభించింది. నేను నుంచుని వర్షముకురుస్తోందన్నాను. వారు నీవు కాకితపు బొమ్మవుగాదు తడిసి చెడిపోటానికి, నిశ్శబ్దంగారా అన్నారు.

రాత్రిసమయము. వర్షము కురియుచున్నది. రుంయ్యియని చల్లనిగాలి వీచుచున్నది. మెరుపులు మెరయుచున్నవి. మేమిద్దరము ఇల్లువదలి, వర్షములో తడియుచూ, చలిలో వణకుచూ, స్టేషనువైపుకు వెళ్లుచున్నాము.

ఇంతవరకూ చెప్పి రత్న యూరకుంది. సావిత్రి సమ్మానపూర్వకంగా రత్నవంక జూచి "సోదరీ! మంచి సాహసముజేశారు. నేను మరదిగారిని ఇంతవారని తలపలేదు. వారిని ప్రశంసించవలసిందే"అంది.

ఇంతలో వజీరాబాదుస్టేషన్ వచ్చింది. బండినుంచునుటలోనే రత్న సావిత్రి చేయిపట్టుకుని క్రిందకు దిగి అటువెళ్లుదాంరా అన్నది.

సావిత్రి నిశ్శబ్దంగా ఆమెవెనుకనే పోయింది. రెండునెలల క్రిందట రత్న నిస్సహాయయై భగవంతుని ప్రార్థించుచూఉన్న చోటికివెళ్లేరు. ఆసమయంలో ఆస్థలం ఎంతభయంకరంగాఉంది? రత్న సావిత్రితో "సోదరీ! నాయీపరివర్తనమునకు కారణమైన స్థలమిదే. ఇక్కడే నాబంధములు విడివడ్డవి. ఈస్థలమే నాకు స్వతంత్రతదొరకుటకు మూలకారణమయింది. నాకు ఈస్థలము మందిరముకంటెకూడా పవిత్రమయింది.

ఇంతలో సావిత్రి ఒకరైల్వేబాబువంక చెయిజూపి "చూడు: ఆయనెవరో గుర్తించగలవా?"అంది.

"లేదు! ఎవ రాయన?"

సావి:—(చిరునవ్వుతో) నీ ఈమందిరముయొక్క దేవత. నేను పాద్యశాణపుష్పములతో, ఆరోజున పూజజేసిన బాబు. నీవు ఇంతలోనే మరచితివా? ఆయనకు నమస్కరించు.

## మూగనోము

బోడు బాపిరాజుగారు

"సకియ! ఈమనోహరశరత్సంధ్యలందు
ఏఫలంబునుగోరి చలింపనట్టి
దీక్ష నోములు నోతువో తెలియబలుకు
మతని చిరజీవిగాజేయువితముగాక?

చనువును జూపుచుండుదువు చానరో! మొన్నటిదాక; ఇంక నా
తనిని వివాహమై సరిగదాటదు వత్సర. మప్పుడే మమున్
గనియును పల్కరింపవిదిగర్వమొ? నాథునికెట్టి భాగ్యముల్
దనరినమాటలాడదగదా? పలుకే కనకంబ? నెచ్చెలీ!
దాపునజేరి; రాగభరితస్ఫురితాతివిలాసనేత్రవి
క్షేపములన్ నయించి; మధుశీకరసేచనమంజులప్రియా
లాపములంగరంచెడి కళానిధి నీపతి వచ్చుచో వ్రతో
ద్యాపనజేయజూడవుగ తత్సుముహూర్తమునన్ సవిస్మృతిన్?
అలలితస్మితాననకటాక్షములేటికి? అకరాంగుళీ
చాలనమేల? అవిముఖసౌహృదమెందులకు? అత్రపాభరం
బేలనె; బేల? ముద్దులొలికించెడి మోవిదెరల్చి తేనియల్
జాలుకొనంగ ఒక్కనుడిచాలు వచింపుశ్రవఃప్రియంబుగా.

కుదురుగ చేత కుంకుమపుక్రొంబరణిన్ ధరియించి, కుచ్చెళుల్
పదములనంటి ముద్దుగొన పావడదాలిచి, 'రాళ్లవంకి' చే
నదుముచు మధ్యమధ్య, తిరుగాడుచునుంటివి వాడవాడలన్
ముదితరో! ఏమినోము? ఫలముల్ వచియింపు మటన్నపల్కవే?
అమ్మకచెల్ల! ఎంతవగలాడివె! ఈగతినెన్నియన్ననున్
గిమ్మనకుండ నోములనొకేగతి నోచుచున్నదానవు" అం
చిమ్మెయినెచ్చెలుల్ కొసరి హేళనసేయ మృదుస్మితంబు భా
వమ్మొలికింపగా మగుడ బాలిక తాఁవ్రతరక్షఁజేసెడిన్.

నోములునోచి, పెల్లుగమనోరథముల్ సమకూర్చుకొన్న వా
రీమహిళావతంసలు; తరించిన వీరి యమోఘసద్వచ
స్తోమవిభూతిలేతమనసున్ దడియార్చి కలంచుచున్ననీ
కామితముల్ ఫలించు పదకంజములంటి నమస్కరింపుమా.

తమ్ములుకన్నుమూసె; కుముదమ్ములు నాథునిజూడగోరి కం
దమ్ములువిచ్చుచుండె; నినదమ్ములొనర్చెడి బంభరాళి; అం
దమ్ములచందమామయు ముదమ్ములరన్ జనుదెంచె; చంద్రకాం
తమ్ములుమీఱె; జేరెనుద్రుతమ్మునరిక్కలు, లెక్కపెట్టుమా.

తడయకనిప్డె డాసిపసిదాన! జయంబిడె ఈపరీక్షలో
బడసిన భావిజీవితశుభప్రతిపాదకమౌను ధాత్రి నే
ర్పడసుయశంబుగల్గును భవజ్జయగాథల నాలపించు చె
ల్లెడలను దెల్గువా రనుసరింతురు నీనియమప్రభావముల్.

కులుకుచు వంగిమైదువలకున్ నతిసేయుచు గొన్నదీవనల్
బలమొసగంగనిష్ఠమెయి బాలసజేసిన మూగనోములో
నలవడజేసికొన్న మధురాంచితదివ్యసుభాషణంబులన్
జిలుకలకొల్కి తప్పక పునీతము జేయుము ఆంధ్రవాణినిన్.

శ్రమపడి పల్లవాధరము జక్కబిగించి, సభామణుల్ పరా
గములొనరింపనోర్చి, సరిగా వ్రతపూర్తి నొనర్చినట్టి నీ
కు, మహి నఖండసౌఖ్యములు కోరినకోర్కు లొసంగి నాథు ప్రే
మమున ముదంబుజెందగ రమారమణీమణి కూర్మి నోముతన్.

# స్త్రీ ఉద్యమము

న్యాపతి కృష్ణారావుగారు బి. ఏ; బి. యల్.

హైందవనారీమణులు నేడెల్ల విషయములందును పాశ్చాత్యసోదరీమణుల తిలకించి వారివలెనుండుటకు ప్రయత్నించుచున్నారుగాన అన్యదేశములందు స్త్రీఉద్యమమెట్లున్నదో పరీక్షించుట యుచితము.

అంతర్జాతీయప్రసక్తిగల స్త్రీయుద్యమము నేడుదయించుచున్నది. అయ్యది సర్వవిధముల మానవుల కుపయోగించుననుటకు సందియములేదు. ప్రాచ్యులలో తుర్కీ స్త్రీలు ఈయుద్యమమునందున ప్రథమమున అడుగిడిరి. తరతరములనుండియు టర్కీ స్త్రీలు గోషానుబూని పరదావెనుకనే జీవించుచుండిరి. ఒడలునిండను ముసుగుధరించి వెలుపలకువచ్చుటకుగాని, పురుషునియొద్దకు పోవుటకుగాని వారికి వీలులేకుండెను. ఐరోపా మహాసంగ్రామమందు తుర్కీ స్త్రీలను వైద్యశాలలందును,తదితరదయాదాక్షిణ్యనిలయసంస్థలందునుపాల్గొనుటకును అనుమతియిచ్చిరి.వర్తకమునందును, ఇతరవృత్తులయందును ప్రవేశించుటకిది మార్గమయ్యెను. టర్కీయువకపక్షము అపుడు రాజ్యాంగమందుండెనుగాన టర్కీదేశమున పూర్తిగ పాశ్చాత్యసంప్రదాయముల నవలంబింపవలెనని ప్రయత్నములు సలుపబడెను. అందు మొదటిది స్త్రీలస్వాతంత్ర్యము.

ముస్తఫా కెమాల్ పాషా గోషాయున్న, బహుళపాణిగ్రహణమునున్నా తొలగించితిననియు; స్త్రీపురుషుల కిరువురకును సరిసమానమైన హక్కులుగలవనియు చాటించెను. కాని చిరప్రతిష్ఠమైన ప్రాచ్యసంప్రదాయములు, ఆచారములు, వ్యవహారములవలన ప్రెసిడెంటు కెమాల్ పాషా ప్రారంభించిన సంస్కారణము లాదేశమునందు పూర్తిగవ్యాపించలేదు.

తుర్కీ స్త్రీలసంస్కారమందు వారిపురుషుల సానుభూతికలదు. ఒక టర్కీయుద్యోగస్థుడు టర్కీదేశము ముందంజవేయకుండుటకుకారణములు తెల్పుచు తుర్కీ స్త్రీలకు పురుషులతోబాటు సరిసమానమైనపదవి యివ్వకుండుటకూడ యొకటనినుడివెను. "మనము స్త్రీలను మనతోబాటు ఎపుడు వృద్ధిలోనికి తెచ్చెదమో అపుడే మనసంఘము సంస్కారముపొందినదగును. భావవిన్యాసమును, శీలనిశ్చలతయు నాగరకత యనిపించుకొనును. స్త్రీపురుషులెపుడు ఒకరితోనొకరు విచ్చలవిడగకలసి సంచరింతురో అపుడే పురుషులకున్న నైతికవ్యవహారములు మరింత దిట్టమగును." అని యాయుద్యోగస్థుడు వక్కాణించెను.

లాటీఫ్ హనూమ్, సెల్మారెక్రెస్, హలీద్ హనూమ్ అనువారు స్త్రీలస్వాతంత్ర్యమునకై ప్రచారము సల్పిరి. 1916-వసంవత్సరమున స్త్రీలను టర్కీవిశ్వవిద్యాలయమున చదువుకొననిచ్చిరి. నాటినుండియు దొరకిన యవకాశమును స్వర్థపుచ్చుక స్త్రీలు చక్కగ విద్యనభ్యసించి నేడు కోర్టులయందును, వర్తకవ్యాపారములందును, నాట్యరంగములందును, తదితరవృత్తులయందును పాల్గొనుచున్నారు. క్లబ్బులందు తుర్కీ స్త్రీలను పాశ్చాత్యదేశపుగౌనులతోను, కత్తిరించుకున్న (Bobbed) తలలతోను చూడవచ్చును. కాన్‌స్టాంటినోపిల్ పట్టణవీథులలో నేడు తుర్కీ స్త్రీలు పాశ్చాత్య స్త్రీలవలె దుస్తులుధరించి ముసుగులేకయే నడుచుట అచ్చెరువును కలిగింపదు. కాని అమెరికా, ఐరోపా స్త్రీలతోపోల్చిచూచినయెడల టర్కీ స్త్రీలింకనువృద్ధిచెందవలెను. అయినను పదిసంవత్సరములలో వింతమార్పుకల్గుట అద్భుతమైయున్నది.

ప్రాచ్యులలో టర్కీ స్త్రీలతరువాత ఈజిప్టుదేశ స్త్రీలు వత్తురు. కైరోపట్టణపు ప్రపంచమునవెలయు స్త్రీసంస్థలన్నిటిని అతి జాగరూకతతోను, మెలకువతోను గమనింతురు. వారికి విశాలహృదయమును అంతర్జాతీయసానుభూతియుకలదు. వీరిలో నాయకురాలు హూదాషి శేయిపాషా. ఈమె ఈజిప్టుదేశపు జమీందారుల కుటుంబమునకుచెందినది. మిగుల సుందరమైనవనిత. చక్కని విజ్ఞానముగలది; వర్తకవ్యాపారమునందు

కడుచేర్చిరి. ఈజిప్టుదేశములో పర్దాయును, ముసుగును అతిక్రమించిన స్త్రీలలో మొదటిది. ఈమె పూర్వ సంప్రదాయములనుల్లంఘించి పురుషులను తనభవనము కాహ్వానించును. ఈజిప్టు స్త్రీయుద్యమమునకు కార్యదర్శి హిసాన్ అహమ్మదుషాకీర్. మహాశక్తియు, ధైర్యమును ఈమెకుకలవు. ఈమె వ్యాసకర్త్రికూడను. అమెరికావిశ్వవిద్యాలయమైన బీరటునకువెళ్లెదనని ఈమె కొన్నిసంవత్సరములక్రితము ప్రకటించెను. అప్పటివరకు ముసల్మాను స్త్రీ లెవ్వరును బీరటువిశ్వవిద్యాలయమునకు వెళ్లియుండలేదు. అచట మొదటిసంవత్సరమున తానొక్కతెయె పురుషులతోగూడి విద్యనభ్యసించెను. అట నాలుగుసంవత్సరములు గడపినపిదప కొలంబియా విశ్వవిద్యాలయమునకుబోదలచెనుకాని విద్యాసంఘమువా రామెకు ప్యాసుపోర్టు నివ్వరైరి.

ఈజిప్టుస్త్రీల కార్యక్రమమునందు పెక్కువిషయములుకలవు. చాల పాఠశాలలు నిర్మించవలెననియు, బడ్జెటులోనుండి యింకనూ స్త్రీవిద్యకై ధనము వ్యయముచేయవలెననియు అచటి స్త్రీలు కోరుచున్నారు. ఇపుడు నూటికి రెండురూపాయలచొప్పున వీరివిషయమై వ్యయపర్చుచున్నారు. బాలురకును, బాలికలకును విద్య తప్పనిసరిచేయవలసినదని వారు ప్రచారముచేయుచున్నారు. అచటయున్న అలజారువిశ్వవిద్యాలయము నూతనపరిస్థితుల కనుగుణ్యముగనుండవలెనని వీరాందోళనచేయుచున్నారు. స్త్రీలు వైద్యశాలలను స్థాపించి పురుషులతో సమానస్థాయిని జెలిబుచ్చుచున్నారు. వారి ప్రచారప్రారంభమున బహుళపాణిగ్రహణము నిషేధించవలసినదని యొకచట్టమేర్పరుపప్రయత్నించిరిగాని అది వీగిపోవుననియెంచి ఒకమారు వివాహమాడిన పురుషున కిక బాలికల నివ్వకూడదని నిర్ధారణచేసుకొనిరి. స్త్రీకి ఎంత నీతివలయునో పురుషునకుకూడ అంతియేవలయునని వీరు ప్రబలముగ తెల్పుచున్నారు. వారి కార్యక్రమవిషయములలో నొకటి ప్రపంచ మైత్రి **(World Friendship)**.

పురాతనమైనట్టిదియును, మహమ్మదీయులకు నాటపట్టయినదియునగు సిరియాదేశమునకూడ స్త్రీయుద్యమము ప్రబలుచున్నది. ఇచ్చటి నాయకురాలు సాహసవంతురాలును, స్వాతంత్ర్యాభిలాషకలదియును. డెమాస్కసుపట్టణపురంధ్రియగు నాజీకు అబేదుకన్య అరబ్బీతిరుగుబాటున ఫేజల్ అను రాజకుమారునితో కలసి పనిచేసెను. సిరియాలో పోలీసుయొక్కయు, నిషేధసంఘముయొక్కయు ప్రతిఘటన యున్నప్పటికిని అబేదుకన్య స్త్రీల కుపయుక్తమగునట్టియు, వారిహక్కులను కాపాడునట్టియు సంస్కరణములను ప్రతిపాదించెను. సిరియా స్త్రీలఆదర్శము లింకను నెరవేరకున్నను ప్రచారకులు తమదేశజనులకు నిజస్థితిగతులను నచ్చచెప్పకలుగుచున్నారు.

సిరియాలో ప్రాముఖ్యతవహించిన స్త్రీలలో జూలియా డెమిషీకు ఒకతె. ఆమె గ్రంథప్రకాశకురాలు; సంపాదకురాలు. ఈజిప్టు, సిరియా, మెసపొటేమియా, టర్కీ, పర్షియా, అరేబియా, పాలెస్టీను మున్నగుదేశములలో విరివిగా చదువబడుచున్న "నూతనస్త్రీ"అను మాసపత్రిక ఈమె స్థాపించినదియే. ఆమె రాజకీయ వారపత్రికనొకదానిని నెలకొల్పెను. అందు జాతీయత, ఫ్రాన్సు బ్రిటిష్‌వారలఆజ్ఞలు, లీగ్ ఆఫ్ నేషన్సు విధానము, అరబ్బులకు జియోనిష్టులకున్న కష్టములు, ముసల్మానుసమస్య, కుర్దీ:తుర్కీ-పర్షియాత్రయము, బాగ్దాడ్ నూనెసమస్య, రష్యారాజ్యాంగవిధానము, హిందుదేశపుభవిష్యత్తు, మున్నగువిషయములగూర్చి విద్వజ్జనులీవారపత్రికయందు విపులముగను, ధైర్యముగను వ్రాయుచుందురు.

చీనాదేశములో స్త్రీయుద్యమము క్యాంటనునగరములో డాక్టరు సన్యట్‌సేనుగారి సతీమణి ఆధిపత్యముక్రింద ప్రకాశించుచున్నది. తనభర్తయేర్పఱచిన నూతన రాజకీయవిధానమందు పాల్గొనుటకు ఆమె తన సోదరీమణులను తరిఫీదుచేయుచున్నది. సన్యట్‌సేను ప్రకటించిన డిక్రీప్రకారము క్యాంటనునగరపు

స్త్రీలకు పురుషులతోబాటు సమానమైనహక్కులుకలవు. రష్యాలో ప్రజాసేవకుడైన లెనిను యెట్టిగౌరవమును పొందెనో డాక్టరు సన్యటుసేనుగారు దక్షిణచైనాదేశమునందంత ప్రజలహృదయముల చూఱకొనెను.

క్యాంటనులో స్త్రీలసేవకు పురుషులకున్నట్టి కట్టుబాటేకలదు. చాలమందిస్త్రీలు పురుషులవలెనే దుస్తులను ధరింతురు. పీకింగునగరమున స్త్రీపరిశోధకులును, స్త్రీపోలీసులునుగలరు. స్త్రీలు అన్నివృత్తులందును క్రమముగ ప్రవేశించుచున్నారు. చైనాలో నూతనముగ ప్రచారములోనున్నభాష క్రమముగ ప్రజలకెల్లరకు తెలిసినపుడు స్త్రీలప్రచారము ప్రజాబాహుళ్యమునకు మిక్కిలి మిక్కిలి అవగాహనముకాగలదు. చైనాలో రాకపోకలు, వార్తలు సరిగలేనందున కార్యమునందైకమత్యము నెఱవేరకున్నది. గ్రాంథికభాషయొక్కటేఅయినను, వాడుకభాష అందఱకును ఒక్కటిలేదు. ప్రజలెక్కుడుమంది చదువురానివారగుటచే స్త్రీప్రచారము వారిలో జొరకున్నది. చైనాలో ఆంతరంగికవిప్లవములులేకున్నచో స్త్రీలింకను తమ యుద్యమమును వృద్ధిచేసెడివారు.

జపానుదేశపుస్త్రీలు చైనావారివలెఅతివాదులుకారు. ఇచట నూతనస్త్రీసంఘము 1920-వసంవత్సరములో స్థాపింపబడెను. పురుషులతో స్త్రీలకుకూడ సమానమైనహక్కులు బాధ్యతలుకలవని వారిప్రణాలిక. పూర్వము స్త్రీలెవ్వరును రాజకీయశాసనసభలకు వెళ్లకూడదనియు, కావింపకూడదనియు జపానుయందొకచట్టముండెను. 1921-వసంవత్సరములో జపానుడైయటు (అనగా శాసనసభ)కు వెళ్లవచ్చుననియు, అచట యుపన్యాసమువినవచ్చుననియు ఒకచట్టమును తీర్మానించిరి.

యూరోపునందు 500సంవత్సరములలో నెంతమార్పుకలిగెనో ఆసియాఖండమునందు 25 సంవత్సరములలో నంతమార్పుకలిగినది. 1910-వసంవత్సరమువరకు "ఓకుసామ" (Okussama i. e. Wife) అనగా భార్య, అను పదమునకర్థము "లోనయుండెడిస్త్రీ". నేడు ప్రపంచమునందువలెయు అన్నియుద్యమములు అన్నివిషయములు ఆమెకు తెలియును. ప్రతివృత్తియందును ఆమె ప్రవేశించుచున్నయది. జపానులో 1200 మంది స్త్రీవైద్యులును, 3500 మంది దాదులును, 500 మంది దంతచికిత్సచేయుస్త్రీలును, ఇంకను పెక్కుమంది మందులను విక్రయించువారును గలరు. కొంతమందిస్త్రీలు మోటారుడ్రైవర్లుగనున్నారు. ఒకస్త్రీ యొకయోడనడుపుచున్నది. శ్రీమతి సూజాకి అనునామె జపానుస్త్రీలలో చాల ఘనతవహించినది.

టోకియోపట్టణమున స్త్రీలకు బాలికలకుకలసి యిరువది మాసపత్రికలుకలవు. జపానులో నూటికి తొంబైయొనమండుగురు చదువునేర్చినవారగుటచే వారికి చదువుయందభిలాషమెండు. ఈపత్రికలనొకమారుపరిశీలించినచో జపానుస్త్రీలు ప్రపంచసమస్యలను, విషయములను మెలకువతో పరీక్షింతురని తెలిసికొనవచ్చును.

రానురాను స్త్రీలు దేశీయబంధనములుత్రెంపి అంతర్జాతీయహృదయమును ప్రకటించి పురుషులశ్రేయస్సుకొరకై అభివృద్ధిచెందుచున్నారు. అంతర్జాతీయసభలందు స్త్రీలు పాల్గొనుకతన వారిహృదయము విశాలమై అన్యదేశస్త్రీల సమస్యలును, తమ సమస్యలును ఒకటేయని తెలుసుకొనుచున్నారు."

— నాన్సీ ఆస్టిన్ వ్యాసమునకనువాదము.

## ముద్దారనేర్పించినన్

వడ్డాది సుబ్బారాయుడుగారు

మ. అదనంబో నలురెల్లు నారులకు ధీయు; డ్రిందునందమ్ము మిం
చెదరన్ కుత్సితపుం దలంపుననో, సౌశీల్యంబు భగ్నంబగున్
జదురెక్కుం గులకాంతలన్న వెఱనో, శాసించి రిల్ దిద్దనే;
ముదితల్ నేరఁగరానివిద్యగలదే ముద్దారనేర్పించినన్.

## స్త్రీలు: ధర్మతత్త్వము

బం. సూర్యనారాయణశాస్త్రిగారు

స్త్రీలచరిత్రము కేవలము పురుషునిచరిత్రమునకు విపరీతముగానుండును. స్త్రీలకు ప్రణయము జీవనాధారము. స్త్రీలు ప్రణయప్రవృత్తికి వశంవదలై పతినిమిత్తము వారు నానావిధశారీరకమానసికకష్టములకోర్చి సహిష్ణుతాగుణమును బూనినచో బహువిధముల ప్రశంసనీయులగుదురు. ఇందులకు సీత, సావిత్రి మున్నగు సౌభాగ్యవతులగు సతీమతల్లుల చారిత్రములు మనకాదర్శములు. సంతానలాలనాపాలనాధారమంతయు పురుషులకంటె స్త్రీలయందు స్వభావముచేత ప్రణయగుణము నధికముగానుండునటుల జేసెను. మరియు స్వభావముచేత స్త్రీలబలలు. గనుకనే వారు సదా పురుషుల నాశ్రయించుకొని యుందురు.

పురుషులకంటె స్త్రీలు సర్వదా సర్వత్రపూజ్యలు. పాశ్చాత్యులలోగూడ పురుషునికంటె తొలుదొల్త స్త్రీనే సత్కరించు నాచార మిప్పటికి వివాహోత్సవములలో గానవచ్చుచున్నది. సర్వవిధముల పురుషులు స్త్రీల నెక్కుడాదరముతో జూచుచుండవలయును. విద్యావిహీనులగు గొందఱు స్వస్త్రీల నతిహేయముగాను, కేవల భోగోపకరణముగాను జూచుచున్నారు. అది కేవలము నీతిబాహ్యము, పాపకృత్యము. ఇందుకు తార్కాణముగా మనువు ఏగృహమున స్త్రీ సంతుష్టులగుదురో యాగృహమెప్పుడు శోభిల్లదని చెప్పియున్నాడు. మంగళమునుగోరు ప్రతివారును అనగా తండ్రి, అన్న, భర్త, మరది మొదలగు వారు స్త్రీలను వస్త్రాద్యలంకారములనిచ్చి సన్మానింపవలయును అనియు; ఎచ్చట స్త్రీలు సన్మానింపబడుదురో అచ్చట దేవతలు సంతృప్తులగుదురు, మరియు నెచ్చటసన్మానింపబడరో అచ్చట వారికార్యములు విఫలములగునుఅనియు చెప్పియున్నాడు. ఆకారణముచేత ఐశ్వర్యకాములు స్త్రీలను వస్త్రభూషాద్యలంకారములచేత పూజింతురు. ఏగృహమున సతీపతులు పరస్పరము సంతోషితస్వాంతులై మెలగుదురో ఆమందిరమున బహువిధశుభములు జరుగునని మనువు వేరొకచోట చెప్పియున్నాడు. తల్లిదండ్రులకంటె నధికప్రాణమగుభార్య తన కర్ధాంగియైయుండ పతి పత్నికన్యాయముజేయుట సర్వవిధముల నశుభదాయకము. ముఖ్యముగా నిప్పటి మనయనాలోచితపాశ్చాత్యవిడంబకులగు పురుషులు స్వస్త్రీపూజ్యతను గ్రహింతురని యింతవఱకువ్రాసితిని. మరియు స్త్రీ పూజ్యతవిషయమయి కాశీఖండమందు "ఎచ్చట స్త్రీలపాదస్పర్శయగునో యచ్చట భూదేవి తాను పవిత్రురాలునగుదునని" చెప్పినటుల వివరింపబడియున్నది.

స్త్రీలు త్రికరణముగా తమపతులకు శుశ్రూషజేయుట వారికి ముఖ్య కర్తవ్యకార్యము. 'పతింశుశ్రూషతేయేన తేనస్వర్గేమహీయతే' అని పతిచరణసేవ నొనర్చినయెడల స్త్రీలకు పరలోకమున ఉత్తమగతికలుగునని ఋషులనేకులు చెప్పియున్నారు. అట్టిపతి

శుశ్రూషయే పరమధర్మముగా భావించిచేయు స్త్రీలు ఇహలోకమునందుగూడ నారీకుల మధ్యమున సర్వోచ్చసింహాసనము నధిరోహింతురు. ఇందుకు ప్రత్యక్షమయిన నొక చిన్న విషయమిచ్చట ముచ్చటింతును. గాంధిమహాత్ముడు తన జీవితచరిత్రలో—గాంధిమహాత్ముడు తన గృహమును తెల్లవారియిళ్ల పద్ధతిని కట్టించెను. ఆకారణమున గదులలో తూములు లేవు. మూత్రమునకు వేరుగా కుండలుంచుదురు. వీటిని బాగుచేయుపని వారి యాలుమగలదే గాని నౌకర్లదిగాదు. ఆరోజులలో వారింటికి ఒక క్రైస్తవుడువచ్చెను. అతను పరిశుత్ర-అతనిభాండముగూడ ఆలుమగలే యెత్తి పారవేయవలయును. గాంధిమహాత్మునిచే నెత్తింపుట కస్తూరిబాయికిష్టములేదు. ఆమెకుండలనెత్తి బాగుచేయుచుండెడిదేగాని ఈక్రైస్తవసోదరుని భాండమెత్తుట కసహ్యపడెడిది. కాని భర్తయాజ్ఞ ననుసరించుటే ముఖ్యకర్తవ్యమని నమ్మి నమ్మహాసాధ్వి మూత్రభాండములను శుద్ధిజేయుచుండెను. ఇదియే పతిశుశ్రూషకు జీవనాధారము. మరియు మహాత్ముడు "హిందూస్త్రీలలో కొలదిగనో గొప్పగనో యుండు నొకమహాగుణ మీమెయందున్నది. తలచియో, తలపకయో, ఎఱిగియో, ఎఱుగకయో నాపాదముల ననుసరించుటలో తనజీవితము ధన్యమని యామెయెంచినది. మఱియు జీవితమును నిర్మలముగా జేసికొనబూను నాపూనికలకామె యెన్నడును అడ్డురాలేదు" అని ప్రశంసించి యున్నాడు. అంతటి మహాగుణభూషితయగు కస్తూరిబాయివంటి సాధ్వియొక్క పాతివ్రత్య ప్రభావముచేతనే నిజముగా గాంధిమహాత్ముడు ప్రపంచమంతకును దైవతముడై పుణ్యపురుషుడుగా పరిగణింపబడుచున్నాడని చెప్పనోపు.

గృహసంబంధమగు సకలకృత్యములును నిర్వహించుభారము స్త్రీదై యున్నది. 'సదా ప్రహృష్టయాభావ్యం గృహే కార్యేషు దక్షయా। సంస్కృతోపస్కరయా వ్యయేచాముక్తహస్తయా॥' స్త్రీ ఎల్లప్పుడును సంతోషముతో గృహకృత్యములయందు సమర్థురాలై యుండవలయును. జాగరూకతతో వ్యయముచేయవలయును. స్త్రీ ప్రాతఃకాలమున లేచి పతికిమ్రొక్కుట గృహదైవమును నమస్కరించి గృహకార్యములయందు ప్రవృత్తురాలై యుండవలయును. అనంతరము స్నానమాడి పతి, దేవ, బ్రాహ్మణులకు సేవజేసి గృహదేవతారాధన జేయవలయును. తరువాత పతికి భోజనమిడి తాను సంతుష్టిగా భుజించవలయును. మరియు గృహసామగ్రులను శుచిగా సరియగురీతి నుంచుకొనవలయును. వహ్నిపురాణములో పూర్వాధ్యాయమున స్త్రీ ప్రాతఃకాలమున శయ్యనుండిలేచుటకు పూర్వము తాను శయ్యనువిడచి పతి లేచినవెనుక నాశయ్యను తీసుకొనిపోయి సరియైనస్థలమున పదిలబఱిచి పాకపాత్రల నుపకరణములను తానే స్వయముగా శుద్ధిచేసుకొనవలయునని గృహకృత్యములను వివరించియున్నాడు.

స్త్రీలు సదా మంగళాచరణతత్పరలై యుండవలయును. గురుజనుల యాజ్ఞలేనిది పరగృహములకు బోకూడదు. ఎన్నికయైన వస్త్రములుధరింపక యన్యులగృహమునకు జన

రాదు. ఎప్పుడు వేగముగానడువరాదు. గృహవ్యవహారికులతోతప్ప అన్యులతో మాటాడ రాదు. ఎప్పుడును హీనవస్త్రయైయుండరాదు. ఈవిధమున స్త్రీ ఆచారవిషయమయి శంఖ స్మృతియందు చెప్పబడియున్నది. మరియు యాజ్ఞవల్క్యుడు భర్త దేశాంతరగతుడై నపుడు స్త్రీ శరీరసంస్కారణముజేసికొనగూడదనగా భూషణగంధమాల్యాదులను ధరించగూడదు అని తాత్పర్యముగాని శుచిగా స్నానాదులు జేయగూడదనిగాదు. హాస్యా లాపములు, వృథాకాలక్షేపము చేయగూడదు; ప్రేక్షాసమాజములకు జనరాదు అని మరి కొన్ని విశేషధర్మములను మనువుజెప్పియున్నాడు. పైరీతిని స్త్రీ తనకార్యపరంపరలనెల్ల నిర్వహించుకొనుచు కలహకారిణిగాక సుశీలయైయున్నయెడల లక్ష్మిదేవి యట్టి గృహమున కాపురముజేయుచుండును. అట్టిస్త్రీలే సౌభాగ్యవతులనబడుదురు. సౌభాగ్యవతీలక్షణము, విష్ణుసంహితలో లక్ష్మీనారాయణసంవాదమున జెప్పబడియున్నది.

స్త్రీకి ధనాధికారవిషయమయి ప్రాచీనఋషుల యభిప్రాయమునుబట్టి స్త్రీస్వతంత్ర ముగా సంపాదించినది స్త్రీదేయగును. తల్లిదండ్రులు, భర్త, యన్నదమ్ములునొసగు ధనము స్త్రీదేయగును. కాని దానిని క్రయదానములుజేయుటకుఆమెకధికారములేదు. యావజ్జీవ మనుభవింపవచ్చును. అద్దైనను వస్త్రాద్యలంకారములధరించి భోగించుటకు వీలుపడదు. కేవలము తనపతి, సంతానక్షేమముకొఱకు వినియోగపఱచవలయును. ఆమెజనకుడిచ్చు ధనముపైని ఆమెభర్త కధికారములేదు. భర్త నామెద్రవ్యమును దీసుకొనినయెడల దొంగ వలె శిక్షాపాత్రుడగును. స్త్రీలు క్లుప్తముగా వ్యయముచేయవలయును. మరియు ధనమును గుప్తముగారక్షింపవలయును.పతివలన సంపాదింపబడినధనమంతయు సతిదేయగును. అధనము నామెయె భద్రపఱుపవలయును. ఆదాయవ్యయములు నామెయె జూచుకొనవలయును. గాని పతి సంపాదించినధనముపై తనకిట్టిస్వాతంత్ర్యమున్నను నాతని యాజ్ఞలేనిదే యేవ్యయ మును జేయరాదు. స్త్రీ అధికవ్యయముజేసినదిగా నుండరాదు. అని 'వ్యాయాచాముక్త హాస్తయా, వ్యయవర్జితా, వ్యయపరాఙ్ముఖీ' అని సర్వత్ర స్మృతులందు జెప్పబడియున్నది.

వివాహము స్త్రీకి ముఖ్యధర్మమయియున్నది. వివాహమనగా స్త్రీపురుషుల జీవై క్యము. నిజమయిన జీవైక్యమే వివాహమునకు జీవనాధారము. అది నీతివిషయికమయిన నొక కట్టుబాటు అనికూడ చెప్పనోపు. ఇది ఇచ్ఛామాత్రమయిన కలయికయని యను కొనుట పొరబాటు. నిజమయినవివాహము జరిగినపిమ్మట దానిని విచ్ఛేదము (Divorce) చేసికొనుటకు స్త్రీకిగాని పురుషునికిగాని ఎట్టి యధికారములేదు. ఇట్టి విషయసూక్ష్మతను గ్రహించినగాని స్త్రీపురుషులకు వివాహార్హత లేదు. ఈబాల్యవివాహములు వివాహములు కావని పాఠకులే గ్రహింతురుగాక. పశువులలోగూడ వివాహముగలదు. కాని అందు నీతి విషయికమయిన కట్టుబాటులేదని స్పష్టముగా జెప్పవచ్చును. ఈశ్వరుడు పశువులకంటె మనుష్యులకు ప్రతిభనెక్కుడు ప్రసాదించియున్నాడు. వివాహము విచ్ఛేదార్హమను కొంద

అనాలోచితపాశ్చాత్యవిడంబకులు, బాలికలకే వివాహమును కొంద అయథార్థపూర్వాచారపరాయణులు అభిప్రాయపడుచున్నారు. స్త్రీపురుషులకు వివాహమున నీతియే వారిని బంధించుచున్నది. వారు నీతిబాహ్యులగుదురేని వివాహము విచ్ఛేదముగావచ్చును. ఉల్లంఘనీయమగు వివాహము పశుసామాన్యమయినది. ఈవివాహసూక్ష్మతను గ్రహించు వయస్సే వివాహార్హ వయస్సు. అప్పటికి బాలిక రజోవతియైయుండుననుటకు సందియము లేదు. శాస్త్రములుగూడ రజస్వలావివాహములను విధించుచున్నవని పాఠకు లిదివఱకే గ్రహించియున్నారు. కనుక భారతసతీమతల్లులు యీవివాహసూక్ష్మధర్మమును గ్రహించి తమబాలికలకు బాల్యమునందే వివాహములనుగావించి వారి జీవనలతాలవిత్రికలు గాకుందురని వేడుకొనుచున్నాను.

ఈశ్వరుడు ప్రణయప్రవృత్తిని పురుషునికంటె నెక్కుడు నిర్మించియుండుటచేత సంతానలాలనపాలనాభారము స్త్రీకెక్కుడని యీవఱకే చెప్పియుంటిని. తన భావిసంతానగుణదోషములు తల్లియొక్క మానసికశారీరకప్రవృత్తులపై నాధారపడియున్నది. పుట్టినశిశువునకు అక్షరాభ్యాసకర్మచేసినదాదిగా విద్యాభ్యాసకాలమని తలచుచుందురు. అదికాదు. శిశువు మాతృగర్భమున పిండోత్పత్తిమొదలు నిజమయినవిద్యను గ్రహించుచుండును. ఇప్పటి నారీమణులు గర్భవతులుగానుండుకాలమున నాగరికావిశేషమున కేవల ప్రకృతి విరుద్ధమగు జీవనమును సలుపుచున్నారు. వారియాహారము, దుస్తులు, వ్యాపారము, జీవనవిధానము సామాన్యముగా ప్రకృతివిరుద్ధముగానుండును. స్త్రీగర్భిణియైయున్నదిమొదలు శిశూత్పత్తిపర్యంతనవమాసకాలమును పవిత్రముగా గడుపవలయును. ఏవస్తువులయందు స్త్రీ యెక్కువప్రీతిగలిగి ఆదరమునుజూపునో అట్టివస్తువులే శిశువునకుగూడ ప్రీతిని కలుగజేయును. సదామంచికార్యములయందు కాలమును వ్యయపఱుపవలయును. ఈశ్వరవిషయకమయిన పవిత్ర ఆలోచనలనుసలుపుచు, మనసున భయమునకుగాని తొందఱకుగాని తావునొసగరాదు. ఒసగిన పిరికివారు దుర్మార్గులుపుట్టుటకెట్టి సంశయములేదు. మరియు నిరాడంబరమయిన సత్యజీవనమును చేయవలయును. ఇట్టినియమములను గ్రహించిన మాతృరత్నములు సత్సంతానమును బడయగలరు. అటుగాక తద్విరుద్ధముగా పిండధారణమొదలుకొని స్త్రీ కామప్రవృత్తిమగ్నయై కోపమునకును చెడుఆలోచనలకును మనసున తావునొసగుచు అశాంతచిత్తయై సదా యున్నయెడల జారత్వము, క్రోధము, ఓర్మిలేమి మొదలగు దుర్గుణములే స్వభావగుణములుగల సంతానమును బడయుదురు. మరియు శిశూత్పత్త్యనంతరముగూడ పిల్లలు తల్లిదండ్రులనే ప్రతినిముసమును అనుకరించుచుందురు. కనుక ప్రతినిముసము తల్లి జాగరూకతతో నుండవలయును. తల్లు లనృతములాడిన పిల్లలు సూనృతములాడుదురా? మరియు నీవిషయములో స్త్రీలకువలె పురుషులకుగూడ నెక్కుడు బాధ్యతగలదు. పురుషుడు స్వస్త్రీచే పవిత్రజీవనమును జరిపించుటకు జాగరూకుడై ఆమెను రక్షించుచు

ప్రతినిముసమును వ్యయపఱుచుచుండవలయును. ఇక దుష్టచరితగల స్త్రీదండన మీూవిధముగా నిర్ణయింపబడినది. సదా అప్రియములు బలికెడు స్త్రీని భర్తతోడనే పరిత్యజింపవలయును. స్వగృహకార్యములయందు మనస్సిడక చెప్పినమాటవినకపోయిన లేక యిష్టానుసారముగా ధనమును వెచ్చించిన భర్త యామెను పరిత్యజించి మరియొక స్త్రీని వివాహమాడవలయును. తండ్రియొసగుధనముచే గర్వితయై తనపతి నవమానముజేసినను, పరపురుషు నాశ్రయించినను, రాజట్టియామెను శునకములచే గరిపించి శిక్షించవలయును. మరియు స్త్రీ ప్రేక్షాసమాజములకు బోయినయెడల అట్టిస్త్రీనుండి భర్త జరిమానాను వసూలుచేయవలయుననియు, అనేకవిధులుగలవు.

గనుక నోసోదరీమణులారా! రమణులు పవిత్రసీలిమార్గప్రవర్తలై, కులధర్మపత్నులై, భ్రాతృప్రేమగల సోదరీమణులై, పుత్రవాత్సల్యముగల మాతృదేవతలై, పతిభక్తిగల ప్రాణప్రియలై, సరళస్వభావలై యుండిరేని సీతమున్నగు సాధ్వీమణులవలె రమణీరాజ్యమున అగ్రసింహాసనము నలంకరింతురు.

## దురదృష్టము

శ్రీమతి బసవరాజు వేంకటరాజ్యలక్ష్మమ్మగారు

చూచితిమెంతో దేశము
సుఖముశాంతి దొరుకునోయుని;
మునిగితిమెన్నో నదులను
మోక్షము చేపట్టుదమని;
ఎక్కితిమెన్నో కొండల
నీశ్వరుదర్శింతామని;
మ్రొక్కితిమెన్నో వేల్పుల
కొక్కపండువరమిమ్మని;

నోచితిమెన్నో నోముల
కాచిబ్రోచుననిపార్వతి;
కడకు దేవి దయచేతను
కంటిమిరత్నములు రెండు.
బతుకు కలంకారములో
వానిదాచచేతకాక
ఎచటనోపోగొట్టుకొంటి
మెంతటి దురదృష్టమునవో!

## బృందావనంబున కృష్ణుడు

శ్రీమతి గంటి కామేశ్వరమ్మగారు

కస్తూరితిలకంబు కమనీయముఖమున
విస్ఫూర్తితంబుగ వెలయుచుండ
మణిరాజమనియెడుఘనకౌస్తుభంబు త
ద్వక్షస్థలంబున వరలుచుండ
చారుముక్తాహారసంతతుల్ గళసీము
కమితమై తగువిలాసమునుగూర్ప
విశ్వమోహనమైన విమలగానమొలయు
మురళిహస్తంబున మురియుచుండ
ధరణీజంద్రికాకాంతులుతాండవింప
పిల్లకమ్మనివాయువుల్ మెల్లవీవ
గోపకాంతలుతమివీూఱగూడియుండ
నెలమిబృందావనంబున జెలగుకృష్ణ!
నిన్ను నెన్నంగదరమౌనె సన్నుతాంగ?

# బార్డోలీ స్త్రీలు

మంగళంపల్లి చంద్రశేఖరరావుగారు

“ఆమె తనచేతులచే నాతనికంఠమును కౌగిలించి, కన్నీరుమున్నీరుగాగ చిన్ననాటి ప్రేమగాథలను జ్ఞప్తికితెచ్చుచు తనను, పిల్లలనుచూచి దేశమును మఱవమనునా? అనదు.”

—టెరెన్సు మాక్స్వినీ.

సర్దారు వల్లభాయిపటేలుయొక్క అఖండవిజయప్రాప్తికి మూడవకారణము అతడు స్త్రీలలో నొనర్చిన అద్భుతప్రచారమే. ప్రథమమున బహిరంగసభలకు స్త్రీలు కొలదిమందియేవచ్చుచుండినను, రానురాను వీరిసంఖ్య హెచ్చి చివరకు కొన్నిసభలలో పురుషులసంఖ్యకంటె మించిపోవుచుండెను. ఇదియేగాక స్త్రీలకు ప్రత్యేకసభలుగూడ ఏర్పాటుచేయవలసివచ్చుచుండెను. ఇట్లు నెమ్మదిగానైనను స్త్రీలలోగలిగిన అద్భుతప్రచారమే సర్దారునకు స్త్రీలొక్కరే సహాయముచేసినను సత్యాగ్రహము విజయమునొందునను గట్టినమ్మకమునుకలిగించినది. నిరాడంబరత, నిర్మలస్వభావము, సహజసహనశీలాదులునుగల స్త్రీలే పవిత్రమగు సత్యాగ్రహయుద్ధమునకు పురుషులకంటె అర్హతములని యాతనివిశ్వాసమగుటయే స్త్రీప్రబోధమునకాతడు ప్రత్యేకశ్రమదీసికొనుటకు గారణము.

బ్రూమ్ఫీల్డుకమిటీవారితోగూడ విచారణనిమిత్తము మేమొకగ్రామమునకు బోయియుంటిమి. అచట * దూబ్లాల స్థితిగతులను విచారించుచు, ♦ కాన్బీలు దూబ్లాలకీయవలసిన ధాన్యాదులను సరిగా ఇచ్చుచున్నారాయని యొక కాన్బీరైతు నడిగితిమి. అతడు సరిగనే యిచ్చుచున్నామని బదులుజెప్పెను. మాసంభాషణవంతయు లోపలిచావడిలోనుండి వినుచున్న స్త్రీలలో నొకఆమె తటాలున వెలికివచ్చి “ఏల మనవారి ఎదుటగూడ అసత్యములాడెదరు? సరిగా ఇచ్చుటలేదని నిజము నొప్పుకొనరాదా? మనలను దూబ్లాలు విసిగించుచున్నది నిజమే; దానికి మనముగూడ వారల నన్యాయముగా చూచుచున్నదియు నిజమే. మనమొకరి ఎడల ఒకరమిట్లు సంచరించుటచేతనే మనస్థితి యీలాగునఉన్నది” అనెను. ఆగ్రామములోనే కొందరు పురుషులు తమతమ ఋణములను వెలిబుచ్చుటకు సిగ్గుపడుచుండిరి. వారిలో నొకనిభార్య తనభర్తను “ఏల నిజమును జెప్పుటకే సిగ్గుపడెదరు. ఇట్లు అనవసరముగా సిగ్గుపడుటయే మనల నీదుస్థితికి ఈడ్చుకొనివచ్చినది” యని కఠినముగా మందలించెను.

ప్రప్రథమమున బహిరంగసభలకు స్త్రీలు వేలకొలదిగవచ్చుచుండుటయు, ధైర్యముగ జాతీయగీతములు బాడుచుండుటయు చూచుచుంటిమి. జప్తులతుపాకుల సైతము నిశ్చలముగ సహించుచుండుటగూడ మామూలయ్యెను. అయినను వీరిభర్తలు వీరినుంచి వేరుపరుపబడి జైళ్ళకు గొనిపోబడినపుడుగూడ ధైర్యమును చిక్కబట్టగల్గుదురాయని అపుడపుడు సందేహమొందవుచుండెను గాని వృద్ధురాలగు మణ్ముఖలాలుతల్లిగారు ఈపరీక్షకుగూడలోనయి గెలుపొందెను. విద్యావంతురాలును, పూర్వాపరసందర్భములను బాగుగా నెరిగిన ఈమె అట్లు నిలువబడినచో ఆశ్చర్యమేమి? కాని విద్యాగంధశూన్యలై అజ్ఞానమున మునిగియున్న ఈబీద కాన్బీయువతుల సంగతేమి?

ఈప్రశ్నకు జవాబు మాకు త్వరలోనే లభించెను. ఒకగ్రామములో స్త్రీలసభ జరిగెను. అందు ఆగ్రామస్త్రీల తరఫున సర్దారు నాహ్వానించుచు పదునాలుగేండ్ల బాలిక యొకర్తు ఈవిధముగా నుడివెను:

* మనప్రాంతములో పంచములవంటి తెగవారు.

♦ సామాన్యవ్యవసాయదారులు.

"సర్దార్జీ! మాగ్రామశిబిరాధిపతియగు రవిశంకరభాయి ప్రభుత్వమువారిచే నిర్బంధింపబడుట మాకు విచారహేతువయ్యెను. కాని అతని నిర్బంధమే మాఉత్సాహమును, పట్టుదలను ద్విగుణీకృతమొనర్చెనని చెప్పుట కెంతయు సంతసమగుచున్నది. మాకందరకునుగూడ మాభూములను గవర్నమెంటువారు వశపరచుకొనెదరని నోటీసులువచ్చినవి. మాపురుషులుగూడ జైలునకేగవలసిన సమయము త్వరలోనేవచ్చునని నమ్ముచున్నాము. నాతండ్రితో అతడు జైలునకేగినచో మాభూములను మాఅక్కచెల్లెండ్రమిద్దరును గలసి సాగుచేసెదమని ఇదివరకే చెప్పియుంటిని."

వంకనేరు గ్రామములో ఒకపరి చాలమందిరైతులను ఒకేసారి అరెస్టుచేసిరి. ఇట్లుచేయుటవలన ప్రజల హృదయములందు అధికముగుభీతిని కలిగింపవలయునని ప్రభుత్వమువారి ఆశయమైయుండెను. కాని భయమెక్కడ? అట్లరెస్టుకాబడినవారందరితోపాటు వారిభార్యలుగూడకోర్టునకుపోయి విచారణయంతయు శాంతముగా వినిరి. విచారణానంతరము పోలీసువారారైతులకందరికి చేతులకు సంకెళ్ళువేసి జోడాలుగా అందరిని ఒకేగొలుసుతో బంధించి వీధులవెంబడి నడపించి రైల్వేస్టేషనుకు తీసికొనిపోయిరి. వారిభార్యలుగూడ స్టేషనువరకు వారిననుసరించిపోయిరి. విచారమనునది ఆయువతులహృదయములం దేమయిన యుండెనో లేదోగాని వారివదనములందు లేశమయిన గన్పడలేదు. తరువాత ఆరైతులందరును ట్రెయినులో ఎక్కింపబడిరి. నిర్ణీత కాలమునకు బండి కదలిపోవ నారంభించెను. అంత నానారీమణులందరును జయజయధ్వానములతో తమతమ భర్తలనుండి సెలవుగైకొని యిండ్లకు మరలిపోయిరి.

బార్డోలీయుద్ధపుటాఖరుదినములలో గవర్నమెంటువారు ఒకకాన్బీరైతును సర్కారుద్యోగి నొకనిని అడ్డుకొని కొట్టెనను నేరముక్రింద అరెస్టుచేసిరి. ఆసందర్భమున అతనిభార్య జూపిన ధీరత్వమునకు అంతులేకపోయెను. ఆరైతు మిగుల మెత్తనిస్వభావముగలవాడగుటచే నాతని నేలాగునకైన లొంగదీయవలయునని గవర్నమెంటువారతనిని ఏరి నిర్బంధించిరనిగూడ ఆమెకు బాగుగా విశదమాయెను. అదియునుగాక అతని మీద నారోపింపబడినది నేర మేయగుచో అపనిని చేసిన దామెయైయుండెను. ఈవిషయమునే ఆమె పోలీసులతోగూడ "జప్తుఉద్యోగులు వచ్చినపుడు తలుపులనుబిగించినది నేనుగాని నాభర్తగాదు. నాభర్త ఆసమయమున అచట లేనేలేరు" అని పలుమారులు చెప్పియుండెను. కాని ఆమెమాటలను వినువారెవరు? పోలీసువారామెభర్తనే నిర్బంధించిరి. గాని. అతడటులబంధింపబడి మేజస్ట్రేటుఎదుటకు గొనిపోబడుటకు పూర్వమే ఆమె అతనిని సర్దారుయొక్క ఆశీర్వచనముపొందుటకు ఆశ్రమమునకు తోడ్కొనివచ్చెను. పిమ్మట సర్దారు సమ్ముఖముననే ఆమె తనభర్తతో "చూచితిరా! మేజస్ట్రేటుఎదుట భయపడుటగాని, అస్పష్టముగా జవాబులిచ్చుటగాని చేయకుడు!! ఎంతశిక్ష వేయగలడో అంతశిక్షయు వేయమనుడు!!! నన్ను గురించియు పిల్లలనుగురించియు ఏమియు చింతింపకుడు! మేజస్ట్రేటునకుమట్టుకు ధాటీగాజవాబీయుడు" అనియనుచు సర్దారుతో "నన్ను వదలి నాకుబదులుగా వారి నరెస్టుచేయుట మిగుల అన్యాయము. జైలనగ నేమిభయము? నన్నరెస్టుచేసియున్నట్లయితే స్త్రీలెంత సమర్థురాండ్రో వారల కొకపర్యాయము చూపించెడిదానను. జైలులో ప్రతి ఖైదీయు ఒకమణుగుపిండి విసరవలయునట. అదిగూడ యొకకష్టమేనా? నేనయినయెడల మణుగున్నరపిండి అవలీలగా విసరియుందును. నాభర్తగారు జైలునకుపోవుటకు సంసిద్ధులేగాని మెత్తనిస్వభావముగలవారగుటచే పోలీసులఎదుటను, మేజస్ట్రేటులఎదుటను నిర్భయముగ మాట్లాడలేరు. నేనేఅయితేనా! ఈజన్మలో మరవనట్లు జవాబిచ్చియుందును" అనియెను. తరువాత విచారణకొరకు తనభర్తతోగూడ ఆమెకోర్టునకువెళ్ళెను. అచట అతనికిఆరుమాసములు కఠినశిక్షవిధింపబడెననువార్త వినగనే మరల నామె తనభర్తతో "ధైర్యముగా జైలునకు పోయిరండు! ఇటువంటిఅవకాశ మెల్లప్పుడునులభించునదిగాదు. మమ్ములనుగురించి ఏమియు బెంగగొనకుడు,

భగవానుడు మీకు ధైర్యమును ప్రసాదించును గాక" అనిరెను. పిమ్మట ఆమె తిరిగి సర్దారుకడకుబోయి, తన భర్తకు జైలునకుబోవు భాగ్యము లభింపజేసినందులకు కృతజ్ఞతావందనములతోపాటు, ఈసందర్భములో తన భర్తకు అతని స్నేహితులు కానుకగానొసగిన తొంబ్బదిరూపాయలనుగూడ సర్దారునకర్పించెను. ఈయువ అనుపమానధీరత్వమే ఆమె భర్తనుగూడ అవహించెననిన అతిశయోక్తిగాదు. ఆరునెలలు పూర్తియైనపిదప అతడు రెట్టింపు ధైర్యోత్సాహములతో తిరిగివచ్చెను.

ఇంకను ఇద్దరు స్త్రీమణులవిషయమును జెప్పి ముగించెదను. వీరు సత్యాగ్రహమున పాల్గొనవప్పటికిని బార్డోలీస్త్రీ లెంత ధీరస్వాంతలో తెలియజేయగల ఉదాహరణమాత్రులైయున్నారు.

బార్డోలీసత్యాగ్రహపు ఆఖరుదినములలో మహాత్ముడు బార్డోలీవచ్చినపుడు రయాముఅను గ్రామము నకుపోయియుండెను. వాడుకప్రకారము బహిరంగసభలు, నూలువడకు ప్రదర్శనమును జరుపబడెను. ఆగ్రామములో దుర్భరరోగపీడితయగు నొక వృద్ధవనిత నివసించుచుండెను. ఆమెయు, తాను జీవించుటకింకన్నిరెయో దినములులేవని తెలిసికొని మహాత్మాజీ నొకపరి దర్శించగోరెను. ఈసంగతి తెలిసినవెంటనే మహాత్ముడామె కుటీరమునకుజనెను. చర్మశల్యావశేషురాలై కాటికికాలుచాచుకొనియున్న ఆముదుసలివదనము మహాత్ముని చూడగనే సంతోషములో వికసించెను. మహాత్మునికొరకై ఆమె అదివరకే నూలుదండనొకదానిని సిద్ధము చేసికొనియుండెను. కాని దానిని మహాత్ముని మెడలో వేయుటెటుల? లేచుటకుగాని, కూర్చొనుటకుగాని అశక్తురాలు. మహాత్మాజీసంగతినిగ్రహించి, ఆమెపరుండిన మంచమువద్దకుపోయి తనతలను వంచెను. అంత నాముదుసలి తన జీర్ణహస్తములచే నాదండను మహాత్ముని మెడనలంకరించి మొగమున కుంకుమతిలకమునుదిద్ది, ఎన్నాళ్లనుండియో సేకరించిన అయిదురూపాయలనోటొకటి యాతని కర్పించి తన్నాశీర్వదించవలసినదని గోరెను. మహాత్ముడు "అమ్మా! మనస్సును శాంతిపరచుకొనుము. ధైర్యమువహించుము" అని సెలవిచ్చెను. మరునాడామె "నాకిక ఎంతయోవ్యవధిలేదు. మనసు మిగుల ప్రశాంతముగానున్నది. కాని నాకడపటి కోరిక ఏదనిన, నేను మరణించినపిదప శుద్ధఖద్దరుతోనే నన్ను కప్పవలెను" అనెను. ఇట్లనిన ఒకటిరెండు గంటలలోనే ఆమె తనదేహమును చాలించెను.

రెండవఆమె, ఆరోగ్యవంతురాలుగనే గన్పడిన యిరువదిఏండ్లబాలిక. ఈమెతండ్రి ప్రప్రథమములో అరెస్టుకాబడిన వంకనేరుపీరులలో నొకడైయుండెను. బార్డోలీసత్యాగ్రహానంతరము సంధిషరతులప్రకారము ఖైదీలనందరను వదలివేయుదురని ప్రకటింపబడెను. ఈవార్తతెలియగనే ఈమె తన తండ్రినెదుర్కొని యింటికి తీసికొనిపోవునిమిత్తము, ఒకరోజుముందుగనే వంకనేరునుంచి బార్డోలీకి కాలినడకనేవచ్చియుండెను. వచ్చినకొంతసేపటికే ఆమెకు జీర్ణకోశములోనొప్పి ప్రారంభమాయెను. ఆనొప్పిదే రానురాను అధికమై సాయంకాలమగుసరికి భరింపనలవికానిబాధగా పరిణమించెను. విపరీతబాధచే నాబాలిక మెలికలు తిరిగిపోవుచుండెను. రాత్రిగూడ ఏమియు తగ్గుసూచనలగుపించలేదు. చివరకు తెల్లవారగట్ల మూడుగంటలకామె "మహాత్ముని నొకపరి యిటకు దోడ్కొనిరండు, నాఅంతిమదర్శనము చేసికొనగోరెదు"ననెను. ఈవార్త తెలియగనే మహాత్ముడచటకేతెంచెను. కాని వారు వచ్చులోపలనే ఆదీనురాలిదృష్టిగూడ అంతరించిపోయెను. అంతమహాత్ముడామెను పలుకరించగనే ఆమె "బాపుజీ! నిన్నుచూచుటకు నోచుకొనకపోతినిగాని, నీకంఠధ్వనినిమాత్రము గుర్తించుచున్నాను. ఎవరయిన యిటకువచ్చి నాచేతులనుజోడింపుడు. మహాత్మునికి నాఅంతిమప్రణామముచేసెద"ననిరెను. తరువాత ఆమెయిట్లే సర్దారునుగూడ జూడగోరెను. కాని వారు వచ్చుటకుపూర్వమే ఆమె ఈలోకమును వీడిపోయెను.

ఆహా! ఏమిభక్తి! ఏమివిశ్వాసము!! కన్నతల్లిదగ్గరలేదు. తండ్రి కారాగారవిముక్తుడై తెల్లవారగనే రాబోవుచున్నాడు. కాని మరణోన్ముఖియైయున్న ఆభక్తురాలితలపులు వారిపైనుండెనా? లేదు. ఆమె మరణించువరకును, మహాత్మునిగురించియు, సర్దారునిగురించియు మాత్రమే ఆలోచించుచుండెను.

ఈపైనవ్రాసిన విషయములనుబట్టి బార్డోలీస్త్రీలందరును స్త్రీలేరీతిగా జీవింపవలెనో ఏరీతిగా మరణించవలెనో రెండుమార్గములను బాగుగా గుర్తెరిగియున్నారని స్పష్టపడుచున్నది. ఇందువలన సర్దారు వీరిపై ఆధారపడినప్పుడు వీరివిశ్వసనుగ్రహించియే అటులచేసియుండెను.

—*From 'The Story of Bardoli.'*

# మల్లమదేవి: దాసి

సామవేదం జానకిరామశర్మగారు

## మల్లమదేవి

"అరిరాజుల్ మనవీరబొబ్బిలిని సాహంకారతన్ముట్టడిం
చిరి. సంగ్రామనిబద్ధమానసమువిచ్ఛిన్నాత్మబాహాబలం
బరిధైర్యాదుల మాత్మసైన్యము హృదిన్యస్తప్రశస్తానురా
గరసావిష్టము యామినీహృతవికాసమ్మయ్యె నిష్పట్టునన్.
ఆపై శాత్రవయూధముల్ రిపునికాయమ్ముల్ పటాపంచలై
కోపార్చిస్సునభ్రమగ్నగా నెటులసాంగోపాంగసంగ్రామవి
ద్యాపాండిత్యము వల్లవేసెదరో వేదంబట్లు కట్టా! నిశా
పాపంబీగతిదాపరించె మనకల్పాయుష్యవహాటంగకున్.

ప్రత్యర్థిరామరాడ్బహుళకోపోద్ధతి మ్లేచ్ఛసైన్యములచేమించినాడు
అదిగాక మనవారలధికప్రమత్తులై రణముపై నెంతోపరాకుపడిరి
ఆచాయగనిపెట్టియర్ధరాతిరివేళ బలముచేబొబ్బిలిబట్టినాడు
అసమాప్తయత్నులు ససహాయశౌరులు సస్థిరచిత్తులునగుచుమిగుల
కలగిప్రభువులు సంగ్రామతన్మాత్రలమున
వెలమపౌరుషదీప్తులవిస్తరింప
జేయఁజాతురు రిపులు నజేయులగుట
నోటమిమెమెక్కుడయ్యె గనుమో లతాంగి!

అపుడేపట్టణద్వారమాక్రమణ మాహా! యెంతలోనింతయా
విపరీతమ్ముఘటిల్లె రావులధనుర్విన్యస్తరాజ్యమ్మునే
డపహాసమ్ములపాలుగావలెనె గూఢార్థాలఁగాలమ్మునా
గపటమ్మెంచుకలేకడెల్పు విధిసంకల్పానుసారంబుగన్.

బలమాయాసము జెందె శత్రువులశుంభత్కోపవహ్నిచ్ఛటా
కలితమ్మై, జయశంక రాజులముఖాకారమ్ములం దెల్పు రా
వులవంశమ్మది శాశ్వతంబయి జగద్వ్యూహమ్ములో నక్షరం
బలఘుత్వమ్ము సుకీర్తిసంపదను సంపాదింపగాఁ జూడుమా.

తరతరమ్ములుగా భవత్సంతతులవారి కాశ్రయమ్మిడి బొబ్బిలాదరించె అనుపూర్విగ మీరలాశ్రయింపగ వింత పోతుటీగయు జొరఁబోదు కోట నావిధియనన్యమాశ్రయించిన ప్రేమకాధారమౌ కోటయంతరింప గలదు సంశయమింకవలదైన నామల్లకోట జేర్పుమనుంగుకుఱ్ఱవాని

భావిరాజన్యుఁడౌనని పట్టరాని
తమకమున నుంటిమది కల్ల తలిరుబోఁడి!
జీవములనిల్పి మావంశజీవధాత్రి
వగుము సోదరి జేరనీవరుగుమమ్మ."

*　　*　　*　　*　　*

అనివచియించి వేగితపయుంతను నేలనువ్రాలి, శోకసం
జనితకవోష్ణబాష్పకణజాలము యేరులువార నేడ్చి య
వ్వనితనుగాంచి, గద్గదికవాకొనసీయకయున్న, శూన్యదృ
క్కున్ బ్రసరించె నాపెయనుకూలవచస్సునుగోరి బేలయై.

*　　*　　*　　*　　*

దాసి

"అమ్మా! మల్లమదేవి! యింతదనుకన్ అన్నంబు,వస్త్రంబు,నీ
సమ్మానార్హముగాగగొంటి నిపు డీసంగ్రామమే తెంచి ని
న్నిమ్మాడ్కిన్ దహియించుచుండగని నేనేలా కృతఘ్నత్వమో
యమ్మా!చూపుదు, జేరుతున్ సుతుని యాయాసమ్ము లేకుండగన్."

*　　*　　*　　*　　*

అపుడు జరిగిన బొబ్బిలియాహవమున
రక్షితుండైన వెలమకుఱ్ఱనిమహాన్వ
యమ్ము పలుశాఖలై భూమియందు నేడు
శాశ్వతమ్మయి కీర్తి విస్తారమయ్యె.

# ఆధునికసతీశిఖామణులు: షానతి

మైదవోలు చంగయ్యపంతులుగారు బి.యె;బి.యల్.

భార్యాభర్తలు విద్య, బుద్ధి, ధనము, ఔన్నత్యము మొదలగు పరిస్థితులయందు ఇంచుమించు సమానస్థితిగలవారైనపుడుగూడ అన్యోన్యప్రవర్తనవలననే సుఖదుఃఖముల యందు ఏకీభావముతో పాల్గొనవలసినవారై యుందురు. తమప్రత్యేకఉద్దేశములను సమయ మెరిగి నెరవేర్చుకొనుట, లేక పరిహరించుకొనుట, తమ దుర్గుణములను వలయురీతిని గ్రహించుకొనుట, తమసుగుణసంపత్తి తమంతటతామే శోభింపచేయకుండుట ఇట్టిఅన్యోన్య ప్రవర్తనకు ముఖ్యమార్గములు. ఇట్టిప్రవర్తనయందు పురుషులకన్న స్త్రీలు ఎక్కువసామర్థ్య నైపుణ్యములుగలవారు కాబట్టియే ప్రపంచమునందు సంసారములు సుఖవంతములై వరిల్లు చున్నవి.

పలుమారు భార్యాభర్తలు పైకనినపరిస్థితులయందును, మరియుస్వభావమునందును, ఔదార్యమునందును, పాండిత్యమునందును, సాంఘికాదర్శములయందును ఎక్కువైన భేద ములతోటి సమావేశమగుదురు. అప్పుడు ఇట్టిభేదములు సమర్థించుకొని భర్త ఎక్కువ వాడైనపుడు అతనికి తోడునీడయయి తక్కువవాడైనపుడు అతనిలోపములను నివర్తించు కొనుమార్గములను సదా వెదకుచు కుటుంబసౌఖ్యము, భర్తయొక్క యశస్సు, ఆరోగ్యము, ఐశ్వర్యములు తనభూషణములుగ భావించు సాధ్వీమణులచరిత్ర అత్యద్భుతము.

ఇట్టి సతీశిఖామణులు పూర్వయుగములయందేగాక ఇప్పుడును గలరు. ఎల్లప్పుడును ఉందురు. అన్ని దేశములయందును కనుగొనవచ్చును. కాని సులభముగ కానరారు. ప్రపం చమునందు ఎక్కువైన యశస్సు సంపాదించిన పురుషునిచరిత్ర గమనించినపుడు అతనిభార్య ఎట్టి సద్గుణములుగలదియనియు, ఔన్నత్యమునకు ఏపాటి యేరీతిలోడ్పడెననియు విచారించి నపుడు ఇట్టినారీమణుల సుస్వభావము, ధైర్యము, నైపుణ్యము, సచ్చరిత్రగూడ తెలిసికొన వచ్చును.

సంగ్రహముగ కొన్ని ఉదాహరణములు సూచించవచ్చును: 1. విక్టోరియామహారాణి, ఈమెభర్త ప్రిన్సుఆల్బర్టు, 2. గాంధిమహాత్ముడు, కస్తూరిబాయిదేవి, 3. బర్నార్డుషా దంప తులు, 4. ఆస్క్విత్తు దంపతులు, 5. డ్యూక్ ఆఫ్ యార్కు దంపతులు, 6. బాల్డ్విన్ దంప తులు, 7. బర్ట్రన్డురసల్ దంపతులు, 8. వెబ్ దంపతులు, 9. బ్రౌనింగుదంపతులు. ఇట్టివారి జీవితములయందు పైనచెప్పబడిన సన్నివేశములు తేటపడగలవు.

బర్నార్డుషాజీవితము తెలియనిదేశముగాని, చదువరిగాని, సాంఘికపారిశుధ్యమందు దృష్టిగలమనుజుడుగాని లేరు. షాదంపతులిద్దరు ఐర్లాండుదేశమువారు. ఆదేశమువారు సామా న్యముగ రాజకీయస్వాతంత్ర్యము నపేక్షించువారు. ఇందు భార్యాభర్తలిరువురును సమా

నాదర్శములుగలవారు. భర్తవలె సాంఘికాదర్శములయందు దీర్ఘదృష్టిగలది భార్య. భర్తతో సమానముగ ఆత్మగౌరవము, ధైర్యముగలది. వివాహకాలమునందు (ముప్పది యేండ్లకుపూర్వము) భర్తకన్న ఎక్కుడుధనవంతురాలు. కాని బుద్ధివికాసమునందును, పరువిడియందును, స్వేచ్ఛయందును, సాంఘికనిర్బంధనిగ్రహణమునందును, వాక్పటిమయందును, కవితాచమత్కృతియందును అసమానప్రతిభ, యశస్సు అప్పటికేపొందియున్నవాడు భర్త.

పాసతి సౌందర్యమును, సౌందర్యదృష్టియు గలది. వేషభాషలయందు మితముగను, యుక్తముగను తనస్వేచ్ఛకు భంగములేకుండనుప్రవర్తించును. తొలుదొలుతనే తనభర్త ఎంత గొప్పవాడైనదిగుర్తెరింగి తనజీవితము అతనిజీవితమును పరిపక్వముచేయుటకై ఉద్దేశింపబడినదని నిశ్చయించుకొని ఇందులకై తనస్వేచ్ఛను, ధనమును, జీవితమును భర్తకు అప్పగించినది.

లండనులోగాని వారిగ్రామవాసమైన "అయట్ సెంటు లారెన్సు"లోగాని ఈదంపతులు నివసించు గృహము పారిశుద్ధ్యమునందును, ప్రశాంతియందును ఋష్యాశ్రమమును బోలియుండును. ప్రపంచస్థితినిగూర్చి సదా పరితపించుచు స్పష్టముగాను, కఠినముగాను సాంఘికదోషములు తానువ్రాయు నాటకములలోను పత్రికలలోను ఖండించుచు ప్రతినిమేషము అల్లలాడుచుండు మనోవ్యాప్తిగల బర్నార్డుషావంటి మనుజుడు నివసించుగృహమువలె కాన్పట్టదు. ఇట్టివిశ్రాంతిగల వాతావరణమును గృహమునందునిర్మించగల భార్యయబ్బుట భర్తయొక్కభాగ్యము.

పాసతి మంచిఉపన్యాసకురాలు. స్త్రీస్వాతంత్ర్యోద్యమమునందు ఎక్కువపాల్గొనుట, ఉపన్యసించుట కలదు. విషయములు చక్కగచర్చించగల సామర్థ్యముగలది. కాని భర్తయొక్క ఉత్కాంతిలో తనకాంతిని ఐక్యముచేయునుగాని ప్రత్యేకించి వ్యాపింపచేసికొనదు.

ఇట్టి సౌశీల్యముగల నారీమణికి తనభర్తమెడ అసామాన్యప్రీతియు, భక్తివిశ్వాసమును, శారీరారోగ్యతత్పరత్వమును గలిగియుండునని చెప్పుట అనవసరము. తనభర్త లోకాతీతుడని, దైవసముడని ఆపతివ్రతభావన. అతని వ్యాయామములు, రచనలు, వచనములు సదా గమనించుచుండును. అతను ఉచ్చరించుమాటలెల్ల ధనమువలెసేకరించుకొనుచుండును. అతని చాటూక్తులనుగూర్చి ఒకచక్కనిగ్రంథము వ్రాసియున్నది. తాను ఇతరగ్రంథములు వ్రాసియున్నదిగాని ఇది తనఉద్గ్రంథమని ఆమెతలంపు. ఇతరులకు ఈగ్రంథమును చూపుట తనభర్తయొక్క గణ్యత చెప్పుకొనుటకొఱకేగాని తన గ్రాంథికకౌశల్యమును తెలుపుకొనుట కొఱకుగాదు.

ఆహారవస్తువులవిషయములో భార్యాభర్తలకు ప్రవర్తనలు భిన్నములు. భర్తయొక్కఆహారము మాంసవర్జితము. భార్య మాంసమునుతినునుగాని ప్రధానముగ భావించుటలేదు. భార్యాభర్తలు అన్యదేశసంచారమునందు అధికమైన ఇష్టముకలవారు. భర్త సౌకర్యముకొఱకు ఆమెసదా అతనితోగూడ ప్రయాణములు సలుపుచుండును.

బర్నార్డుషా కోపస్వభావముగలవాడనియు, కఠినముగ మాటలాడువాడనియు ఒక విధమైన అభిప్రాయము లోకమునందుకలదు. షాసతివంటి స్త్రీ తనభార్యయయి యేవిషయమునందుగాని తనభర్తయెడల ప్రపంచమునకుగల దృష్టి యెంతమాత్రము తప్పకూడదు, తగ్గకూడదని దృఢనిశ్చయముతో సదావేచియుండ బర్నార్డుషాగారి కోపమునకుగాని, కఠినవాక్కునకుగాని ఎట్టియవకాశముకలిగియుండదని ఊహించవచ్చును.

ఇట్టిభార్య లభించియుండనియెడల బర్నార్డుషాగారిజీవిత మెట్లిదెయుండునో యను శంక అప్రస్తుతము. ముప్పదిసంవత్సరములనుంచి కంటినిరెప్పకాచినట్లుకాచుచు,విజ్ఞానముతో గూడిన సహచర్యగలిగి భర్తయొక్క ఉత్కర్షతకు బహువిధముల సహాయభూతమైన షా సతీమణి భర్తయొక్క ఈనాటి యౌన్నత్యసంపాదనయందు పాల్గొనిన పాలు ఇంతయని ఎవరుచెప్పగలరు?

## ప్రేమ వాహిని

ముద్దా విశ్వనాథము గారు

పరాసువాఙ్మయమునుండి 'రిచెపిన్' రచితమగు నొకచిన్న ఇతిహాసము:

ఒకవితంతు మాతకొక్కఁడే కొడుకు.

అతఁడు వొకకులట వలలోఁ దగుల్కొని, తన సర్వస్వము నామె కప్పగించెను. అర్థము, ఆరోగ్యము, ఆత్మగౌరవము అన్నియుఁ దరుణీకామాగ్నిలోఁబడి దగ్ధమయ్యెను.

తనపైని నిజముగ నతనికి ప్రేమయున్నచో నొక దృష్టాంతముచేనది నిరూపింపుమని కులుకులాఁడి కోరినది. తల్లిని చంపి రక్తమోడుచున్న యామెగుండెకాయ తెమ్మని తన వాంఛితము సూచించినది.

ప్రియురాలి యభీప్సితము నెఱవేర్ప నుద్యుక్తుఁడయ్యెను. అంతశ్శత్రువగు కామదేవత తనయునిచేఁ దల్లిని జంపింపఁదలఁచినది. కామాంధుఁడై కొడుకు కావలయుకార్యము కానిచ్చినాఁడు. గుండెకాయ చేతఁబట్టుకొని స్వైరిణి గృహముచేరి గుమ్మమెక్కఁ బోవుచు ఆతొట్రుపాటులో కాలుజాఱి యతఁడు చాఁపకట్టుగాపడినాఁడు. పడునప్పుడు గుండెకాయ చేతినుండిచెదరి యావలఁబడినది.

నేలపైఁబడ్డ మాతృహృదయము "నాయనా! దెబ్బతగిలినదటరా?" అని యతని నోదార్చినట్లయ్యెను. ఆక్షణముననే యపస్మారివలె నతఁడు "అమ్మా!–"యని కెవ్వున నొక్కకేకవైచినాఁడు; మఱిమాటలేదు.

... ... ... ...

పవిత్రవంతమగు ఈపశ్చాత్తాపరవమెంత భావగర్భితమైనదో చెప్పుటకుకలమాడదు. పొట్టలో మాత్రముపు ట్టెడూహాలున్నవి. ఏమిలాభము?

# ఉభయభారతి

భాగవతుల లక్ష్మీపతిశాస్త్రిగారు

దేశమునుగాని కులమునుగాని మతమునుగాని యుద్ధరింపఁజాలినవారలు స్త్రీలే! దేశమునుద్ధరించువారలు ధీమతులగు సరోజినీదేవి మొదలగు నారీరత్నములు; కులమునుద్ధరించెడి సతీమతల్లులు ప్రతియూరనుగలరు. కొన్ని గ్రంథముల నాధారముగఁజేసికొని మతోద్ధారకురాలగు భారతీచరిత్రమును గొంచెముగాఁదెలిపెదను. అందులకామె యేకాలమునందుండెను? ఏమతమునుద్ధరించెను? ఆమతమెట్టిది? అనెడివిషయములనెత్తి కొంత వ్రాసినఁగాని యామెసమాచారము తేటపడదు. ఆమె యాదిశంకరునకు సమకాలీనురాలు. ఆయన క్రీస్తుశకమునకుఁబూర్వము రెండవశతాబ్ది (140) యందున్నవాఁడని కొందఱును, క్రీస్తుశక (788) ఎనిమిదవ శతాబ్దియందున్నవాఁడని మఱికొందఱును జెప్పుచున్నారు; కాని క్రీస్తుశక ఎనిమిదవశతాబ్దియందున్నవాఁడని చెప్పెడివారలు చూపెడిప్రమాణములు క్రీస్తుశకమునకుఁబూర్వమున రెండవశతాబ్దియందున్నవాఁడని చెప్పెడివారలు చూపెడిప్రమాణములను నతిక్రమింపజాలవు. యతీంద్రులలోనెల్లఁ బరమయతీంద్రుఁడును, కవులలోనెల్లఁ గవిగ్రామణియు, విమర్శకులలోనెల్ల విమర్శకరత్నమును, వక్తలలోనెల్ల వక్తృశిఖామణియు, బోధకులలోనెల్ల బోధకాగ్రణియు, మతోద్ధారకులలోనెల్ల మతోద్ధారకశేఖరుఁడునునగు శంకరునికాల మిది యని నిర్ధారింపబడకుండుటయే చిత్రముగానున్నది. ఆయన వ్యాపింపఁజేసిన మత మద్వైతము. ఇది జీవుఁడును, ఈశ్వరుఁడును నొక్కటియేయని బోధించును. అనఁగా నజ్ఞానములోనున్నపుడు జీవుఁడనియు జ్ఞానములో నున్నపు డాజీవుఁడే యీశ్వరుఁడనియుఁ జెప్పఁబడునని యర్థము. అద్వైతమన నేమో ముఖ్యముగా మూఁడుమాటలతో జెప్పవచ్చును. బ్రహ్మ మొక్కటియే సత్యమైనది; జగత్తు మిథ్యయైనది; జీవుఁడు బ్రహ్మమే కాని వేఱొకఁడుకాఁడు. ఈవిషయమును స్థిరపఱుచుటకై యనేకగ్రంథములుపుట్టినవి. ఈశాంకరమత మునే యిప్పుడు సకలదేశములవారును బట్టులుపొగడినట్లు పొగడుచున్నారు.

వేదములందుఁ గర్మకాండమనియు బ్రహ్మకాండమనియు రెండుకాండములుగలవు. కర్మమునుబోధించు భాగమునుబట్టి జైమినిమహర్షి కర్మ (ధర్మ) మీమాంసాశాస్త్రమును, బ్రహ్మమునుబోధించు భాగమునుబట్టి వ్యాసుఁడు బ్రహ్మమీమాంసాశాస్త్రమును రచించిరి. మన యుభయభారతీపతి వ్యాపింపజేసినది మొదటిదగు కర్మకాండమే! గ్రంథములు భారతీభారతీపతులయొక్క జన్మస్థానాదులనుగూర్చి వివరముగాఁదెలుపకున్నను, ఆమె శోణనదీతీరముననున్న ఒకానొకగ్రామవాసియగు విష్ణుమిత్రునిపుత్రికయనియు, నాయన మగధదేశమునకు రాజధానియగు మాహిష్మతీనగరముననున్న హిమమిత్రునిపుత్రుఁడనియు సంగ్రహముగాఁ దెలుపుచున్నవి. శంకరచరిత్రమును దెలిసికొనుట కాధారములైన మఱికొన్నిగ్రంథము లామెయు, నామెభర్తయగు మండనమిశ్రుఁడునుగూడఁ గుమారిలభట్టుకడ సకలవిద్యల నభ్యసించిరనియు, నాకుమారిలభట్టు భారతికి సహోదరుఁడనియుఁ దెలుపుచున్నవి. చిన్ననాఁటినుండియు మిగుల ధీమంతురాలై సంస్కృతప్రాకృతవాఙ్మయములం దసమానమైనపాండిత్యము సంపాదించినదియగుటచే మనభారతిని నుభయభారతియని పిలువసాగిరి. ఆకాలమున విశ్వరూపాచార్యుఁడనునామాంతరముగల మండనమిశ్రునితోడ సాటియగుపండితుఁడుకాని, యుభయభారతితో సాటియగు విదుషీమణికాని లేకుండుటచే మండనుని బ్రహ్మయొక్క యవతారమనియు, భారతిని బ్రహ్మపత్నియగు సరస్వతియొక్క యవతారమనియు నెంచిరి. అట్లుపమించిచెప్పుట పామరజనులకు విశ్వాసమేర్పడుటకై యుండనోపును. దానికుపపత్తిగా నొకకథనుగూడను గల్పించిరి. సకలశాస్త్రము లభివృద్ధిగాంచిన యాకాలముననే యాభార్యాభర్తలతో సాటియగువారలులేకున్న నిప్పుడు కలరనఁగలమా? ఎప్పటికిని మండనపండితుఁడు బ్రహ్మయే! భారతి భారతియే!

శంకరుఁడు బ్రహ్మమీమాంసాదిగ్రంథములకు భాష్యములు రచించినపిదపఁ దన యద్వైతమతమును దేశమునఁదంతటను వ్యాపింపజేయనెంచి కొందఱుశిష్యులతోఁడ బయలుదేఱెను. వేదబాహ్యమతములగు కాపాలికాదిమతముల నెన్నింటినైనను యుక్తిపూర్వకముగా ఖండింపవచ్చును - కాని కర్మవిషయమునకును దాను పూనిన బ్రహ్మవిషయమునకునుగూడ నాధారములు వేదములే. అనఁగా రెండుమతములును వైదికమతములే. కావున మున్ముందుగా జైమినిమహర్షి చే శాస్త్రరూపముగా రచింపఁబడినదియుఁ గర్మఠులగు కుమారిలభట్టు, మండనమిశ్రుఁడు లోనగువారలచే మిగులవ్యాపింపఁజేయఁబడుచున్నదియునగు కర్మకాండమును బూర్వపక్షము కావించినఁగాని తన యద్వైతమతము నిలువదని శంకరునికిఁ దెలియును. అందు మహాప్రఖ్యాతిగడించిన కుమారిలభట్టును జయింపవలయునని ప్రయాగమునకేగెను. అందాతఁడు తుషాగ్నిలోఁబడి ప్రాణములువదల సిద్ధముగానుండుటఁజూచి యాతనితో "ఓకుమారిల! అద్వైతమతమును నీచే స్వీకరింపఁజేసి నాభాష్యమునకు వార్తికమును నీచేఁ జేయింపవచ్చితిని" అనఁ గుమారిలభట్టు శంకరునితో "నేనే కర్మకాండము నెఱిఁగిన పండితులలోఁ గొప్పవాఁడననుకొనుచుంటిని కాఁబోలును; నాకన్నను నెన్నియో రెట్లధికుఁడును, నాకు భగినీభర్తయునగు మండనపండితుఁడు మాహిష్మతీనగరమునందున్నవాఁడు. మీపాండిత్యమువంతయును జూపి యాతనితో వాదింపవచ్చును; అచ్చటికి విచ్చేయుఁడు" అనెను. అంత శంకరుఁడు మాహిష్మతీనగరమునకుఁబోయి కొందఱను మండనపండితునిభవన మెందున్నదియని యడుగఁగా "అమహనీయుని ప్రాసాదము చెంతఁ గొన్ని చిలుకలు వేదములు స్వతఃప్రమాణమా, పరతఃప్రమాణమా యనియు; సుఖదుఃఖములనుగలిగించునది కర్మమా, కలిగించువాఁడు దేవుఁడా యనియు; జగత్తు నిత్యమా, అనిత్యమా అనియు; మండనమిశ్రుని తోఁడ నీడైన పండితుఁ డీలోకమునఁగలఁడా, లేఁడా యనియు; విశ్వపండితునితో వాదింప విశ్వేశ్వరుఁడైన శక్తుఁడౌనా, కాఁడా అనియును; మఱికొన్నిచిలుకలు వేదములు స్వతఃప్రమాణమేకాని పరతఃప్రమాణములుకావనియు, సుఖదుఃఖములఫలమునిచ్చునది కర్మమేకాని దేవుఁడుకాఁడనియు, జగత్తు నిత్యమేకాని యనిత్యముకాదనియు, మండనమిశ్రునితోఁడ నీడైన పండితుఁ డీలోకమున లేఁడనియు, విశ్వపండితునితో వాదింప విశ్వేశ్వరుఁడైనను శక్తుఁడుకాఁడనియును బలుకుచుండును. అదియే యాయన యావాసము" అని చెప్పిరి. అంత శంకరుఁడిట్టి ప్రాసాదామునకుఁబోయి దాసదాసీజనాదులచే సేవింపఁబడుచు మహారాజసదృశుఁడైయున్న భారతీభర్తను గాంచెను. కర్మమనిన శంకరునికిని, బ్రహ్మమనిన మండనమిశ్రునకును గిట్టదుకావున గొంతవాదము విరుద్ధముగా జరిగినపిదప శంకరుఁడు "మండనపండితా! నేను నీతోఁ గర్మమునకంటెను బ్రహ్మమే శ్రేష్ఠతరమైనదని వాదింపవచ్చితిని" అన మండనపండితుఁడు "ఓయతీంద్రా! మనవాదమునకు మాధ్యస్థమువహించువాఁడెవ్వఁడు? సామాన్యుఁడు పనికిరాఁడుకదా!" అన శంకరుఁడు "మండనమిశ్రా! వేఱొకఁడేల? జగద్విఖ్యాతిగన్న విదుషీరత్నమును,సాధ్వీమణియునగు నీదుభార్య భారతియుండలేదో? ఆమెయే మనయిద్దఱియొక్కయు జయాపజయములను నిర్ణయింపఁజాలినది" అన వారిరువురును నామెనే సభాధిపత్యము వహింపుమని కోరిరి. తర్వాత శంకరుఁడు "బ్రహ్మ మొక్కటియేయనియు, చరాచరాత్మకమైన యీప్రపంచమంతయు బ్రహ్మమేయనియు, మార్పులేదనియు, జ్ఞానమయమును దుదలేనిదియునగునది బ్రహ్మమనియు, బ్రహ్మము నెఱిఁగినవాఁడు బ్రహ్మమేయగుననియు, బ్రహ్మభూతునకు మరల జన్మాంతరము లేదనియు, నదియే మోక్షమనియు; సన్న్యాసము ముఖ్యముగా ముముక్షువునకు గ్రహింపఁదగినదనియు, నిందుల కుపనిషత్తులు ప్రమాణమనియు నావాదము. ఓడితినేని శిఖను దెంచుకొని యజ్ఞోపవీతమును ద్రెంచికొని శ్వేతవస్త్రమును దాల్చెదను. అనఁగా గృహమేధినయ్యెదనని యర్థము" అనియెను. అనఁగా మండనుఁడు "ఓశంకరా! జ్ఞానస్వరూపుఁడగు పరమాత్మయందుఁ గార్యముకలుగదు, కనుక కేవలము పరమాత్మను నే తెలిపెడి వేదాంతములు(ఉపనిషత్తులు)ప్రమాణ

ములుకావనియుఁ, బూర్వభాగములైనవేదములు శక్తములగుపదములచే నేర్పడిన వాక్యములచేఁ దెలుపఁబడిన సమస్తవస్తువులందును బ్రమాణములగుచున్నవనియు, ఘటమును దెమ్ము! మొదలైనవాక్యములకుఁ గార్యవిషయమందు శక్తికలదు; కావునఁ గర్మనుపలననే ముక్తి కోరఁదగినదనియు నావాదము. నేనోడితినేని శిఖాయజ్ఞోపవీతములందీసివైచి కాషాయవస్త్రములను గట్టెదను, అనఁగా సన్యసించెదననియర్థము" అని వారిరువురునట్లు తీవ్రముగా శపథములు చేసికొనుటయేకాక సరసవాణిని (భారతి) సాక్షిణిగాఁ జేసికొని పదునాల్గుదినములు వాదించిరి. తుదకు మండనపండితుఁడే యోటువడినట్లు నిరూపింపఁబడెను. మాధవాచార్యుఁడుమాత్రము తన శంకరవిజయమునందు "ఉభయభారతి వారిరువుర మెడలలోను బుష్పమాలలువైచి యోడిపోయినవాని మెడలోనున్నది వాఁడిపోవునని మాత్రము చెప్పిపోయి గృహకృత్యములు చూచుకొనుచుండెననియు మగని మెడలోనున్నది ముందుగా వాఁడుటచే నిద్దఱను భిక్షుకుఁబిలిచినదనియు" వ్రాసెను. అట్లుచెప్పుట కేదేనియొక కల్పితకారణముండియుండవచ్చును. ఆశంకరచరిత్రము నే వ్రాసిన చిద్విలాసాదులు సరసభారతి సభాధిపత్యమువహించి సంపూర్ణముగా వినినట్లే వ్రాసిరి. ఆమె విరాగిణియు, జ్ఞానవతియు, సత్యవతియునగు సాధ్వియేకాకున్న బ్రహ్మమే శ్రేష్ఠతరమైనదని శంకరుఁడు నిర్ణయింపఁగలఁడా? ఏమాత్రమైనను భారతి భర్తయెడను బక్షపాతమును జూపినపక్షమున నాయద్వైతమూనాఁటితో నడుగంటిపోవలసినదేకదా? తానుబూనిన ప్రతినబట్టి శంకరుఁడు గృహస్థుఁడైనపుడు తనమతమును వ్యాప్తినందించువాఁడెవ్వఁడుండును? దీనినిబట్టి యుభయభారతి యద్వైతము నుద్ధరించినదనియేకదా చెప్పవలయును?

మఱియు భర్తయోడినపిదప నామె "శంకరా! భర్తయొక్క యర్ధభాగము భార్యకావున నర్ధభాగము మాత్రమే జయింపఁబడెను; మిగిలిన యర్ధభాగమగు భార్యయును జయింపఁబడినఁగాని సంపూర్ణజయమునందినట్లు చెప్పరాదు" అనెను. శంకరుఁడు "అమ్మా! స్త్రీలతో సన్యాసులు వాదింపవచ్చునా! ధర్మవిరుద్ధము కాదే!" అన నాభారతి "యతీంద్రా! మున్ను గార్గి యాజ్ఞవల్క్యునితో జనకసభయందు వాదింపలేదా! విరుద్ధమేలయగును?" అనెను. అంత నామె శంకరునితో వివిధశాస్త్రములనెత్తి పదునేడుదినములు వాదించిచూచి యాయతి బ్రహ్మచర్యమునుండియే సన్యసించినవాఁడు; కామశాస్త్రానుభవముండదు కావున నందుఁ బ్రశ్నించెదననుకొని "స్త్రీల కేతిథియందు మన్మథకళ యెచ్చటనుండును? ఎచ్చటనుండునపుడేమని పేరుపెట్టఁబడెను?" అనెడి కొన్నిప్రశ్నములనడిగెను. శంకరుఁడు "అమ్మా! నాకొకనెల గడువొసఁగినపక్షమునఁ బ్రశ్నములకన్నిఁటికిని బ్రత్యుత్తరమిత్తును" అని బయలుదేఱి పరకాయప్రవేశవిద్యచేఁ దనశరీరమును నర్మదాతీరముననున్నయొక చెట్టుతొఱ్ఱలోనుంచి శిష్యులను "భద్రముగాఁ గాపాడుచుండుఁడు" అని చెప్పి దేహమును విడిచి యమరకుఁడను రాజుయొక్క మృతకళేబరమునఁ బ్రవేశించి కామకళారహస్యమెల్లను గనుఁగొనెను. అప్పుడే యమరుకశతకము రచింపఁబడినదనియుఁ జెప్పుదురు. అట్లు తెలిసికొని మరలివచ్చి భారతీప్రశ్నములకుఁదగిన యుత్తరముచెప్పఁగా నామె "సర్వజ్ఞుఁడవనిన నీవే" యని మెచ్చుకొని బ్రహ్మలోకమునకేగెనని మాధవశంకరవిజయమునఁగలదు. తక్కినవారలు భారతియు భర్తవలె సన్యాసినియై శృంగగిరికిఁబోయినట్లు చెప్పిరి. ఈమాట కొంతవఱకు విశ్వసింపఁదగినదేయున్నది. పూర్వము బౌద్ధులలో భార్యాభర్తలు సన్యాసినియు సన్యాసియునై విషయేచ్ఛలుమాని పరమార్థచింతతో దేశాటనముచేయుచు మతవ్యాప్తిచేయుచుండెడివారలుకదా? అట్లే కలధనమెల్లను బీదలకుఁబంచియిచ్చి సన్యాసాశ్రమమును స్వీకరించి సురేశ్వరాచార్యనామమును గైకొన్న భర్తతోడనుండి విషయసుఖములనెల్ల విడిచి సదా యాత్మైకచింతనముమాత్రమే చేయుచు శృంగగిరియందే బ్రహ్మీభూతురాలయ్యె ననుకొనవచ్చును.







## సఖీ!

జనమంచి కామేశ్వరరావుగారు

తారలన్నికోసి దండకూర్చెదను,
చంద్రవంకనె తెచ్చి శిఖనిమిడ్చెదను,
ప్రకృతికన్నె చీరలే నీకరణమిచ్చెదను,
అడుగకే సఖి! నన్ని భూమిసిరుల.



## గృహిణి

ఓలేటి సీతారామమూర్తిగారు

దీనగళమెత్తి సంసృతతిమిరవీథి
వెడలుచుండెను పురుషాంధభిక్షువునకు
హృత్కవాటంబు తెరచి దోసిళ్ళతోడఁ
బ్రణయభిక్షిడు కరుణాత్మురాలుగృహిణి.






# దీపావళి

కుర్రా వేంకటసుబ్బారావుచౌదరిగారు

పసపునిగ్గులదేరువసనంబు తనదేహకాంతికి నొకసోయగమునొసంగ
చివురుటాకులబోలు చిన్నిచేదోయికి కార్ముకం బొకవింతకళనొసంగ
కాంతునియుత్సాహకరవాక్యములచే వదనమున కొకశోభ తగనొసంగ
శత్రుసైన్యమువేయు శరపరంపరలకు నిర్భయత్వ మొకింతనీటునొసగ
సమర మొనరించి సురలెల్ల సన్నుతింప
అసురయుసురులుగొన్నట్టి అబల సత్య
విజయలక్ష్మినిచేకొని విభవమైన
మహితదీపావళీ! నీకు మంగళంబు.

చిటపటమనిప్రేలు నీమటపాసులే ప్రబలతూర్యారవప్రతతిగాగ
అతిరయంబునబారు నాకాశజువ్వలే ప్రభురాకదెల్పెడి బంట్లుగాగ
తళతళమను 'ఔట్ల' ధవళాగ్నికణములే జాలువారెడు పూలజల్లుగాగ
శీతకరుపరిహసించు మతాబులే కాగడల్గొను రజకాళిగాగ
దుష్టుడౌనరకాసురు ద్రుంచినట్టి
బాలగోపాలునకు సత్యభామ కెలమి
ధన్యవాదములో స్వాగతంబొసంగ
తరలు దీపావళీ! యెంతధన్యవమ్మ.

భారతదేశసౌభాగ్యంబు హరియింప పరదేశజులు మందుబంపినారు
ధనపూజజూచిపొండని రైతులకును మార్వాళీలు లేఖలవ్రాసినారు
పూలపొట్లములను పువ్వువత్తులగని పల్లెబాలురు దృష్టిబరపినారు
క్రొత్తబట్టలుదెచ్చి యత్తమామలు తమఅల్లురకును కబురంపినారు
మంగళస్నానములుదీర్చి మగువలెల్ల
ప్రమిదెలందున తైలంబు భద్రపరచి
యెదురుజూచుచునున్నారు కదలుమమ్మ
దలప దీపావళీ! యెంతధన్యవమ్మ.

శంకరుఁడును నామెమూలముననే లోకమతము నిల్చినదనియు, నామెయే తనపాలిటి భాగ్యదేవతయగు భారతియనియు బాగుగాఁ దలపోసిపోసి యామెసుకీర్తి శాశ్వతముగానుండుటకై యొకయాలయమును గట్టించి యామె ప్రతిరూపముగా నొకదివ్యవిగ్రహమును బ్రతిష్ఠించి తాను బూజించుటయేకాక శృంగగిరిమఠాధిపతు లగువారల నామములకుఁ జివర భారతీశబ్దముండునట్లును, వారలును విడువక పూజించునట్లును గట్టడచేసెను. అందులకుఁ దార్కాణముగా నిప్పటికిని శారదాలయమునను్న శారదను (భారతిని) బూజించుచుండుటయు, మఠాధిపతులనామాంతమ్మున భారతీశబ్దము గాన్పించుచుండుటయుఁ జూచుకొనవచ్చును.

## జానకీ ప్రశంస

శ్రీ శేషాద్రిరమణకవులు

ఎంతటిదుష్టవేళ జనియించితివో? గద! తల్లి నీకు దు
ర్దాంతదురంతకష్టనికరంబులు దాపురమయ్యె, జీవితం
బంతయు రామచంద్రచరణాంబుజలగ్నమొనర్చి కీర్తి వి
శ్రాంతదిగంతవై సగుణరాశివి నీకెవరీడు? జానకీ!

విబుధలోకారాధ్య విశ్వంభరాదేవి కనుపారఁగానిన్నుఁగన్న తల్లి
సుగుణశోభిత యనసూయామహాదేవి శీలవన్మణి నీకు చెలిమికత్తె
సహజపవిత్రుండు జాతవేదుండు నీపావనత్వంబునకుఁ బాలికాపు
శ్రితజనావనకీర్తి శ్రీరామమూర్తి నీపాణిబట్టినప్రాణవల్లభుండు
నీవు భారతసామ్రాజ్యనిరుపమానపట్టమహిషివి మునివనవాటినొంటి
దిక్కుచెడి త్రిమ్మరితివి నీ దీనచరిత మరయ గుండియలవియుగదమ్మ! సీత!

అసురపురాంతరాళములనత్తతిని నొందినయష్టకష్టముల్
విసువక సైచి, రాముసకు విస్మయమౌగతి నగ్నిజొచ్చి నీ
యసదృశశక్తిచాటి చరితార్థతనొందితివమ్మ! యట్టినీ
కసమవనప్రవాసజనితార్తి తొలంగకపోయె జానకీ!

అతిశయగర్భభారభరితాలసవై రథమెక్కి, జాహ్నవీ
ప్లుతమునివాటికిన్ బురుడుబోసికొనంజను నీయమాయిక
స్థితిఁబరియించినన్ దిగులుజెందు మనం బిటువంటినిన్ను స
ద్వ్రతుఁడగురాముఁడెట్లడవిపాలొనరించెనో? తల్లి! జానకీ!

పదియునునాలుగేండ్లు వనవాసము జేసి, సురారిపీటిలో,
నెదకలఁగంగనత్సరమదెట్టులొ పుచ్చి, కృశానుకీలలం
బొదవి జగత్పవిత్రవయి బొల్చిన నీయెడ రామమూర్తికిఁ
యదయతయంకురించుట పురాఘఫలంబది కాదె మైథిలీ!

# తల్లియే ఆదిమ గురువు

కొడాలి లక్ష్మీనారాయణగారు

శిశువుల నేవంకకుఁ ద్రిప్పఁదలఁచినను దల్లియే కారకురాలు. వారిని పాలముంచినను, నీటముంచినను దల్లియే. శిశువు పెరిగి పెద్దవాఁడై, విద్యావంతుఁడై, సర్వసద్గుణసంపన్నుఁడే యైనను దల్లియే కారకురాలు; లేక దుష్టుఁడై, గొప్పనరహంతకుఁడే యైనను దల్లియే కారకురాలు. స్త్రీ లేమిచేసిన శిశువు లట్లగుదురు. మొక్క పుట్టినపుడు మృద్ఘటమునందలి రంధ్ర మెచటనుండునో నావలఁకనుండియే నది వెలికివచ్చును; అటులనే తల్లి యేమార్గమున నున్నదో శిశువుకూడ నామార్గమునుండియే బయల్పడును. పసిపిల్లలమనస్సులు రేగడి మన్నువంటివి. కుమ్మరిమట్టితో నద్భుతముగాఁ జిత్రాకృతిగల పాత్రలనుజేయుచున్నాఁడు; అటులనే తల్లి పిల్లలమనస్సుల నేవంకకైనఁ ద్రిప్పి యెట్టివానినైనఁ జేయఁగలదు. వేయేల! శిశువుయొక్క భావిజీవితమంతయుఁ దల్లిపైననే యాధారపడియున్న దనుట నిస్సంశయము.

దేశములో మహాత్ములు, విద్వాంసులు, యోధాగ్రేసరులు, వీరాధివీరు లుద్భవిల్లవలెనని నచో స్త్రీయే కారకురాలు. ఆగుణములను, ప్రభావములను, వారివారిదివ్యచరితామృతములను స్త్రీల మనస్సులందు నాటఁజేయుము. వారిదివ్యచిత్తములను బ్రజ్వరిల్లఁజేయుము. పాన్పుపైఁ బరుండునపుడు స్త్రీ యెట్టిరూపముగలవానినిదలంచిపరుండునో—నాఁడు పిండోత్పత్తియైనచో నట్టివాఁడే జన్మించునని మర్మశాస్త్రజ్ఞుల యభిప్రాయమైయున్నది. పడకటింటి గదిలో మహాత్ములపటములనుంచు యుద్దేశ్యమిదియేయైయున్నది.

గర్భములోనుండఁగనే తల్లి శిశువులకుఁ బరమరహస్యముల బోధించుచున్నది. ప్రహ్లాదుఁడు జననిగర్భకుహరమునందేయుండి తల్లికిబోధించు విష్ణుప్రభావమునువిని పరమభక్తాగ్రేసరుండాయెను; అభిమన్యుఁడు దల్లిగర్భముననే యుండివిని పద్మవ్యూహమును భేదించ గలిఁగెను. కంటికికనఁబడకుండ కడుపులోనే యిట్టివిశేషములు జరుగుచున్నవి. వికలాంగులు, మూగలు, చెవిటివారు, సంధులు గల్గుటకుఁ దల్లియేకారకురాలు. శిశువుపుట్టక పూర్వమే గర్భమునందుకూడ దల్లియేగురువుగానున్నది. గర్భధారణకాలమందు స్త్రీ సద్గ్రంథపఠనము చేసినచో నామెకుఁబుట్టుబిడ్డ విద్యావంతుఁడగును. క్రోధపూరితహృదయయైనచో నామెకుఁబుట్టుబిడ్డ క్రోధపూరితుఁడేయగును. ఇంక నిట్టి యుదాహరణము లనేకములుగలవు.

తల్లిపల్కులునాటినట్లుగా శిశువునకు మఱియెవరిపల్కులు నాటఁజాలవు. బాలుఁడైన శివాజీ తల్లియగుజిజాబాయిప్రోత్సాహమువలన మహాభారతరామాయణాదిపవిత్రగ్రంథములలోని వీరాధివీరులచరితామృతసంకీర్తనములచే నొడలుప్పొంగి రణశూరుఁడాయెను. స్త్రీలు శిశువుల నేమిచేయఁదలంచినను జేయఁగలరు. రూసో అను శిశుస్వభావశాస్త్రవేత్త పై యభిప్రాయమునెట్లు వ్యక్తీకరించుచున్నాఁడో చూతుము. అనగా స్త్రీలేమిచేసిన పురుషు లట్లుందురు; అందుచే మహనీయులు పుట్టవలెనని నచో స్త్రీలమనస్సులందు గొప్పతన మన నేమియో, శక్తియననేమియో బోధించుము అని అర్థము. నెపోలియన్ కూడ తల్లియొక్క

పల్కులవలననే జగదేకమహావీరుఁడాయెనని అతనిజీవితచరిత్రకారులు వ్రాసియున్నారు. స్వయముగా తానే శిశువుయొక్క భావికాలపు సత్ప్రవర్తనగాని, దుష్ప్రవర్తనగాని సంపూర్ణముగాఁ దల్లిమీఁదనే ఆధారపడియున్నదని చెప్పియున్నాఁడు. నెపోలియన్‌నుగూర్చి విననివారుండరు; అతఁడు ఫ్రెంచివీరుఁడు. అతనిపేరు విన్నచో 18-వ శతాబ్దములో యూరోపుఖండమంతయు గడగడవణకుచుండెను; కాని యతఁడుమాత్రము తల్లిమాటలనెన్నఁడు జవదాటియెఱుఁగఁడు. ఆమెయన్నచో నతనికి భయము మెండు; గౌరవమధికము; ప్రేమయనంతము. ఆమె తనయవ్యాజమైన యనురాగముచేతను, న్యాయవర్తనముచేతను నతనిని లోఁబరచుకొనఁగలిగెను.

నెపోలియన్ పుట్టినప్పుడు అతనితల్లియుద్ధక్షేత్రమునందేఁ గూర్చుండియుండెను; ఫిరంగులమ్రోఁతలు నలువలఁకులఁజెవులు మారుమ్రోగునట్లు వినఁబడుచుండెను; ప్రసవించునపుడు తల్లి కప్పుకొనిన దుప్పటిపైన యుద్ధవీరులపటములు చిత్రింపఁబడియుండెను. ఇట్టి సమయమున బుట్టిన యాశిశువు ప్రథమముననేవిన్న ధ్వనియేమి? ఫిరంగులమ్రోఁతే! మొట్టమొదటనేఁగన్నులకుఁ గనబడినదేమి? యుద్ధభటుల, యుద్ధక్షేత్రముయొక్క చిత్రపటములు. అందుచే నెపోలియన్ యుద్ధప్రియుఁడాయెను. అతని గొప్పతనమంతయు తల్లి విత్తినదే.

తెలివిగల, ధైర్యముగలవిదుషీమణులైన తల్లుల గర్భములనుండి మహనీయు లుద్భవించుచున్నారు. అనేకు లీయభిప్రాయములనంగీకరించిరి. తండ్రి దుర్మార్గుఁడైనను, మూర్ఖుడైనను, దల్లి మంచిదైనచో నామె తన శీలముచే బిడ్డల సన్మార్గములఁ ద్రిప్పుకొనగల్గును. తల్లిప్రవర్తన చెడ్డదై, తండ్రిప్రవర్తన ఎంతమంచిదైనను పిల్లలకు మంచిబుద్ధులలవడుట దుస్సాధ్యము. విదుషీమణి బిడ్డలకు విద్యగఱపును. గుణవతి గుణవంతులఁజేయును. పుట్టకపూర్వము, పుట్టినప్పటినుండి తల్లియేగురువు. ఈమెగాక ఆదిమగురువు మఱియొకరెట్లగుదురు?

## శరల్లక్ష్మి

కవితావినోద అల్లంశెట్టి అప్పయ్యగారు

విశ్వకల్యాణయోగ్యమై వెలయునట్టి
చారుసౌభాగ్యమయసువేషముధరించి
యిందుముఖమున దరహాసమినుమడింప
నిదె శరల్లక్ష్మి మెల్లననేగుదెంచె.

ప్రకృతిసౌందర్య మద్భుతప్రభ వహించెఁ
దమ్ములన్నియువాతపత్రమ్ములయ్యె
గాయకాళులందందునఁ గ్రమ్మిపాడ
తెల్లదివ్వెలగుచుఁ గ్రాలె జెల్లుపూలు.

కోరగించినసుమములు కొన్నిబూని
ముకుళములుకొన్నిటింబూని సకలయగుచుఁ
బ్రకృతియనురాగవివశబాష్పములుగార్చి
స్వాగతంబిడెఁదరులతా సముదయమున.

రాజచంద్రులజైత్రయాత్రాప్రవృద్ధి
పాటవంబులక్రమత యేర్పడఁదదీయ
సారతరకీర్తిచంద్రికాసముదయంబు
దిగ్దిగంతవిశాలమై తేజరిల్లె.

నవ్యమోహనమధురస్వనంబుతోడ
నంచయొయ్యారి వెలిమబ్బులందుఁబొంచి
నెమ్మివెలఁదినిగికురించి యెమ్మెసూపి
పాక్షికమృదంగవిన్యాసపటిమనెరపె.

## రాటపు పాటలు

శ్రీమతి ఇనగంటి రత్నమ్మగారు

(గతమాసము తరువాయి)

౨౧

జంగమయ్యాగారి చిటిమఠములోను
జమ్మేకుయి సత్లు లింగాధారులకు.

౨౨

అడ్డగెత్తు చెప్పుల్లు ఆనుబిళ్లలు
అన్న! నీవుయేపూరు అంచాదారుడవు?
పాతికెత్తు చెప్పుల్లు పమిడిబిళ్లలు
బావా! నీవుయేవూరు పంచేదారుడవు?

౨౩

మంచిగంధముగదరా అన్న నీవోల్లు
మంచాలగోరింది పంచరాత్రుళ్లు.

౨౪

రాత్రివచ్చినాన్న రాజెవ్వరక్కా!
రత్నకేళ్లిలవారి మేనత్తకొడుకు
మేనత్తకొడుకమ్మ నామేనమరది
మెచ్చిపాలపండ్ల గుత్తులాడిగట్టు.
మేడదిగి మేనత్త కొడుకొచ్చినాడు
మేడచుట్టుగంధమ్ము మేధవులగొల్చు.

౨౫

దూరానపులిజంపి దారులేబోసి
దండిగామేనత్త కొడుకొచ్చినాడు.
పందిట్లోపులిజంపి పగడసాలాడి
భాగ్యముగల మేనత్తకొడుకొచ్చినాడు.
పుట్టచాటపులిజంపి పులిజూదమాడి
పుణ్యముగల మేనత్తకొడుకొచ్చినాడు.
వాకిట్లోపులిజంపి వసంతమాడి
వాసిగల మేనత్తకొడుకొచ్చినాడు.

౨౬

వాడవాడలజోగు వాడల్లజోగు
ఓరుగంటి వెల్లమ్మ వజ్రాలజోగు.

౨౭

వయ్యారిగాడమ్మా వకఅత్తాకొడుకు
వరుగుబిళ్లలమీద వరిగినట్లుండు
వాడుమల్లెపూలు శిగజుట్టుకొని
వాడలకివచ్చేడు పదినెలమరది.

౨౮

ఇంటికాడిల్లాలు ఏమొక్కుతున్నాది
విసరవే చల్లగాలి! కురవవే వాన!

౨౯

చాలుచుక్కల్లోను చంద్రుడున్నాడు
సభలలోన నాచక్క నన్నాయున్నాడు
చుక్కలచంద్రుడవు సూరేడువయ్యా
చూచినవారికి చిన్నిబాలుడవయ్యా.

౩౦

ఆపదకాలాన భూపతిరాజు
అన్నసత్రముబెట్టి మమ్మాదరించు.

౩౧

రాత్రిరాగమ్ము పగలుభోగమ్ము
రామాంజకూటమ్ము నేబుట్టిననగరు.

౩౨

బుధవారమిల్లలికి బూదేరుపరచి
పూలతోటనేబోదు పుట్టింటికొరకు.
ఆదివారమిల్లలికి అరుగేరుపరచి
ఆకుతోటనేబోదుఅత్తింటికొరకు.

—సశేషము.

# పూలసజ్జ

కాళ్ళూరి వేంకటరామారావుగారు

## పదమూడవపుష్పము: కష్టపరంపర

జగ్గయ్యచనిపోయిన ఆయిదారేండ్లలో “లక్ష్మీవిలాసము”నందనేకమార్పులుజరిగినవి. రామన్న కుమారుడు గంగన్న పెద్దవాడైనాడు. రామన్నకు గంగన్నఒక్కడే కుమారుడు. అతడు మర్యాదగల యువకుడే కాని దురదృష్టవశమున అతనికొకగయ్యాళిభార్య దొరికినది. ఆమెపేరు రంగమ్మ.

రంగమ్మ కొంచెము పట్నవాసపుపిల్ల. విలాసవతి. ధనవంతులబిడ్డ. ఆమెమూలమున కుమారునికి విశేష ధనలాభముండునని రామన్నకుమారున కామెను పెండ్లిచేసెను. ప్రపంచమునందు తనపాటి అందకత్తెలేదని ఆమెకొకభ్రమ మొదటినుండియుకలదు. దీనికితోడు ధనకాంక్ష యెక్కువ. ఏదియెట్లున్నను ధనమే ప్రధానముగాని పరువు మర్యాదలతోడ నామెకు నిమిత్తములేదు. ఆమెముఖమునందు సౌందర్యలక్షణములున్న మాట నిజము. కాని గర్వమును, లోభత్వమును ,అహంకారమునుకలిసి ఆముఖమెప్పుడును ధుమధుమలాడుచుండును.

అత్తవారింటికి వచ్చినదిమొదలధికారమంతయు నామెదైపోయెను. రామన్న వృద్ధుడైపోవుటవలన పనిచేయలేకుండెను. కోడలువచ్చినవెంటనే అత్తమామలను వేరుపెట్టినది. వారిభోజనములకుకావలసిన పదార్థముల నామెయే యిచ్చుచుండెను. తనమాటలేనిదే పొలములోపండినకూరలైనను తన అత్తమామల కెవ్వరును పెట్టకూడదని పాలికాపులను రంగమ్మ ఆజ్ఞాపించినది. ఆవృద్ధులను ఎన్నివిధములబాధించవలెనో అన్నియును ఆలోచించి ఏడిపించుచుండెను. తమఆఖరురోజు లీరీతిని తీరనిదుఃఖభాజనములైపోయినందుకు లోలోపలనే వారుకుళ్లిపోవుచుండిరి. రామన్న ఖిన్నుడైపోయి నలుగురిలోను తలయెత్తుకునితిరుగలేకుండెను.

గంగన్నకుమాత్రము సౌఖ్యమెక్కడిది? తలిదండ్రులకంటె రెట్టింపుగ నతడాగయ్యాళిమూలమున బాధపడుచుండెను. అతడు మాట్లాడుటయేతడవుగ రంగమ్మ ఎన్నోతప్పులుపట్టి సాధించుచుండెను. ఇంటిపనులలో నేమాత్రము లోటుచేసినను భర్తఅని చూడకుండ అనరానిమాటలును అతని ననుచుండెను. ఎప్పుడును వితండవాదనలతోడనే ఆమెకు కాలక్షేపముజరుగుచుండెను.

తలిదండ్రులతో కూర్చొని మాట్లాడుచుండగా చూచినయెడల గంగన్నకు తలవాచునట్లుగా చీవాట్లు భార్యవలనతగిలినవన్నమాటే. “నాకన్నుచాటుచేసి ముసలాళ్లకి సొమ్మంతా పెట్టేస్తున్నావు” అని రంగమ్మ కండ్లెఱ్ఱచేయుసరికి సాధుహృదయుడగు గంగన్న గడగడలాడిపోవుచుండెను. సాయంత్రము పనిపూర్తిచేసుకుని ఒక్కసారి జననీజనకులప్రక్కను కూర్చొనవలెనని అతడు అభిలాషపడెడువాడు, కాని అతని కాధైర్యము లేదు. అతని సామర్థ్యము భార్యవద్ద పనికిరాలేదు. కన్నీరుగార్చుకొనుచు ఒకరిప్రక్కనొకరు కూర్చొని యేడ్చుచుండు తలిదండ్రులనుచూచుసరి కతనిగుండె చెరువగుచుండెను. సమయముదొరికినప్పుడు వారిదగ్గరకు పోయి తననిర్భాగ్యవిధికి దుఃఖించి అశ్రువులరాల్చెడివాడు గంగన్న.

“నాయనా! ప్రపంచకంసంగతే అంతనుమా! నీభార్య డబ్బుచూసేసరికి మీఅమ్మ భ్రమసిపోయింది. ఆమెసౌందర్యాన్ని చూసి మోసపోయేవునువ్వు. మీయిద్దరికీ లొంగిపోయినాను నేను. జగ్గయ్య అప్పుడుచెప్పిన మాటలువింటే మనకీపాట్లురాకపోవును. జగ్గయ్యవంటిజ్ఞానిని నేనుచూడలేదురా బాబూ! ఈసంబంధంచెయ్యొద్దని చెవిని యిల్లుకట్టుకుని పోరేడుకదా జగ్గయ్య. అతనిమాట లిప్పటికీ నాచెవుల్లో ప్రతిధ్వనిస్తూనే వున్నాయి.

"సొమ్ముసొమ్మంటే లాభంలేదమ్మా! కోడలువల్ల సొమ్మువస్తుందని పొంగిపోతున్నారుకాని మీరు అంధులైపోయి సర్వేశ్వరుణ్ని మరచిపోతారన్నసంగతి మానుకోకుండావున్నారు. మీకు డబ్బాశయెందుకు? మీకు కావలసినంతకంటె అధికంగానే భగవంతుడు దయచేశాడు. కాస్త నిదానించి మరీచేసుకోండి. అని జగ్గయ్య మీఅమ్మతో ఎన్నోసార్లు చెప్పేడుకాని మనకామాటలు చెవిదూరలేదు. ఆహా! అమూల్యస్నేహితుడు లేకపోవడం యెంతలోటుగావుంది. అయ్యో! జగ్గయ్యా! కష్టకాలంలో నన్ను యిల్లావొదిలిపెట్టిపోయావా?" అనిపల్కుచు రామన్న అశ్రువులరాల్చెను.

పైవిధమున నానిర్భాగ్యులుముగ్గురును తరచు సంభాషించుకొనుచుండిరి.

వారిగతియే యిట్లుండునపుడు కాంతంమాట అడుగవలెనా? ఆమె నిజముగా భూలోకనరక మనుభవించుచుండెనని చెప్పవచ్చును. జగ్గయ్య పూర్వము నివసించుచుండినయింటియందు ప్రస్తుతము రామన్న కాపురముండెను. అందుచే కాంతమ్మ కొకమారుమూలవసారాగదిని రంగమ్మయిచ్చినది. తరుచు వృద్ధులసమీపమున నుండి వారిసౌఖ్యములు గనిపెట్టుచుండినందువలన కాంతమ్మగూడ రంగమ్మ ఆగ్రహమునకు గురియయ్యెను.

కనబడినప్పుడెల్లను కాంతమ్మకుతిట్లు తప్పకుండెను. ఏపనిని ఎంతసొగసుగాచేసినను అందులో రంగమ్మకి తప్పులు కనబడుచునేయుండును. ఉదయముమొదలు సాయంకాలముపరకును కాంతం కష్టపడి పనిచేసినను రంగమ్మ కామె యేపనియును చేయలేదన్నమాటే. "పోతులాగుతింటావుకాని పనిముట్టుకోవు. మాకెక్కడదాపరించినావే దిక్కుమాలినదానా!" ఇవియే ఆనిర్భాగ్యురాలికి బహూకరింపులు.

తనయెడల రంగమ్మకి అసహ్యముకలిగినదని ఆదిక్కుమాలినపక్షి గ్రహించినది. రామన్న ఆమెను ఓదార్పుస్థితిలోలేడు. అతనిబాధలే అతనిని ముంచివేయుచున్నియుండెను. కాంతం యెక్కడికైనను పోవలెనని యనుకొనెను. కాని యెక్కడికిపోవుటయో ఆమెకే తెలియకుండెను. ఇట్టిస్థితియందు లింగరాజు నామె సలహాయడిగినది.

"అమ్మా! నువ్వు యిక్కడవుండడం అసందర్భమేనని ఒప్పుకుంటాను. కాని యీతక్షణం యిక్కడనుండివెళ్లడం నాఅభిప్రాయంకాదు. గౌరవనీయమైనపనిని చెయ్యడానికే నువ్వు అర్హురాలవుకాని నిత్యమూ పాలంపనిలోతిరగడానికి నీకు శక్తిచాలదు. కాని కొంత ఓర్చుకునివుండాలి. ఆమహాత్ముని నమ్మి ప్రార్థించుకుంటూవుండు. ఈపరీక్షలను నెమ్మదిగా భరించు"అని లింగరాజు బోధించినాడు.

ఈఆపదలమధ్య నామెకు మనశ్శాంతిగలిగించుస్థలమొక్కటిమాత్రముకలదు. తండ్రిసమాధిదగ్గరకుపోయి కూర్చొనగానే ఆమె తనదుఃఖములను మరచిపోవుచుండెను. జనకునిసన్నిధియన్నట్లే ఆమెకు తోచుచుండెను. అతనియమూల్యబోధనలను తలపునకుతెచ్చుకొనుచు నామె తరుచు సమాధిచెంతనే కాలముగడుపుచుండెడిది.

## పదునాలుగవపుష్పము: అంత్యపరీక్ష

జగ్గయ్యగతించి ఆరేండ్లుగడిచిపోయినవి. ఆనా డతనిసప్తమవర్ధంతిదినము. రోజూకంటె కాంతమ్మకానాడు దుఃఖము తలమునకలైపోయినది. ప్రభాతభానుని అరుణకాంతు లామెగదిలోనికి ప్రవేశించుచుండెను. నిత్యానందప్రదమగు సూర్యోదయము నాడామెకు సంతోషదాయకముగ గన్పట్టలేదు. నిరుత్సాహముతో కాంతమ్మలేచి జనకునిసమాధిని అలంకరించుటకు పూనుకున్నది.

తనదురవస్థకంతకును కారణమైన పూలసజ్జ ఆమెకెదురుగ కిటికీలో కనబడుచుండెను. ఆసజ్జనిండను రంగురంగులపువ్వులనుయేరి కాంతమ్మ పెట్టినది. తిన్నగా సమాధివద్దకుపోయి ఆసజ్జను దానిమీదవుంచినది. ఆమెయశ్రువు లాపుష్పములపైబడి హిమబిందువులవలె మెరయుచుండెను.

"బాబూ! బాబూ! ఈపువ్వులమాలాన్నే నీవు నాకు జ్ఞానముబోధించేవాడివి. అందుకు కృతజ్ఞురాలనై నీసమాధిని అలంకరిస్తున్నాను. ఎలాంటికష్టాల్లోనైనా నీచేతుల్లోవున్నప్పుడు నేను నిర్విచారంగా ఉండేదాన్ని. ఇప్పుడో? నీకుమార్తె దిక్కుమాలిపోయి నీసమాధిముందరే నేలకీకంటికీ యేకధారగా ఏడుస్తూంది. నన్నోదార్చేవారులేరు. బాబూ! కాలులో రవంతముల్లుగుచ్చుకుంటే నాకోసమని హడలిపోయేవాడివికదా! నాబాధలుచూసి నీఆత్మ ఎంతదుఃఖిస్తూందో యేంతెలుస్తుంది? నేనూకొద్దిరోజుల్లో నీదగ్గిరకే వస్తున్నానులే. అబ్బా! ఈబాధ నేను భరించలేను."

కాంతమ్మ తండ్రినితలుచుకుని చాలసేపు ఏడ్చినది. దారిపోవువారామె పితృభక్తినిగాంచి సంతోషాశ్రువులు రాల్చిరి.

ఆమరునాడు "లక్ష్మీవిలాసము" లోనివారందరును యథాప్రకారము పొలముపనికిపోయిరి. ఆసమయమున రంగమ్మ తనపట్టుచీరను దొడ్లోయెండవేసినది. మరికొంతసేపటికా చీర హఠాత్తుగా కనబడకుండపోయినది. బాగుగా సాయంకాలమైపోయినతరువాతగాని చీరపోయినసంగతి రంగమ్మ కనిపెట్టలేదు. తక్షణమే కాంతమ్మపైని అనుమానపడి ఆమెనుదూషించుటకు మొదలిడినది.

నిర్మలమానసుడగు జగ్గయ్య ధర్మవరదుర్గమునజరిగిన ఉంగరపువృత్తాంతమంతయు రామన్నతో దాచకుండ చెప్పివేసెను. అతడు రామన్నతో చెప్పుచుండగా గంగన్న అక్కడేయుండి దానినంతయువిన్నాడు. అతడూరుకొనక యీసంగతిని భార్యతో చెప్పినాడు. అందుచేత రంగమ్మకు విధిగా కాంతమ్మపైనే అనుమానము కలిగినది.

సాయంకాలము మామూలుగా పనివాండ్రందరితోడను కాంతమ్మ యింటికివచ్చినది. వెంటనే రంగమ్మ లోపలినుండివచ్చి కాంతమ్మనుఅడ్డమైన తిట్లునుతిట్టి "తక్షణం చీరతీసుకురా. ఏం? అల్లాచూస్తావేం? లేకపోతే నీపనిపట్టేస్తాను. చూడు" అని కసిరికొట్టినది.

"అమ్మా! నేను రోజంతా పొలంలోనేవుండి భోజనానికైనా యింటికిరాలేదు. అలాంటప్పుడు నేను చీరతీశాననడంకంటె అన్యాయం మరొకటిలేదు. ఏదారిపోయేవాడైనా నిముషంలో దాన్ని దొంగిలించివుండొచ్చు" అని కాంతం చెప్పినది. కాని రంగమ్మ కోపోద్రేకమున శరీరమును మరచిపోయియుండెను. "ఛీ! దొంగపీనుగా! నీసంగతి తెలియదనుకున్నావుకాబోలు! ఉంగరంభోగట్టా యావత్తును మాకు తెలుసును. వాళ్లుతగిలేస్తే యిక్కడికిచేరేవు. నీలాంటివాళ్లింట్లోవుండడం ప్రమాదంకూడాను. పో. తక్షణమే మాయింట్లోనించిపో" అని ఖండితముగా చెప్పివేసినది.

"పాపం రోజల్లా మనతోపాటు ఎండలోపనిచేసి యీసాయంకాలం యెక్కడికిపోతుంది? ఈరాత్రికిక్కడ భోంచెయ్యనీ. అలిసిపోయివుంది పాపం! అంతగా నువ్వు పట్టుపడితే పొద్దుటే వెళ్లిపోతుందిలే" అని గంగన్న చాలాదూరము చెప్పెను.

"ఒక్కగంటైనా యిక్కడవుండడానికి వీల్లేదు. నీకవసరంలేనిపనుల్లోకి నువ్వురాకు. ఊరుకో" అని రంగమ్మ భర్తపై కోపపడినది.

మాటలాడినకొలదియు నామె దుర్మార్గము వృద్ధిపొందుటతప్ప లాభములేదని గంగన్న మారుమాట్లాడలేదు. కాంతమ్మ వేరుజవాబుచెప్పకుండ తనవస్తువులనన్నిటిని మూటగట్టుకుని బయలుదేరినది. లక్ష్మీవిలాసములోనివారందరికిని తన కృతజ్ఞతను తెలియచేసినది.

జరిగినసంగతినివిని వృద్ధులు మిగుల విచారించిరి. ఇద్దరును ఆమెనెంతోసేపు ఓదార్చిరి. తనపెట్టెలోవున్న రెండురూపాయలనుతీసి ఉదారస్వభావుడగు రామన్న ఆమెకు ఖర్చులకని యిచ్చివేసెను. "అమ్మా!

వెళ్లు. భగవంతుడు నిన్ను సర్వదా రక్షించుగాక! మీబాబుఆశీర్వచనం అమోఘము. కొద్దిరోజుల్లోనే నీఆపదలుపోయి సౌఖ్యపడగలవు. ఈనీకష్టంచూడకుండా మమ్మలినికూడా జగ్గయ్యతోపాటు భగవంతుడు తీసుకళ్లేడుకాదు" అని రామన్న ఏడ్చెను.

పడమట నింకను రెండుగడియలప్రొద్దుమాత్రముండెను. జీవకోటులన్నియును పనులనుముగించుకొని గృహోన్ముఖములగుచుండెను. భయంకరమగుకారుచీకటులు క్రమ్ముకున్నప్పుడు తలదాచుకొనుటకు చరాచరజంతుజాలములన్నియు స్థావులను జూచుకొనుచుండెను. కాని అభాగినియగు కాంతమ్మకుమాత్రము నీడలేదు.

బట్టలమూటపట్టుకొని ఆమె బయలుదేరినది. ఒక్కసారి జనకునిసమాధిని చూడవలయునని యామెకు బుద్ధిపుట్టెను. మెల్ల మెల్లగ కాళ్లీడ్చుకొనుచు నామె స్మశానవాటికను చేరుకొనెను. అప్పటికప్పుడే సూర్యాస్తమయమైపోయినను చీకటులు వ్యాప్తినందలేదు. స్మశానభూమియందా బాలికకు భయముకలుగలేదు. అక్కడి సమాధులన్నియు పిశాచరూపములధరించి ఆగాఢనిశ్శబ్దమందు జ్ఞానహీనులగు మానవులనుచూచి వికటాట్టహాసమొనర్చుచున్నట్లుగనుండెను. కాంతం తండ్రిసమాధిచేరినది. ఆపరాకుండ నామె కన్నీరుస్రవించుచుండెను.

సమాధిప్రక్కనేకూర్చొని కాంతం "బాబూ! ఈనాకష్టాలుచూడకుండా దైవం నిన్ను తీసుకుపోయాడు. ప్రపంచకంలోని విపత్తులకతీతుడవై మహాసౌఖ్యంలోవున్నావిప్పుడు. నేనిప్పుడెక్కడికిపోగలను? ధర్మవరదుర్గమునుండి తరిమివేసినప్పుడు నువ్వు నాపక్కనేవుండి కంటికిరెప్పలాగు చూసుకున్నావు నన్ను! ఇప్పుడెవ్వరున్నారు? దిక్కుమాలినదాననై, అపవాదభారముచేత కుంగిపోయి కటికదరిద్రంలో యీమోస్తరుగా తిరుగాడుతున్నాను. ఏదియెల్లాగున్నా రోజూ నీసమాధిప్రక్కనికూచుని నామనోవ్యథ వెల్లడించుకుంటే కాస్తమనశ్శాంతికుదిరేది. ఇప్పుడు దీనికికూడా నేను పెట్టిపుట్టలేదు" అని యేడ్చినది.

సంజెచీకటులు వతిక్రమించి మేఘములతెరలనుదాటుకుని త్రయోదశీచంద్రకాంతి స్వచ్ఛమై ప్రపంచకముపై ప్రసరించుచుండెను. కాంతం నలుప్రక్కలను కలయచూచినది. అంతటను గాఢనిశ్శబ్దము. "ఇప్పుడు నేనెక్కడికిపోగలను? ఇంతరాత్రివేళ ఎవరింటికివెళ్లడానికీ నామనస్సు ఒప్పుకోవడంలేదు. నేను ఇల్లారావడానికి కారణంచెప్పినతరవాత నన్ను ఎవరుచేరదీసి ఆదరిస్తారు? ఇదుగో! ఈపక్కనేకూచుని మాబాబు సమాధిపక్కనే యీరాత్రిగడిపేస్తాను. బహుశా యీపవిత్రస్థలాన్ని సందర్శించేభాగ్యం నాకు యింక కలగదు కాబోలు! ఉదయాన్నేలేచి దైవంమీదభారంవేసి విశాలప్రపంచకంలో దైవనిర్ణీతమగుస్థలాన్ని అన్వేషించుకుంటూపోతాను" అని ఆమె నిశ్చయించుకున్నది.

కుష్కించిపోయి రక్తహీనతచేపాలిపోయినబక్కశరీరమును గోడకుచేరవేసుకుని మూట తలక్రిందపెట్టుకుని స్మశానభూమిలోనే, తండ్రి సమాధిప్రక్కనే కాంతమ్మ విశ్రమించినది. ఆమె పైటకొంగంతయును అశ్రుధారలచే తడిసిపోయినది. హృదయమాందోళనాభరితమైయుండెను. నిశ్చలభక్తిపూరితురాలై ఆమందభాగ్యురాలు సర్వేశ్వరుని ప్రార్థించినది. భక్త్యుద్రేకమున ఆమె మైమరచిపోయియుండెను. ఆస్థితిని వర్ణించుటకు భాషకు శక్తిచాలదు.

ఒక్కనిముషమట్లు పడుకుని హఠాత్తుగా లేచికూర్చుని ఆవేశముతో చేతులుజోడించుకుని "తండ్రీ! దీనజనశరణ్యా! నామొరవినవేమి? రావేమి? తండ్రీ! నాకు దారిచూపించవా?" అని ఉన్మాదినివోలె కంఠమెత్తి శూన్యవాతావరణమును ప్రశ్నించినది. భగవంతుడు తనయెదుటనిలుచున్నట్లే ఆమె భావించుకొనెను. హృదయవిదారణమగు నామె యాక్రందనధ్వని ఆగంభీరనిశ్శబ్దమును చీల్చుకుని కంచుగంటలమ్రోతవలె స్మశానమం దెల్లెడలను ప్రతిధ్వనించెను. వేటగానిచేతులలోచిక్కి జీవితాశలేక ఆక్రోశించు చిలకఅరుపువలెనుండెను ఆమెకేక.

—కొదువ.



సినీమానటి ఎర్మలైను కన్య




## జుబైదా కన్య

నిడదవోలు వేంకటలక్ష్మణరావుగారు

జుబైదాకన్య మహమ్మదీయమతస్థురాలు. ఈమె బీగం విక్టోరియా ఫాత్మాయనునామెకు, నవాబు ఆఫ్ సచీనుగారివలన జననమొందెను. ఈమె 1911-వ సంవత్సరము జూలై నెల 8-వ తేది, ఉదయం 7 గంటలకి జననమొందెను. ఈమెతల్లియైన ఫాత్మాగారు ఫిల్ముడైరక్టరలలో నొకతె. జుబైదా తనకు 6-వ యేడు రాగానే బొంబాయినందుగల నాట్యపాఠశాల (Dancing Training School)లో ప్రవేశించి యచ్చట నాట్యముచేయుటయం దారితేరినది. కొంతకాలమునకీమె "కోహినూరుఫిల్ముకో"లో చేరినది. అప్పటి యీమె వయస్సు 12-సంవత్సరములు. అందు ప్రథమమున నాట్యకర్త్రి (Dancer) గానుండి, పిదప "గులోబకావళీ" యను ఫిల్ముచరిత్రలో ఖలీలను మహమ్మదీయనటకునితో కలసి నటించెను. ఇదియే యీమెయొక్క ప్రథమ ప్రదర్శనపటము. పైకంపెనీలో 8 ఫిల్ములలో నటించెను.

పిమ్మట "రాయల్ ఆర్టు స్టూడియో"లో చేరి యచ్చటొక సంవత్సరము గడిపెను. తర్వాత "సరస్వతీ ఫిల్ముకో"లో చేరి, యందు "బుల్ బుల్-యి-పరిస్థాన్" "సర్దర్బా"యను రెండుదివ్యమైన చారిత్రకఫిల్ములలో నటించెను. ఈమె తన 15-వ యేట "విక్టోరియా ఫాత్మాఫిల్ముకో"లో చేరి యందు "హీర-రంజ" "మిలాదినా" "పాయిచోరు" "కనకతార" యను సుప్రసిద్ధపటచరిత్రలో నటించెను. ఈసమయమునందే "జగతాప్," "యంగిండియా" యను ఫిల్ముకంపెనీలలో వారివారి యనుమతిప్రకారము వారల ఫిల్ముగాథలలో నటించెను. అందు ముఖ్యముగా యంగిండియాఫిల్ముకో వారి దివ్యప్రదర్శనపటమగు "యంగిండియా" లేక (స్వదేశసేవ) యనుచరిత్రలో తనయొక్క నటనాకౌశల్యమంతయు వినియోగించినది. అద్భుతమైన యభినయనములు-వీరపురుషోచితమగు ముఖచిహ్నములు-గలిగి నటించిన మేటిఫిల్ము "యంగిండియా."

ఈమె తన 18-వ యేట "లక్ష్మిపిక్చర్సుసొసైటీ" యను కంపెనీలో చేరి "కాలా-చోరు" "దేవదాసి" "నీరా" "నోబిల్ స్కామ్పు" యను ఫిల్ముగాథలలో నటించెను. పిదప "ఓరియంటల్ పిక్చరు కార్పొరేషను" యను కంపెనీలో ప్రవేశించి, నవాబు గాంధిగారి యాజమాన్యముక్రింద తయారుకాబడిన "దేవతామూర్తి" "టోల్సు ఆఫ్ డెస్టినీ" యను ఫిల్ముగాథలలో నటించి, హెచ్చుగౌరవముపొందెను. సినీమాభినయనములం దారితేరినది. పిమ్మట "రంజిత్తుఫిల్ముకో"లో చేరి యందు "ప్రేమదేవత" యను ఫిల్ముచరిత్రలో నాయికాపాత్ర ధరించెను.

హిందూదేశములోకూడ పైదేశమువారివలెనే మాట్లాడేఫిల్ములను (Talkies) తీయుటకు నిశ్చయించుకొన్నవారిలో నొకరగు "ఆర్దిషీలు. ఎమ్. ఇరానీ"గారు, తను తీయబోయెడి మాట్లాడేఫిల్ముకుగాను చిన్నపోటీపరీక్ష జరిపించిరి. అందు ఈమెయే ప్రథమబహుమతి గాంచెను. ఆకారణమున యీమెను "ఇరానీ"

గారు తమకంపెనీయగు "ఇంపీరియల్ ఫిల్ము కోవారియావీటోను"లో తయారుకాబడుచున్న "ఆలం-ఆరా" యను మాట్లాడే ఫిల్ముచరిత్రలో, ప్రధాననాయికపాత్ర నభినయింపజేసిరి. ఈమె యింకను మరికొన్ని మాట్లాడే ఫిల్ముచరిత్రలలో నటించుటకు నిశ్చయించినది.

ముద్దులొలుకు ముద్దుమోము-వెడదయగు కెమ్మోవులు-వర్తులమగు వక్షస్థలము-నిడుదయగు కేశపాశములు-తీరైన యవయవములు-దీర్ఘమైన నాసికయు-విశాలమగు నేత్రద్వయము-చిత్రవర్ణముగల శరీరపుకాంతిగలిగి యున్నులమిన్నయని పేర్గాంచియున్నది. ఈమె కంఠమాధుర్యముముందర కోకిలకంఠమాధుర్యం ఎంత మాత్రము డీకొనజాలదు. ఈమె నాట్యమునల్పుచో ఆకాశమందు స్వేచ్ఛానుసారిగా తిరుగాడుచుండు పక్షివోలె నాట్యమునల్పును. శృంగారవిషాదరసములయొక్క బాగోగులు చూపించుటలో అతిమిన్న.

ఈమెతో ముఖ్యముగా జానీబాబు, మదనురావు వకీలు, మాస్టరు విఠల్, ఖలీల్ అహమ్మదు, యిబాందారు, రాజాశాండో, తొల్పాడి మొదలగు సుప్రసిద్ధ సినీమానటికాగ్రేసరులుకలసి నటింతురు. మొత్తముమీద ఈమె నటించినఫిల్ములలో 4 సాంఘికఫిల్ముగాథలు(Social Pictures),10చారిత్రకఫిల్ముగాథలు (Historical), 5మహమ్మదీయ ఫిల్ముగాథలు(Mahammadan Pictures),2ఓరియంటల్ ఫిల్ముగాథలు, 4పురాణ ఫిల్ముగాథలు (Mythological Pictures) అయియున్నవి. మాట్లాడేఫిల్ము చరిత్రలలో నటించుటచే ఈమెకు వెయ్యిరూపాయిలు జీతము నెలకిచ్చుచున్నారు.

ఈమె యప్పుడప్పుడు నాట్యమునల్పుచుండును. ఈమెకు ఇంకను నిద్దరు చెల్లెండ్రుగలరు. వారు కూడా ఈమెనడిచినత్రోవనే నడుచుచున్నారు. ప్రస్తుత మీమెవయస్సు 21 సంవత్సరములు. అల్లా యీమెను రక్షించుగాత!

## స్త్రీ సృష్టి

ఆకుండి వేంకటశాస్త్రి గారు

ఈప్రపంచసృష్టి ప్రకృతిపురుషాత్మకమైయున్నది. సృష్టికాలమున త్వష్ట (విశ్వకర్మ) స్త్రీని ప్రకృతిరూపమున సృష్టింతమనుకొని వస్తుసమ్మేళనమునకై వస్తుసముదాయమును పరికించి చూచుకొనగా పురుషుని సృష్టిచేయుటకే వస్తుసంచయమెల్ల నిశ్శేషముగ వినియోగింపఁబడుటచే నేమిచేయుటకును దోచక యోచనామగ్నమానసుడై చివరకు స్త్రీసృష్టికి ఈక్రింద పేర్కొనబడినవానినిగైకొని వినూత్నసృష్టిని తనవిదగ్ధత మెఱయఁజేసెను.

చంద్రుని గుండ్రదనమును, ప్రాకుడుతీగలలోని వక్రతను, ప్రాకుడుతీగలు పైకెగబ్రాకుచు తమకు దొరకిన ఆధారమును, చుట్టుకొనుతీగల ప్రేలాడుస్వభావమును, గడ్డిపోచల అదరు, లేత వెదురులోని సన్నమును, పుష్పములోని లావణ్యమృదుత్వములను, పత్రముల లోని తేలికను, ఏనుగుతొండములోని స్థూలసూక్ష్మతలను, ఏణముల వీక్షణములలోని చంచలతను, తుమ్మెదల బారునందలి నైల్యమును, సూర్యకిరణములలోని ఆనందజ్వలనాదులను, వర్షించుమేఘములలోని గాంభీర్యశోకభావమును, పవనములందలి చంచలతను, కుందేలునకు గల పిరికితనమును, నెమిలికిగల ఆడంబరమును, చిలుకలహృదయములందలి మార్దవమును, శిలలయందలి కాఠిన్యమును, మధువునందలి మాధుర్యమును, వ్యాఘ్రమునకుగల క్రూరత్వమును, శీతమునుపోగొట్టెడుఅగ్నిలోని వెట్టను, మంచునందలి తీవ్రశీతలతను, 'జో' అను వాయసపుజాతిలోజేరిన పక్షి (తన వన్నెలుగల యీకలచే అందకత్తెనని గర్వించు పక్షి)

యాడంబరమును, కోకిలలకుహూరవముల శ్రవణమనోజ్ఞతను, కొంగయందలి కాపట్యమును, చాతకదంపతులలోగల భార్యాభర్తృవిశ్వాసమును అను నీయన్యోన్యవిరుద్ధప్రకృతులను, గుణవిశేషములను వైద్యుఁడు మందులలోవివిధపదార్థముల సమ్మేళనమొనర్చునటుల, చోద్యముగ మహాసమ్మేళనముఁజేసి స్త్రీవ్యక్తిస్సృష్టినిగావించి తానితఃపూర్వముస్సృష్టించిన ప్రథమ పురుషవ్యక్తికి యేవంవిధగుణవిశిష్టయగు స్త్రీని తీసికొనుమని యిచ్చెనట.

ఆపురుషుఁడాస్త్రీని గొనిపోయి యొకవారదినములు గడువ త్వష్టకడకు ఆమెను గొనివచ్చి ఇట్లనిపలికెను. ప్రభో! మీరు సృజించి నాకిచ్చిన ఈస్త్రీ నా జీవితమును దుఃఖభాజనముగ జేయుచున్నది. ఈమె నిరంతరము మాట్లాడుచున్నది. నాకుభరింప శక్యముగాదని నాకు తోపింపఁజేయునంత బాధను నిరంతరము గల్గించుచున్నది. ఆమెను గూర్చి నేనెల్లపుడు పూర్ణమగుశ్రద్ధతో కనిపెట్టుకొనియుండవలసినవాడ నగుచున్నాను. నాకాలమంతయు నామెకై వినియోగింపఁబడుచున్నది. ఆమె యెందులకో యేడ్చును. ఎల్లప్పుడు సోమరితనమున కాలము వెళ్లబు[illegible]ను. ఈమెతో నేను కాపురముచేయలేకున్నందున ఈమెను మీకిచ్చివేయ గొనివచ్చినా[illegible]. అందులకు త్వష్ట "సరే! ఆమెను నాకడ దిగవిడచిపొమ్ము"అని పురుషునితోననుచు [illegible]మెను గైకొనెను.

ఒకవారముదినములు గడచిన యనంతరము పురుషుఁడు మరల త్వష్టకడకువచ్చి "స్వామీ! మీరు నాకనుగ్రహించిన స్త్రీని మీకిచ్చివేసి నేనేకాకినై విజ్ఞానజీవితము గడుపవలసి వచ్చుటచే దుర్భరమైనది. ఆమె నావద్దనున్నప్పుడామె విలాసపునకలచేతను, నాకు శ్రవణపేయముగ పాటలు పాడుటచేతను, విస్ఫారితనేత్రాంచలములఁజూచిన చూపులచేతను, నాతోచేసిన వినోదసల్లాపములచేతను నన్నానందింపఁజేసిన దినములు జ్ఞప్తికివచ్చుచున్నవి. మనోజ్ఞాకారము, ఆమె శిరీషకోమలమగు శరీరస్పర్శయు మరువరానివగుచున్నవి. ఆమె స్మరణకలిగినంతనే నాయొడలు పులకితమగుచున్నది"అని తెలిపి, ఆస్త్రీని మరల తనకిమ్మని కోరి ఆమెను కొనిపోయెను.

మూఁడుదినములుగడచినపిమ్మట ఆమెను తిరిగి త్వష్టకడకుగొనివచ్చి "ప్రభూ! ఈమె వలన నాకుకలిగెడి యానందమునకంటె కష్టమేయధికమనుతలంపు గలుగుచున్నది. అందుచే ఈమెను మీరేగైకొను"డనుచు మరల నామెను త్వష్టకడ విడచిపోఁబోవుచుండ నాతనితో త్వష్ట "పో! నీవామెనెన్నడు నాకడకు గొనిరాకుము. నీవామె నెట్లు నిగ్రహించినను సరియే. నేనామెను పరిగ్రహింపననియె".

"కాని నేనామెతో నివసింపలేకున్నా"ననెను. అంతట త్వష్ట "ఆమె నీతోనుండనిదే సుఖముగ జీవించనేలేవు"అని తనసృష్టికార్యములను చూచుకొనుటకై వెడలిపోవుచుండెను. అప్పుడు పురుషుఁడు "ఏమిచేయుదును? నాకర్మము! ఆమె నాకడనున్నను జీవింపలేకున్నాను; ఆమె నాకడలేకున్నను జీవింపఁజాలకున్నా"ననుచు నామెతో గొణుగుకొనుచుపోయెను.



# పాకకళ

## వంకాయ సివంగిపులుసు

శ్రీమతి పిక్వ రాధ అన్నపూర్ణమ్మగారు

లేతవంకాయలు అన్నీ ఒక్కమాదిరిగానున్నవి కోసి నాలుగుచీలికలుగా తరిగివుంచవలెను. పిమ్మట జీలకర్ర, ధనియాలు, మిరపకాయలు, మెంతులు, మినప్పప్పు కొద్దిగాదోరగావేయించవలెను. ఉప్పువేసి పైన చెప్పినవి కలిపి మెత్తగాదంచి గుండచేసియుంచి దానిలో అల్లం చిన్నముక్కలు తరిగి కలిపి ఆగుండను వంకాయలలో బాగాకూరవలెను. పిమ్మట కొంచెం న[illegible]లపప్పువేయించి గుండకొట్టి ఉంచవలెను. తరువాత మనకు కావలసినమట్టుకు పులుసుఅవగా చింతపండుది క[illegible]గొయ్యిమీదఉంచి బాగాకాగుతుండగా అందులో పైనచెప్పిన వంకాయలను వదలివేయవలెను. కొద్దిగా[illegible]య్యవలెను. తరువాత కాయలుమెత్తగాఉడికేవరకు మంటబాగాపెట్టవలెను. మొదట పులుసు తిరగబో[illegible]చేసొయ్యవలెను. తరువాత కాయముచిక పట్టుకొన్న తేనెపట్టువలె కదిలీటట్టుఉండవలెను. పైనచెప్పిన నువ్వులపొడివేసిదింపి వేడిచల్లారకుండ భుజించవలెను.

## వంకాయ సోమాసీ

శ్రీమతి వి. వసంతగారు

గోధుమలు బాగమెత్తటిపిండివిసరి గట్టిగాతడపవలెను. తడుపునపుడు పిండికసరుకాకుండ కొద్దిగా ఉప్పునీరు కలపవలెను. చాలగట్టిగా తడిపిపెట్టవలెను. మంచిలేతవంకాయలు, యెఱ్ఱగడ్డలు, పచ్చిమిరపకాయలు, కొత్తిమిరిఆకు, కరివేపాకు బాగాకడిగిపెట్టవలెను. వంకాయలు ముచికలుతీసి నాల్గుపత్రములుగా తరిగి ఎఱ్ఱగడ్డలు, పచ్చిమిరపకాయలు, కొత్తిమిరికూడ తరిగివుంచవలెను. ఉప్పుకొంచెము పసుపు నూనె ఆఅన్నిబద్దలకు బాగాపట్టించి పన్నటిశగమీద (అడుగున) ఒకగిన్నెలో నీళ్లుకొంచెము నూనెకొంచెము(చాల కొంచెం)వేసి ఉప్పురాసినబద్దలు అందులోవేసి బాగాకుదిలించి పైన ఒకపళ్లెములో నీళ్లుపోసి ఉంచవలెను. పదినిమిషములు అయినతరువాత బాగాకుదిపి వంకాయలు ఎఱ్ఱగడ్డలు మెత్తపడినదిలేనిది చూడవలెను. బాగా ఉడికినదాక అపుడపుడు కలుపుతు గరిటతోగాని కుదిలించిగాని కొంచెము శనగపిండి, కొద్దిగా బియ్యపుపిండి పైన చల్లవలెను. పిండిచల్లకపోతే కూర ఎఱ్ఱగడ్డలువేరే వంకాయవేరే ఉండును. ఇపుడు ముద్దగాఉండును. ఉడకగానే బాగాఆరబెట్టి వుంచవలెను. గోధుమపిండికి కొంచెము నెయ్యిపట్టించి బాగాచేతికొద్ది మర్దన చేయవలెను. తరువాత కొంచెములావుగా పూరీవత్తి ఈవంకాయకూర (కజ్జికాయలకు కొబ్బెరపూర్ణము పెట్టి మడిచినట్లుగానే) ఈపూరీకికూడ కూరపెట్టిమడిచి వెంటనే చమురులో వేచవలెను. పూరీలుచేసుకొనుటకుముందే చమురు బాగా కాగుతూఉండవలెను. పూరీలో కూరపెట్టినతరువాత తిరిగి పీటమీదపెట్టి నూనె కాగినదాకఉండనిచ్చిన నీళ్లుకారి పూరీ పీటకు కరుచుకొనిపోవును. పూరి కూరపెట్టినవెంబడే చమురులో కాల్చవలెను. బహురుచిగాఉండును.

# బాలవిజ్ఞానశాఖ

౧. పదము

## తొక్కుపల్కులు

శ్రీమతి గాడిచర్లలలితాకుమారిగారు

మామిడిపండు—
ఏమిమామిడి?
అంటుమామిడి—
ఏమిఅంటు?
మల్లెఅంటు—
ఏమిమల్లె?
బొడ్డుమల్లె—
ఏమిబొడ్డు?
నానెబొడ్డు—
ఏమినానె?
మంచినానె—

ఏమిమంచి?
గడమంచి—
ఏమిగడ?
వెదురుగడ—
ఏమి వెదురు?
సన్న వెదురు—
ఏమిసన్న?
జాజిసన్న—
ఏమిజాజి?
పూవుజాజి—
ఏమిపూవు?

గన్నేరుపూవు—
ఏమిగన్నేరు?
పచ్చగన్నేరు—
ఏమిపచ్చ?
ఆకుపచ్చ—
ఏమిఆకు?
చింతఆకు—
ఏమిచింత?
సీమచింత—
ఏమిసీమ?
రాయలసీమ—

౨. పాటలు

## పిల్లలపాటలు

శ్రీమతి ఆ. కామేశ్వరిగారు

౧

కాళ్లగజ్జ కంకణమ్మ
వేగుచుక్క వెలగమొగ్గ
మొగ్గకాదు మోదుగనీడ
నీడకాదు నిమ్మలవాయ
వాయకాదు వాపిటకూర
కూరకాదు గుమ్మిడిచెట్టు
చెట్టుకాదు చేమలమట్ట
మట్టతీసి నీకాలు విరుగగొట్టు.

౨

గుడుగుడుగుంజం గుండారాగం
పాములపట్టం పడగారాగం
అత్తాచెవుల ముత్యాలుపోస్తే
అడుకురావే చిటుపాప!
చిటుపాపపెళ్లికి చిమ్మిలిదంస్తే
బయటికిరావె పందికొక్కా!

౩

ఒప్పులకుప్ప ఒయ్యలభామ
కీల్కుచ్చు వాల్మొగ్గ.

౪

చెంబచెక్క చేరడేసిముగ్గ
అట్లుపొయ్యంగ అలకించంగ
ముత్యాలచెంబచెక్క ముగ్గులెయ్యంగ
రత్నాలచెంబచెక్క రంగులెయ్యంగ
పగడాలచెంబచెక్క పందిరెయ్యంగ
పందిట్లో మీతాతకీమాతాతకు పెండ్లిచేయంగ.

౫

ఇంద్రగట్లమీద యీగట్లమీద
ఇంపుతోనాడింది యీముద్దునెమలి
చంద్రగట్లమీద చలవపందిళ్ల
తానాడెకృష్ణమ్మ తల్లిపుట్టింట.

౬

నీళ్లలోపుట్టింది నీరచావదుబ్బు
కావిళ్లపట్టదే కాడల్లచేత
మాయింటపుట్టింది మగువఅమ్మాయి
సందెళ్లపట్టదే సంపత్తిచేట.

౭

ఏటిగట్టున్న పంతమ్ములాడే
ఎల్లన్నిచినవాడు ఎవ్వారల్లుండు?

నాగబంధపుచెవుల పోగులున్నాయి
రాజుల్ల అల్లుడవురారఅబ్బాయి!

౮

నీలగిరిచెరువులో పాలగిరిపిట్ట
నీళ్లన్నియిగిరితే నీయాటలేల
అన్నయ్యతోడమీద ఆడేటియబ్బాయి
మీయమ్మగర్భిణీ నీయాటలేల?

౯

చిట్టిచిట్టి మిరియాలు
చెట్టుక్రింద పోసేరు
పుట్టమన్ను త్రవ్వేరు
బొమ్మరిల్లు గట్టేరు
బొమ్మరింట్లో పిల్లపుడితే
పిల్లతలకి నూనెలేదు
నాతలకి నెయ్యిలేదు
అల్లావారింటికి మజ్జిగకువెళితే
ఆళ్లావారికుక్క "జా"మంది
కాళ్లగజ్జలు గళ్లుమన్నాయి
చంకాపిల్ల కారుమంది.

## చిన్నపిల్లలపాటలు

శ్రీమతి యరమోతు కనకరత్నమ్మగారు

౧

అయిదువేళ్లు—
తిందాంతిందాం
ఒకవేలు—
ఎట్లాతిందాం
ఒకవేలు —
అప్పుచేసితిందాం
ఒకవేలు—
అప్పెట్లాతీరుతుంది
ఒకవేలు—
ఉన్నాగదానేను
అన్నింటికీ
పొట్టివాణ్ణి
గట్టివాణ్ణి
బొటనవేలు.

౨

చిట్టిపొట్లకాయ
సీమనెల్లికాయ
గోడపుచ్చకాయ
గొబ్బినెల్లికాయ
అత్తకుపెడితేఅల్లం
నేతింటేబెల్లం
కొత్తకుండల్లోని
గోధుమల్లారా!
పాలపిడుతల్లోని
పసిబిడ్డలారా!
అమ్మఅమ్మనీబిడ్డ

పైరేమంటే
నీళ్లల్లో నిమ్మపండు
పాలల్లో పనసపండు
నేతిలో నేరేడుపండు.

3

కాళ్లాగజ్జ
కంకాణమ్మ
వేకులచుక్క
ఎలకామొగ్గ
రాజుగారిదొడ్లో
ఏముందంటే
గారీమోరీ
కాలుతీసి
కడకుపెట్టు.

3. కథలు

# పొదుపు

శ్రీమతి కొసరాజు సీతారామమ్మగారు

అనగాఅనగా ఒకవూళ్లో బుచ్చమ్మ, అచ్చమ్మ అనే ఇద్దరుస్త్రీలుకలరు. అచ్చమ్మ అనేఆమె పది గేదల పాడిచేయుచుండెను. బుచ్చమ్మ అనేఆమె ఒకగేదె పాడిచేయుచుండెను. ఇట్లుండగా అచ్చమ్మఅనే ఆమె ఎక్కువ గయ్యాళి, అదియునుగాక ఇంటిలోతాను పదిగేదలపాడిచేయుచున్నను చాలక ఒకగేదె పాడి చేయు బుచ్చమ్మదగ్గరకు నేయి బదులుపోయమని అడుగగా ఆమె ఒకతప్పెనెయ్యిపోసెను. మళ్లీ అచ్చమ్మ పదిగేదలపాడి తప్పెనెయ్యియు చాలక మళ్లీ బుచ్చమ్మదగ్గరకు నేయిపోయమని అడుగగా మొన్న నేగదమ్మ నీకు తప్పెనెయ్యిపోసినది అదియునుగాక నీవుకూడ పదిగేదలపాడిచేయుచుంటివి అని బుచ్చమ్మఅడుగగా నీవు నాకు తప్పెనెయ్యిపోసినదెప్పుడు అని తగవుమొదలుపెట్టి పోట్లాడుకొనుచుండిరి. ఇంతలో అచ్చమ్మ మొగుడు, బుచ్చమ్మమొగుడు అన్నదమ్ములిద్దరువచ్చి తగవులేమిటి అని అడుగగా వారు సమాధానము చెప్పక పోట్లాడుకొనుచు కొట్టుకొనుచుండగా మళ్లీ బుచ్చమ్మమొగుడు, అచ్చమ్మమొగుడు కుయ్యోమొర్రో ఏమిట్రా అని మొత్తుకున్నప్పటికి గూడ చెప్పకపోయిరి. అన్నదమ్ములిద్దరు విసుగుచెంది ఏబజారునకో వెళ్లిరి. అచ్చమ్మ బుచ్చమ్మలు అట్లాగునే తగవులాడుచుండగా ఇరుగుపొరుగువారుచూచి ఎందులకమ్మ అట్లుతగవులాడుట రేపున్యాయస్థానకచ్చేరీకువెళ్లి అక్కడవిచారించెదము అని ఆతగవు ఆరోజుకు అపివేసిరి. మరునాడుదయమున న్యాయస్థానకచ్చేరీకి వెళ్లుచుండగా దారిలో ఒకపెద్దవర్షముకురిసి వీధులన్నియు బురదతో నిండియుండెను. ఎట్లయితేనేమి పడుతూలేస్తూ గంపెడు బురదకాళ్లతో నీళ్లతొట్టిదగ్గరకాళ్లు కడుగు కొనుటకువెళ్లిరి. బుచ్చమ్మఅనేఆమె ఒకచెంబునీళ్లతో శుభ్రముగ కడుగుకొనివెళ్లెను. అచ్చమ్మఅనేఆమె పదిచెంబుల నీళ్లుపెట్టికడిగినను బురద పోయిపోవనట్లేయుండెను. ఇదంతయు న్యాయాధికారి చూచుచునే యుండెను. ఎట్లయితేనేమి ఇద్దరును కచ్చేరీదగ్గరకు వెల్లిరి. అక్కడవిచారించగా బుచ్చమ్మ ఇట్లుచెప్పెను. ఏమంటే నాయనా నేను ఒకగేదె పాడిచేయుచుంటిని, ఆమె పదిగేదల పాడిచేయుచుండెను, ఇట్లుండగా ఆమె ఒకనాడు మాయింటికివచ్చి నేయిబదులుపోయమని అడుగగా తప్పెనెయ్యిపోసితిని, మళ్లీ ఆమె కొన్ని దినములకు నేయిపోయమనిఅడుగగా ఏమమ్మా మొన్న నేగదమ్మ నీకు నేను తప్పెనెయ్యిపోసినది, అదియును గాక నీవుకూడ పదిగేదల పాడిచేయుచుంటివి అని అడుగగా నీవు నాకు తప్పెనెయ్యిపోసినదెప్పుడు అని తగవులాడినది అనిబుచ్చెమ్మచెప్పెను. అచ్చమ్మనడుగగా నాయనా నేనుఏమియును ఎరుగనని చెప్పెను. ఈమాటలువిని న్యాయాధికారిట్లుచెప్పెను. ఏమంటే అచ్చమ్మగారూ అచ్చమ్మగారూ నీవు అమితవ్యయము చేయుదానవు. ఎందుకనగా బుచ్చమ్మ ఒకచెంబునీళ్లతో శుభ్రముగా కడుగుకొనగా నీవు పదిచెంబులనీళ్లతో కడుగుకొనినను బురదపోలేదు. కనుక నీవు నేయిపోయించుకొనివెళ్ళినది నిజమే, మళ్లీ ఆమెను నేయిపోయమన్నది నిజమే కనుక నీవులేనిపోనితగవుపెట్టినందుకు నీకు పదిరూపాయలు జరిమానాఅనిచెప్పి న్యాయాధికారివెళ్లెను. అచ్చమ్మఇంటికి అచ్చమ్మ, బుచ్చమ్మ ఇంటికి బుచ్చమ్మపోయిరి. కనుక ఎవరైనను అమితవ్యయము చేయరాదు.

## పూర్వపువాసన

శ్రీమతి అన్నంరాజు రుక్మిణమ్మగారు

ఒకనాడు అగస్త్యమహాముని సూర్యదేవునికి అర్ఘ్యము వదలవలెనని దోసిలినిండ నీరుతీసి కొంచంసేపు అతడు సూర్యుని ప్రార్థించేడు. అంతలో ఆకాశముపై ఒకడేగ ఎలుకను ఒకదానిని తన్నుకొనిపోతోంది. ఆఎలుక ప్రమాదవశమున డేగకాళ్లనుండిజారి ఋషిచేతిలో పడింది. అప్పుడు ఆఋషి ఆశ్చర్యపడి జాలిచే ఆఎలుకను ఒక పదిసంవత్సరములపిల్లగాచేశాడు. ఆపిల్లను యింటికి తీసుకుపోయి పెంచుతున్నాడు. ఆఅమ్మాయికి పెళ్లీడువొచ్చింది. వెంటనే ఆముని ఈపిల్లను గొప్పవాడికిచ్చి పెళ్లిచెయ్యాలనుకొన్నాడు. తన తపోమహిమచే సూర్యుని పిలిచేడు. "అమ్మాయి! ఈయన్ను పెళ్లిచేసుకుంటావా" అన్నాడు. ఆఅమ్మాయి "ఈఅబ్బాయి యెండకు నేను ఆగలేనుగాని ఇంకోఅబ్బాయిని తె"మ్మంది. అప్పుడాయన మేఘుడనేపిల్లాడిని తీసుకొస్తే "ఈఅబ్బాయిదగ్గిర చాలాచలివేస్తుం"దంది అమ్మాయి. ఇక ఆమునేమో వాయుదేవుడిని పిలిచేడు. "అబ్బో! ఈయన ఉన్నచోట ఉండను. ఇంకొకబ్బాయిని తీసుకురా" అందిఆపిల్ల. వెంటనే ఆయన హిమవంతుడనే కుర్రాడినితీసుకొస్తే "ఇతనిమనస్సు చాలగట్టిది. కాని యింకోఅబ్బాయిని తీసుకొస్తేయేం?" అంది ఆఅమ్మాయి. అప్పుడు ఆయన ఒకఎలుకను తెచ్చేడు. ఈఅమ్మాయికి చాలసంతోషము వచ్చింది. ఆయన ఈపిల్లను ఒక ఆడఎలుకగా చేశాడు. వెంటనే రెండింటికి పెళ్లయింది. ఆరెండుఎలుకలు కిచకిచలాడుతూ కన్నంలోకి పారిపోయాయి. కథకంచికెళ్ళింది. మనంయింటికొచ్చేము.

## కాళ్లినిమించిన మహాకాళి

శ్రీమతి వి. రాజ్యలక్ష్మమ్మగారు

పద్మావతియను పట్టణంబున పరంధాముడను రాజువుండెను. ధైర్యస్థైర్యబాహుబలపరాక్రమసంపన్నుండై ప్రజారంజకముగా ఆతడు రాజ్యమేలుచుండెను. అతనికి సుగుణవతియగు చంద్రకళయను భార్య గలదు. ఆమెకు ధైర్యవతియను పరిచారికయుండెను. ఆసైరంధ్రి ధైర్యసాహసములును దైవభక్తియును రాజభక్తియును గల్గి రాణికి ఆరవప్రాణమువలెనుండెను. ఇటులుండ రాజదంపతులు సంతానహీనులై యుండిరి. ఆకొరంతయే వారి వ్యసనములకు మూలకారణము. ఇట్లు బహుకాలముగడచిన పిమ్మట రాజు తాను ద్వితీయవివాహముచేసికొందునని భార్యకెరిగించెను. ఈమాటలు యామానవతి చెవులకు ములుకుల వలె గ్రుచ్చుకొన ఖిన్నయై తనప్రాణపదమైన చెలికత్తెతో చెప్పెను. అంతట ఆదాసి యాశ్చర్యమగ్నయై 'అకటా! మారాజ్ఞీమణికి ఏమికష్టములురానున్నవో' అని మనంబున తత్తరపడిచింతించి ఆమెతో నిట్టులనియె. "అమ్మా! మీరు చింతిల్లబనిలేదు. నేచెప్పిన చొప్పున మీరుఒప్పినచాలును. సర్వమును నేనేసమర్థింతును" అనిచెప్పి మారాణిగర్భవతియాయెనని ప్రజల కెరింగించెను. ఆమాట రాజుగారిచెవులను గూడబడెను. అంతరాజు పరమానందభరితాత్ముడై కొలువుచాలించి అంతఃపురమున కరుగుదెంచి తనభార్యనుచూచి సంతసించి అనురాగముప్పతిల్ల సరససల్లాపములు చేసితిరిగి కొలువుకూటమునకు జని మంత్రిపురోహితులరావించి ఈవార్తలెరింగించి సీమంతమహోత్సవంబు జరుప ప్రయత్నములు చేయుడని ఆనతిచ్చెను. అంతవారు మిగుల సంతోషాన్వితులై పురంబు అలంకరించి సీమంతము నెంతయో వేడుకగాజరిపిరి. అంతఃపురంబులో దాసి

ధైర్యవతి నెలనెలకు రాణిగర్భమును పెంపొందచేయుచుండెను. ఈవిధముగా నవమాసములు పూర్తియయ్యెను. కలలో పాలుత్రాగుటకు కంచుగిన్నెయేల కనకపు గిన్నెలలోనే త్రాగుమన్నట్లు పునర్వసునక్షత్రమున భానువాసరమున అభిజిత్తులగ్నమున రాణిగారికి పుత్రుడుకలిగెనని ధైర్యవతి రాజుగారికొలువుకూటమునకు వార్తపంపెను. అంతట రాజుగారికి పుత్రుడు గలిగెనని జయభేరులువేసిరి. పురిటింటదాసి శిశువునకుబదులుగా రబ్బరుబొమ్మను పరులకు ఎరుకపడనివిధముగా రాణియొద్దనునిచెను. పురజనులెవరైన పిల్లవానినిచూడ కుతూహలులైవచ్చిన పిల్లవాడు అపరిమితసుకుమారుడనియు చూచిన దృష్టితాకునని నెపముపెట్టి వారందరిని దాసిపంపివేయుచుండెను. ఈతీరున నవరాత్రులుగడపి ధైర్యవతి మరునాడు నాల్గుసేర్ల నలుగుపిండికిపిసిరించి మొుగపిల్లవానిరూపముగాచేసి పసుపు, కుంకుమ మిగతా పూజాద్రవ్యములను నొకపళ్లెరమున నిడికొని ఆబొమ్మకు నూనెగుడ్డలు కప్పుకొని రాత్రి రెండుజాములకు యూరివెలుపలనున్న కాళికాదేవి గుడికి జని కాళికి భక్తిశ్రద్ధలతో పూజానైవేద్యంబులు సలిపెను. తరువాత ఆమె ఆబొమ్మను అచటనేయుంచి పైకిబోయి వచ్చుసరికి ఆమెయుంచినబొమ్మ బొమ్మ విధముగానుండక పొడిగానుండెను. ఆగుడిలో పూజచేయుప్రతివారును పిండిని ప్రమిదలుగాచేసి అందులో దీపారాధనచేయుటవాడుక. వారువెళ్లినతరువాత ఆపిండిముద్దలను యెలుకలు, పందికొక్కులు తినుటయు వాడుకయైయుండెను. ఆవిధముగానే యీపిండిబొమ్మను కూడా యెలుకలు కొంతతిని కొంతభాగము పిండిగాచేసియుండెను. ఇదిచూచి ఆదాసి ఆగ్రహముచెంది "కాళీ! ఈపాపని నీపొట్టనుపెట్టుకొంటివా? ఔరా! చూడునాప్రతాపము. నాఖడ్గంబున నీశిరముఖండించెదను. నాపిల్లవానిని నాకుబ్రతికించియిమ్ము. యిచ్చెదవాలేదా?" అని ఆవిగ్రహమును పొడువబోగా అంతట ఆదేవి ఆశ్చర్యమగ్నయై గడగడవణంకి ముక్కుమీద వ్రేలువేసుకొని నీపిల్లవానిని కుసుమగాత్రునిగా ఇచ్చెదనని బాలచంద్రునివంటి పిల్లవాని నిచ్చెను. అంత ఆధైర్యవతి ఆనందమునుచెంది త్వరితముగా తెల్లవారకమునుపు రాజభవనమునకువచ్చిచేరి ఆశిశువును రాణిప్రక్కనునిచెను. ఈసంగతి అంతయును రాణికి నివేదించెను. ఆమె చాల ఆశ్చర్యానందమనస్కురాలై నీనామము నీకంతయుతగియున్నది. నీఋణంబు వేయిజన్మంబులకైనను తీర్చగలనా అని ఆదాసిని యెంతయొపొగడెను. ప్రొద్దుననే మామూలుగా కాళికాలయమున పూజచేయుపూజారివచ్చి గుడితలుపులన్నుతీసి అమ్మవారినిచూడగా కాళికాదేవి ముక్కున వ్రేలువేసుకొనియుండెను. అదిచూచి అతడు యిదియేమి కారణమో అని రాజుగారికెరింగించెను. ఆయూరివారందరు ఇదియొకవింతగా అమ్మవారిని చూడసాగిరి. అంతట రాజు తనపట్టణమునకు ఏమికీడు సంభవించునోయని భయమునుచెంది ఆమెముక్కుమీదివ్రేలు యెవరు తీయించిన, వారికి నారాజ్యములో సగముయిచ్చెదనని చాటించెను. ఎంతమందియోవచ్చి ఆవ్రేలును తీయింపలేక వెడలిపోవుచుండిరి. తరువాత మనధైర్యవతి పరంధామనృపతియొద్దకువచ్చి రేపుతెల్లవారు లోపల నేను వ్రేలును తీయించెదను. నాకు అర్ధరాజ్యమునిచ్చెదరా అని అడిగెను. తప్పక సగమురాజ్యమునిత్తునని రాజునిండుసభలో పలికెను. మరల ఆమె అర్ధరాత్రంబున నొకపెద్దకత్తిని తీసికొని కాళికాదేవిగుడికివచ్చెను. "కాళీ! నాపట్టిని నీవుతినుట ఆశ్చర్యంబుకాదుకాని మరల నేనునాపట్టినడుగుట నీకాశ్చర్యమాయనా? ఆవేలును ముక్కుమీదనుంచితీయుదువా? లేక యీఖడ్గంబుచే నీచేతినిఖండింతునా?" యని చేతినినరుకబోగా కాళికాదేవి మరల భీతిని చెంది వ్రేలినిముక్కుమీదినుంచితీసి యథాప్రకారముగా నుంచుకొని తనలో నిటులఅనుకొనెను: "నేనే కాళిని. ఈమెనాకేకాళియైనదికదా." మరునాడు ప్రజలు అమ్మవారినిచూచి చాల ఆశ్చర్యపడిరి. ధైర్యవతి సభకువెళ్లి నేను వ్రేలినితీయించితిని కాన అర్ధరాజ్యము నిమ్మనిఅడిగెను. ఆరాజువెంటనే నిజంబుకనుకొని ధైర్యవతికి సగమురాజ్యమును యిచ్చివేసెను.

# పరిశీలనము

విద్వాన్ సూకిగుచ్చి కృష్ణమూర్తిగారు

నేఁడు రాజకీయవిషయములందేమి, విద్యావిషయములందేమి, తదితరవిషయములందేమి నారీగణము మిగుల నుత్సాహముగఁ బనిచేయుచున్నదను విషయ మెంతయు నానందింపఁదగినది. ఎండకన్నెఱుఁగక యాగర్భశ్రీమంతులై కాలుక్రిందానకుండ నిరంతర సౌఖ్యముల ననుభవించు నారీమణులు నేఁ డెందరో రాజకీయవిషయములందుఁబాల్గొని జీవితమునం దనుకోనిమార్పులనంది, యలవాటులేని యాహారాదికముల భుజించుచున్నారను విషయమువిన్న చింతాసంతోషములు గలుగకమానవు. విద్యావిషయమందును ప్రాచ్య పాశ్చాత్యవిద్యలం దసమానపాండిత్యము నార్జించి విజ్ఞానమునందిన వనితామణులను మనము ప్రతివత్సరమునందును జూచుచున్నాము. ఇది భారతభావిభాగ్యోదయమును సూచించుచున్నది. స్త్రీలు రాజకీయవిషయములఁ బాల్గొనరాదనియు, గృహనిర్వాహకవిద్యయే స్త్రీలకు ముఖ్యతమమనియుఁ బదుగురాడుచున్నారు.

ముందు విద్యనుగుఱించి విచారింతము. చాలవఱకు స్త్రీలు పాశ్చాత్యవిద్యయందుఁ బట్టభద్రలై పురుషులవోలె నుద్యోగములు చేయుచుండుటచేఁ గేవలము వారివలెనే వీరును నుదరపోషణమునకే విద్యార్జనము చేయుచున్నారని యూహింపనగును. కొంతకాలము క్రిందటివఱకు నాంగ్లభాష సామాన్యముగఁ బంచమజాతియందే యుండెనుగాని నేఁడన్ని జాతులవారును దానిని జదువుచున్నారు. పంచమజాతివారు సామాన్యముగ బీదవారుగ నుండుటంబట్టి ప్రభుత్వమువారు వారిని దమమతమునందుఁ గలపికొని యుచితాహారవిద్యల నిచ్చుచుండుటచే వివాహాదులందంతగాఁ బట్టింపులేని యాపంచమజాతిస్త్రీలు విద్య నభ్యసించి యుద్యోగములుచేయుట సాంప్రదాయమై యుండెడిది. కాలక్రమేణ యాయాచారమే నేఁ డన్నిజాతులవారు నవలంబించు నలవాటైనది. కావునఁ బాశ్చాత్యవిద్య కేవలము దాస్యమునకే దారిఁజూపుచున్నది గాని విజ్ఞానమునకును, హిందూసాంప్రదాయములకును ద్రోవఁ జూపుటలేదని తెలుసుకోఁగలము. సామాన్యముగ నేఁడు పట్టభద్రలైన యువతీమణులెందఱో పాశ్చాత్యవిద్యయందుఁ బాండిత్యము సంపాదించియుఁ దమకింతభుక్తియున్నను, దేశమున కావంతేని సేవచేయక పైవ్యామోహముల కధీనలై సేవావృత్తిలోనున్న విషయము చూచుచునేయున్నాము. సేవావృత్తిలోని యాంతరంగికహైన్యమును దారెఱుఁగక అదియొక్క-గొప్పయనియు, నంతమాత్రముననే తమజన్మము సాఫల్యమునందెననియుఁదలంచి తుచ్ఛసుఖముల ననుభవించుచున్నారు. కాని దేశసేవచేయు యువతీమణులులేరని నాయభిప్రాయము గాదు. ఏకొందరో యుందురు. కావున విజ్ఞానమున కుపకరించు విద్యల నెన్నియేని యభ్యసింపనగును గాని కేవలము దాస్యమునకే ద్రోవఁజూపుసాంప్రదాయముగలవిద్యను గుటుంబపోషణభారమంతగా లేని స్త్రీలకుఁదగదు.

ఇఁకను స్త్రీలకు గృహనిర్వాహకవిద్య యావశ్యకమనునది విచారింతము. గృహనిర్వాహకవిద్యయనఁగ గృహము నెట్లుంచవలయును, వంటకము మొదలగువాని నెట్లు చేయవలయును మొదలగువానిని బోధించునది. కాని యిట్టిది విద్యయేగాదు. ఇది యభ్యసింపఁదగినదిగాదు గాని యలవఱచుకోఁదగినది. గృహనిర్వాహకవిద్యయనునది మొదలే లేదు. ఇది యభ్యసింపకయే కులసతులకుఁ గులాచారసాంప్రదాయముల ననుసరించి వచ్చుచున్నది. గృహనిర్వాహకత్వము స్త్రీకెట్టి యావశ్యకమో పురుషునకును నంతియ యావశ్యకము. కావున స్త్రీపురుషు లిరువురు సంసారమందలి సుఖదుఃఖముల సమముగ విభాగించుకొని జీవసాగరమును దాటవలయును. కావున విజ్ఞానముగల దంపతుల గృహమెపుడును శోభించుచునేయుండును. అట్టివిజ్ఞాన మెట్లలవడును అనునది విచారణీయము. స్త్రీలకెట్టివిద్య యావశ్యకము అనునదియుఁ బరిశీలింపఁదగినది.

స్త్రీలు నేర్వఁదలఁచిన నేవిద్యనైనను నేర్వఁదగునుగాని ముఖ్యముగ స్త్రీలకు సాహిత్యజ్ఞానము, ప్రపంచజ్ఞానమును నావశ్యకములు. తదితరశాస్త్రజ్ఞానము లప్రధానములు. గణితశాస్త్రము, వ్యాకరణశాస్త్రము కొంచెముగ నుండనగును. అట్టి సాహిత్యజ్ఞానమునకు స్త్రీలు ముఖ్యముగ దేశీయవిద్యను బాగుగనేర్వవలెను. ఇదియ వివేకానందులవారును భారతనారి యనునొక యమూల్యవ్యాసమున వివరించియున్నారు. దేశవిద్యనునేర్చి తమదేశమును, తమయౌన్నత్యమును, తమవీరాగ్రేసరులను, దమకవులను నొకమారు స్మృతికిఁదెచ్చికొని తామును అంతటి విజ్ఞానమును, అంతటియౌన్నత్యమును, అంతటి పరాక్రమమును, అంతటి పాండిత్యమును సంపాదింపయత్నించి దేశమునఁదామును పరిగణనీయుల మనిపించుకోవలెను. ఇట్టి విద్యయే దేశసేవ, సమాజసేవ, నారీసేవలకుఁ బరికొల్పును. తమదేశమున సీత, సావిత్రి మొదలగు పతివ్రతలుండిరనియు మీరాబాయి; మొదలగు భక్తురాండ్రుండిరనియు; సంయుక్త మొదలగు పరాక్రమవతు లుండిరనియు; విజ్జిక మొదలగు పండితురాండ్రుండిరనియు దెలిసికోలేనియువతి యొకయువతిగాదు. కావున స్త్రీలు ముందు దేశీయవిద్యనుజదివి, పిదప నవకాశమునుబట్టి తదితరవిద్యలను గేవలము విజ్ఞానముకొఱకు చదువవలయును. బాలికలకు సామాన్యముగ మతి యంతచంచలముగ నుండదు గాన బాల్యముననే వారికి మంచినీతియు, మంచివిజ్ఞానమును గుదురునట్లు బోధించుట బోధకుల విధియైయున్నది. పురుషులనుబోలె వారినంతగ కసరి శిక్షించుట తగనిపని. ఎంతవఱకును బోధకులుగాని, బోధకురాండ్రుగాని బాలికలకు బోధించునపుడు నగుమొగముతో నుండి, వారి శ్రేయము నాకాంక్షింపవలెను.

కాని యొకవిషయము తమబాలికలకుఁ దల్లిదండ్రులు ముఖ్యముగ నేర్పవలెను. అది తమ బాలిక లనవసరముగ సిగ్గుపడుట, భయపడుటయునునది. దేశ మింతనాగరికస్థితిలో నున్నను బదియేండ్ల బాలికయైనను బరిణయమన్నను, పురుషులన్నను అవసరముగ సిగ్గు

పమిట, మాట్లాడకుండుట మొదలగునవి వింతగనున్నవి. వారిదృష్టిలో మగవారితో మాట్లాడఁగూడదని యభిప్రాయముగాఁబోలును. ఇది తల్లిదండ్రుల యభ్యాసమైయుండ నోపును. ఇదియే సత్ప్రవర్తనమని వారియభిప్రాయమై యుండును గాని యిది సత్ప్రవర్తన మనుటకంటె ఉన్మాదమన్న బాగుండును. ఇట్టి యున్మాదముండిన బాలికలకు విద్యవచ్చుట సుదుర్లభము. ఉపాధ్యాయుఁడు పాఠము చెప్పుచో యుక్తవయస్సుగలిగినయువతియేయగుఁగాక తలవంచికొని కాలునేల వ్రాయుచుండుచో నిఁక నుపాధ్యాయుఁడన్న నేమి, పాఠమన్న నేమియో తెలియకున్నది. కావున స్త్రీలిట్టి యనవసరలజ్జాదులఁ బోఁగొట్టికొన యత్నింపవలెను.

ఇఁక విద్యావిధానమిప్పటి యాంగ్లకళాశాలలలోనిదేమియు రుచిరముగ నుండలేదు. దీనినిగుఱించి యెంతయుఁ జెప్పవలసియున్నదిగాని మఱియొకసారి వివరింపఁదలఁచితిని. కాని యాంగ్లకళాశాలలో సైతము పాఠములందంతగ శ్రద్ధఁజూపక పాటలయందు నాటలయందు శ్రద్ధనుజూపుట యెంతయు విచారకరము. నీతిపాఠము (Moral instruction) చెప్పవలసిన కాలము సైతము పాటలతో వెళ్లఁబుచ్చుట యెంతయు శోచనీయము. కాన నిట్టి చిక్కులను దొలఁగింపవలసిన బాధ్యత విజ్ఞానలగు నారీమణులయందున్నది.

## వరము

శ్రీమతి ముదునూరి సూర్యకాంతాదేవిగారు

తనకుఁగల్గినదానితోఁ దనివిఁజెంది
పరులసంపదలకీసూయ పడుటమాని
మదినహింసయేపరమధర్మముగఁదలఁచి
అంతయునుదైవలీలయే యనుచునెఱిఁగి
ఐహికతరంగములలోన నాడిపోక
స్వార్జితధనంబువలనజీవనముగడప
శక్తికొలఁదిగఁబరులకు సాయపడుచు
వినయమబ్బగఁజేసెడి విద్యఁగలిగి
దేశమాతకుఁగాన్కగా దేహమొసఁగి
ఒరులచేనెన్నఁడునుగూడ నెఱుఁగఁబడక
కనుపులోఁజల్లయేమియుఁ గదలకుండ
బ్రదుకవరమిమ్ముజగదేకపాల! సాకు.

## స్త్రీపురుషులు

శ్రీ కర్లపాలెం కుటుంబశాస్త్రిగారు బి.ఏ.

చిన్నపిల్లలుకొందఱు చేరిరాత్రి
ఆరుబైటవెన్నెలలోన ఆడుకొనుట
గాంచితిని—అప్డు కన్నులగట్టినట్లు
స్త్రీపురుషభేదమెఱుగని ఆపవిత్ర
బాల్యముగ్ధపరస్పరప్రణయములును
స్వచ్ఛసోదరసోదరీ భావములును
స్మృతికుమారి నాకొఱకు చిత్రించె-అపుడు
యౌవనంబుననేమి నైచ్యంబుకలదొ
వయసునందున్న విపరీతభావమేమొ
ప్రకృతిమార్పులనేమి పాపంబుకలదొ
సృష్టివృక్షంబునకుగల రెండుశాఖ
లిటులనెడబాటుచెందుట కేమికార
ణంబొ—అనుచును తలపోసినాడనేను.

# శివం

వారణాసి రామలక్ష్మీనరసింహంగారు

౧

"శివా! మేడమీదికెళ్ళి పడుకో, ఇహ. తొమ్మిదైంది. ఇంకా మేలుకుంటే జబ్బుచేస్తుంది."

"పడుకుంటా, నాన్నా! కాస్సేపుండివెడతా."

"కాస్సేపూలేదు గీస్సేపూలేదు ఇప్పటికే ఆలస్యంఅయింది వెళ్ళు."

"పోనీ ఒక్కైదునిమిషాలు విని వెడతా, నాన్నా!"

"వెళ్ళమంటే ఏం వెడతావా-లేదా? పో ముందు పైకి" అని కసిరేడు నాన్న. ఈకసురుతో వుసూరుమంటూ మేడమీదికెళ్ళి పడుకున్నాడు శివుడు.

సదాశివుడి అక్కయ్యపెళ్ళి. క్రింద నగరాజారావుగారి వేణుగానం జరుగుతోంది. పాపం ఫ్లూటంటే అతనికి బహుయిష్టం. విందామంటే మేలుకోనివ్వరు. కారణం అతను కాస్తబలహీనంగావుంటాడని.

మేడమీదికెళ్ళి పడుకున్నాక కాస్సేపటికి నాన్నొచ్చిచూశాడు ఏంచేస్తున్నాడో అని. అది కనిపెట్టి శివుడు నిద్రనటించేడు. నాన్న నమ్మి కిందికెళ్ళేడు. వెంటనే దొంగలాగు మెల్లిగా మెట్లమీదికొచ్చి కటకటాలచాటున క్రీనీడలో కూచున్నాడు. తనకంతా కనిపిస్తోంది. కాని తన్నెవరూచూడరు. పాటలు చెవుల తనివితీరా విన్నాడు. 'పవమానసుతుడు' అన్న త్యాగయ్యగారి మంగళాన్ని వాయిస్తున్నారు. ఇహఎవరోవకరు పైకొచ్చి తనదొంగతనాన్ని కనుక్కుంటారని లేచి క్రీనీడలోంచి మెల్లగా గదిలోకి వెళుతున్నాడు. వెనక మెట్లెక్కుతూన్న చప్పుడైంది—నాన్నేమో?—భయంతో వెనక్కి తిరిగిచూడకుండా చకచకానడిచేడు. తాను మంచాన్ని సమీపించేప్పటికే ఆవెనకాల మెట్లెక్కుతూవున్న ఆయన అతన్నికలుసుకున్నాడు. శివుడి భయం కొంచెంతగ్గింది. ఆయ నెవరో కాదు మేనమామే. విశాఖపట్నంనించొచ్చేడు పెళ్ళికి.

"ఇంకా మేలుకునేవున్నావుట్రా? శివా!"

"నాన్నతో చెప్పకు. కోప్పడతాడు. ఫ్లూటువిందామని అక్కడికొచ్చి కూచున్నా."

"ఐతే పాటకచ్చేరీకోసం అన్నమాట ఇంతదాక మేలుకున్నది? ఏం అంతయిది? పడుకోకపోయావుట్రా? మరెప్పుడన్నా వినొచ్చు. మేలుకుంటే జబ్బుచెయ్యదూ?"

"కాదు మామయ్యా! మరేం, ఫ్లూటంటే నాకుతగనియిష్టం. నేర్చుకోవాలనిగూడావుంది. మామయ్యా! అమ్మనేర్పిస్తానన్నది కాని నాన్నే ఒప్పుకోలా—డాక్టరుగారు నేను ఫ్లూటునేర్చుకునేందుకు వీలయినంత బలంగా లేనన్నారుట, ఒద్దన్నాడు." "ఉహూ"

"పోనీ నేర్పించొద్దులే ఒకఫ్లూటన్నా కొనిపెట్టమంటేగూడా వల్లగాదన్నాడు. అమ్మనడిగితే వాయించటంరాందే ఫ్లూటెందుకు, ఒచ్చేయేడు కొనిపెడతాలే అంది. మామయ్యా! మరి, నువ్విచ్చింది, అమ్మమ్మిచ్చింది, అత్తయ్యిచ్చింది, పెద్దమ్మిచ్చింది దాచిపెట్టుకుని కొనుక్కోనా?"

"పోనీగానీ నేను కొనిపెట్టనా మంచిఫ్లూటుని?"

"ఆ, వూరికే నేఅంటావు. చివరికి చెప్పకుండానే వూరికెడతావు. నిజంగాచెప్పు, మామయ్యా! నిజంగా కొనిపెడతావా?"

"నిజంగానే. కాని, అదేమిట్రా శివా అమ్మ నువ్వు సరిగ్గా చదువుకోటం లేదంటోంది. చదువుకోకపోతే ఎట్లారా మరి?"

"హిస్టరీయే మామయ్యా! నాకురానిది. మిగతావాటిల్లో ఫస్టుమార్కు నాదే. ఐతే నువ్వీపరీక్షలో హిస్టరీలోగూడ సంపాయించాలన్నమాట ఫస్టుమార్కు. అట్లాయితే తప్పకుండా కొనిపెడతా మంచిఫ్లూటొకటి."

"బాగాచదువుతా మామయ్యా! నువ్వుమాత్రం తప్పకుండా కొనిపెట్టాలి, ఏం?"

"సరేనన్నానుగా. ఈపాటికో నిద్రపోవాల్సింది. నాన్నకి తెలిస్తే నిన్నూ నన్నూ కూడా కోప్పడతాడు."

మామయ్య కిందికెళ్ళేడు. శివుడు నిద్దరోయాడు.

౨

"శివన్నయ్యా! రావూ, దబ్బున. నాన్న బ్రహ్మన్నయ్య నుంచున్నారు వాయిట్లో నీకోసం."

"అబ్బ, ఏమిటే. నేనిప్పుడేరానని చెప్పు. ఆవాల్టికొచ్చి కలుసుకుంటూలే మిమ్మల్ని."

"ఎక్కడకలుసుకుంటావ్? బలే. కలుసుకుంటాట్ట. మేమెక్కడికెడుతున్నామో నాకే తెలీదు. చివరికి సినీమాకి తీసికెడతాట్ట."

"బజారులో కలుసుకుంటాలే పో."

"బజారులోనా? పాపం నీకోసం బజారులో కూచోమంటావేం మమ్మల్ని. రావన్నాడని చెప్పనా నాన్నతో."

"ఊఁ. సినీమాహాలుదగ్గిర నుంచుంటానన్నాడు మనకోసం అని చెప్పు."

సుందరం వెళ్ళిపోయింది. సదాశివుడు ఐదున్నరఆరవేస్తేనేగాని బైటికిరాడు. అప్పటిదాకా చదువే. అంచేతనే సుందరంతో అప్పుడే రానన్నాడు. "రెండవ హెన్రీ 1154 నించి 1189 వరకు, ఒకటవరిచర్డు 1189 నించి 1199 వరకు" అంటూ చదవటం మొదలెట్టేడు. ఎంతసేపూ అదేపాఠం — ప్లాంటాజినెట్టులకన్నే చివరికి ఆరాజులంతా తనముందు నాట్యం చేశారు. తలదిమ్మెక్కడం చేత కాస్త విశ్రాంతికోసం కళ్ళుమూసుకున్నాడు. అట్టే వళ్ళిపోయిం దతనిమనస్సు ఫ్లూటుమీదికి. మళ్ళీ బాహ్యజ్ఞానం కలిగేటప్పటికి ఎనిమిదిగంటలైంది.

"పాఠం లింకాపూర్తికాలేదు. హాయిగా సినీమాకన్నా వెళ్ళేను గాను, ఇట్లాపరాకుగాకూర్చోకుండా" అనుకుని అన్నానికెళ్ళేడు. అన్నంతింటం అంతాఅయేటప్పటికి తొమ్మిదైంది. ఇహ మేలుకోనివ్వరు. తెల్లారుగట్ల లేచి చదువుకుందామనుకున్నాడు. పాపం శివుడికి మెళుకువరాలే. తనచురుకుకాలతో సూర్యుడేలేపేదన్నీ.

"ఎండకూడాయెక్కింది. ఇంటికిచ్చిన లెక్కలన్నా చెయ్యలేదు. నిన్న సాయంకాలం అంతా హిస్టరీతోకూచున్నా" అనుకుని ఆదరాబాదరగా మొహంకడుక్కుని ఓవల్ టైన్ తాగి బడికెళ్ళేడు. పదింటికల్లా ఇంటికొచ్చేడు. మళ్ళీ రెండుంబావుకిబడి. అన్నంతిని పదకొండున్నరయేప్పటికి కూచున్నాడు లెక్కలు చెయ్యటానికి. ఒంటిగంటన్నరదాకా తిప్పలుపడితే ఎనిమిదిలెక్కలు తేలేయి. అన్నంతిని రెండింటికల్లా బడికెళ్ళేడు. మొదటిపీరియడ్ హిస్టరీ. హిస్టరీకి లెక్కలకీ ఒక్కరేమాస్టరుగారు శివుడిక్లాసుకి. హిస్టరీలో మాస్టరుగారువేసిన ప్రశ్నలకు సరైనజవాబులేయిచ్చేడు. మాస్టరుగారు "ఇదేంవింత? శివుడుకూడా చదువుకొచ్చేడే" అన్నారు.

రెండో పీరియడ్ డ్రాయింగు. ఈగంటసేపట్లో చెయ్యవలసిన నాలుగులెక్కలలో కొన్ని కాకపోతే కొన్నైనా చేద్దామనుకున్నాడు. కాని డ్రాయింగుమాస్టరుగారు "లెక్కలు నాపీరియడ్ లో చెయ్యటానికొల్లగా"దన్నారు.

లెక్కలపీరియడ్ ఒచ్చింది. మాస్టరుగారందరిపుస్తకాలు చూశారు. శివుణ్ణి "అన్నీ చెయ్యలేదేం" అని కోప్పడ్డారు. ఆగంటంతా శివుడునుంచునేవున్నాడు. పైగా వెళ్ళేటప్పుడు తనను కలుసుకుని వెళ్ళమన్నారు

మాష్టరుగారు. ఏమంటారో ఆ నేతియంతో గడిపేడు ఆ పీరియడ్ అంతా. ఇంతలో గంటకొట్టేరు. పిల్లలు సంతోషంతో గంతులేస్తూ కలకలలాడుతూ వెళ్ళిపోయారు.

శివుడు మాష్టరుగారినికలుసుకున్నాడు. మాష్టరుగారు బాగా కోప్పడ్డారు. శివుడికి గుడ్లనీళ్ళుతిరిగేయి. చివాట్లు పెట్టటంపూర్తిఅయాక "చెయ్యాల్సినలెక్కలన్నీ చేసి పుస్తకాన్ని నాడెస్కులో పెట్టివెళ్ళు. తాళం చెవ్విబంట్రోతుకివ్వు. నాకుపనుంది వెళ్ళుతున్నా. కలాయించేవా తన్నులే" అన్నారు మాష్టరుగారు.

లెక్కలుపూర్తయేటప్పటికి కారున్నరయింది. పుస్తకం డెస్కులోపెట్టటానికి, ఇదివరకేదాల్లో చాలా పుస్తకాలుండటంచేత పట్టలే. అందుచేత అవన్నీ సర్ది తనపుస్తకానికి చోటుచూపించేడు. ఈసర్దడంలో పుస్తకాల్లోనుంచి చాలాకాగితాలు కిందపడ్డాయి. మళ్ళీ ఆకాగితాలన్నీసరిగ్గాచూసి ఎందులోదందులో పెట్టి తాళంవేసి చెవ్వ బంట్రోతుకిచ్చి ఇంటికెళ్ళిపోయాడు.

## 3

ఎండాకాలం. రాత్రి. పరీక్షలైపోవటంచేత శివుడికి చదువుకోవలిసిందేమీలేదు. అరుబయటపడుకో నియ్యకపోవటాన శివుడు మేడమీద గదిలోపడుకున్నాడు. కిటికీలోంచి తెలివెన్నెల లోపలికి పడుతోంది. శివుడు కిటికీవైపుకి వత్తిగిలిపడుకున్నాడు.

రాత్రిపదింటికైలుకొచ్చేడు శివుడి మామయ్య విశాఖపట్నంనుంచి. శివుడు ఫస్టుగానే ప్యాసయినాడని చెల్లెలువ్రాసిన జాబునుచూచి ఎండాకాలంశెలవలకి శివుణ్ణి విశాఖపట్నం తీసికెడదామనే వుూహతో వచ్చేడు. వస్తూ తనముద్దుమేనల్లుడికొక ఫ్లూటు కొనుక్కొచ్చేడు. రాగానే శివుడు మెలుకువతో వున్నాడేమో ఫ్లూటు నిద్దామని మేడమీదికెళ్ళేడు. శివుడు నిద్రపోతున్నాడని ఫ్లూటుని అతనిపక్కనపెట్టి క్రిందికొచ్చేశాడు.

తెల్లారింది. శివుడికి మామూలుగా ఏడుగంటలకి ఓవల్టైన్ తాగే అలవాటు. ఏడుగంటలుదాటినా కిందికిరాలేఅతను. "ఇంకా లేవలే,ఆవెధవ"అని లేపుకొద్దామని మేడమీదికెళ్ళింది శివుడితల్లి. శివుడు గదిలో కనపడలే. కిందికొచ్చి "శివుణ్ణెక్కడికన్నా పంపేరాయేమిటి? ఓవల్టైనన్నా తాగలేవాడు" అని ఆవిడ అడిగింది తనభర్తని. "లేదే" అన్నాడాయన. ఎక్కడికివెళ్ళివుంటాడా అనేఆలోచనతో బంట్రోతు న్నడిగేరు. వాళ్ళు "మాకు తెలీదండీ"అన్నారు. ఎక్కడికెళ్ళుంటాడబ్బావాడు అని తల్లి, తండ్రి, మామయ్య పిల్లలుఅంతా మేడమీదికెళ్ళేరు. శివుడు గదిలోలేడు, అంతా దిగాలబడిచూస్తున్నారు. మామయ్య పూరికే మంచంవైపుచూస్తున్నాడు. తాను తెచ్చినఫ్లూటు పెట్టింది పెట్టినచోటేవుంది. దానికింద ఒక కాగితం కనిపించింది. దగ్గిరికెళ్ళి చూశాడు. దానిమీద 'మామయ్యకి'అనుంది. లోపల రాసివున్నదాన్ని చూశాడు. 'మీరంతా కోప్పడతారని తెలుసు. ఐనా వెళ్ళుతున్నా. మరిరాను. అందరికీనమస్కారాలు. చెల్లికీ,బ్రహ్మనికీముద్దులు—శివం'—అనుంది. ఏంబోధపడలే ఆయనకి.

## ४

సాయంకాలం. ఆరున్నరైంది. పోలీసువాళ్ళదగ్గర్నించీరాలేదు, రైల్వేవాళ్ళదగ్గర్నించీరాలేదు శివుడి ఆచోకీ. శివుడిమామయ్యకి పిచ్చిపట్టినట్టుంది. ఏంచేస్తాడు? ఏంచెయ్యాలోతోచటంలే. ఇంట్లోంచి బయలు దేరి తనబావగారితో పులవైపు వెళ్ళుతున్నాడు. వెళ్ళుతూనే ఆలోచన నడిచివెళ్ళుంటాడా, రైలుమీద వెళ్ళుంటాడా, వెళ్ళితే ఎక్కడికివెళ్ళుంటాడు, అని ఇట్లా తర్కించుకుంటూవుండగా "మరిరాను" అన్నది జ్ఞాపకంవచ్చింది. మరిరాక ఎక్కడికిపోతాడు? ఎవరికికనపడ్డా మరి రావలిసిందే. ఐతే మరిరానంటే ఇహ ఎవళ్ళకి కనపడడన్నమాట. చచ్చిపోతాడా శివుడు? అంటూ అప్రయత్నంగా కన్నీళ్లు వెల్లువలుగా కార్చే

కాయన. ఇట్లా పరాకుగా పోతూవుంటే ఎంతదూరం నడిచిందీ ఎంతకాలం అయిందీ తెలుస్తుందా మరి. బావగారితోటనుకున్నాడేగాని అదిదాటి మైలున్నరపైగావొచ్చేడు. ఇంతలో పక్షికూతలు వినిపించాయ్. ఎవరో పరుగెత్తినట్టు అలజడిఅయింది. ఈగోలతో తను తనలోకొచ్చేడు. ఏదో నీళ్ళలోపడ్డ శబ్దంఅయింది. శబ్దానుసరించివెళ్ళేడు. పదిగజాలునడిచేటప్పటి కొకదొరువు కనిపించింది. దొరువులో జానెడులోతుకన్నా మించిన నీళ్ళులేవు. అంతా బురదమయం. దొరువును సమీపించేడు. అందులో ఒకకుఱ్ఱాడు కనిపించేడు. తరుముకొచ్చినపక్షులు జ్వాలిగుండెలతో వూరికేనుంచున్నాయి. తనచేతికఱ్ఱతో వికటంగా కేకలేస్తూ వాటిని తరిమాడు. పక్షులు పారిపోయాయి. లోపలికుఱ్ఱాణ్ణి లేవనెత్తి "శివా!" అంటూ ఆవురుమన్నాడు. వెంటనే ఆబురదలో తెలివితప్పిపడివున్న శివుణ్ణి భుజానేసుకుని దడదడగుండెలతో వచ్చినదారినిపట్టేడు. తోటమాలిని లేపి శివుడిబురదగడిగి తన వుత్తరీయంలోచుట్టి ఒకమంచంమీద పడుకోబెట్టేడు. తోటమాలి డాక్టరుకోసం పరుగెత్తేడు. డాక్టరుగారు పావుగంటకల్లావచ్చేరు. ఉచితచికిత్స జరిగించేరు.

తెల్లవారింది. చుట్టూ అమ్మ, నాన్న, మామయ్యఅంతా నుంచున్నారు. వాళ్ళనిచూసి యేడవడం మొదలుపెట్టేడు వెఱ్ఱిగా. మామయ్య వాళ్ళందరినిపంపివేసి శివుణ్ణి బుజ్జగించి యేడవవద్దన్నాడు.

శివుడు ఏడుస్తూనే "కోప్పడకు. నన్ను క్షమించు"అన్నాడు. "ఏంచేశావనీనువ్వు. ఎందుకు కోప్పడ్డం? కాస్సేపుకళ్ళుమూసుకునిపడుకో." "అదిగాదు, మామయ్యా! నన్నుక్షమించు ముందు." "ఆ క్షమించా లే." "ఐతే కోపంలేదన్నమాట నామీద—నాకేం, అఫ్లాటొద్దు." "ఏం? ఎందుకనొద్దూ. చక్కగా నేర్చుకుందువుగాని." "కాదు, మామయ్యా! ముందువిందూ, అంతా తెలుస్తుంది ఎందుకొద్దో." "తరవాత చెప్పుదువుగానిలే ముందుకాస్త ఓవల్ టైన్ తాగు. నిస్త్రాణకడుతుంది." "ముందు విను మామయ్యా! తరవాత తాగుతాను." "ఊ, చెప్పు." "మరేం, అఫస్టుమార్కు నాకురావలసిందికాదు. మాస్టరుగారి డ్రాయరులో హిస్టరీపేపరు కనపడితేను చూశా. అంచేతే నాకన్నిమార్కులొచ్చేయి. లేకపోతే నారాయణంకిరావలిసింది. అతని కందులోనే నాకన్నా రెండుమార్కులు తక్కువొచ్చేయి." "ఈకాస్తకి ఎంతగోలచేశావు. అమాట చెప్పకపోయావు. నేను నారాయణానికే వేయించేవాణ్ణి ఆమార్కు." "మార్కులేకాదు,మామయ్యా! అతని స్కాలర్‌షిప్పుకూడాపోయింది. ఫస్టుప్రైజుకూడా పోయింది. నెఘనప్లాటుకోసం ఎంతపనిచేశాను అనిపించింది. నన్ను సిగ్గూ, దుఃఖం, భయం అన్నీఆవరించి పిచ్చెత్తినట్టయింది ఏంతోచక......" "స్కాలర్‌షిప్పుమాత్రము యెందుకు పోతుందీ హెడ్మాష్టరుగారితోచెప్పితే." "నాకు భయంవేసింది." "ఎందుకూ భయం? ఆయన నింకా నిన్ను మంచివాడివని మెచ్చుకుంటారు." "పోనీ యిప్పుడు చెప్పితే?" "ఇప్పుడు చెప్పితేమట్టుకేం. ఇప్పుడైతే మరీమెచ్చుకుంటారు. నీవుపడ్డ ఆవేదననీ, పశ్చాత్తాపాన్నీచూసి." "ఐతే నువ్వువెళ్ళిచెప్పు, మామయ్యా! హెడ్మాస్టరుగారితో ఈసంగతంతా. ఆయన ఇందులో నేపడుతూన్న యాతన తెలుసుకుంటే బాగుంటుంది. లేక దీన్నిచులకనచేస్తే నాకు వెఱ్ఱో పిచ్చో యెత్తుతుంది." "మరేం భయంలే. ఆయన సంతోషిస్తారు. నువ్వు ఓవల్ టైన్ తాగు. తరవాత అమ్మా, వాళ్ళు ఇంటికి తీసికెడతారు వెళ్ళు." "నాకు ఓవల్ టైనూఒద్దు, ఏమీఒద్దు. నువ్వొచ్చేదాకా నేనింటికెళ్ళను. ఎవరినీ లోపలికి రావద్దను."

మార్కులుపెట్టేక నారాయణానికి ఫస్టుప్రైజు, స్కాలర్‌షిప్పు యిచ్చేరు. సదాశివుడికి 'మంచినడవడికి' అని ఒకమంచి బహుమతీయిచ్చేరు.



చెంచెతల నృత్యము

*Photo by Messrs. M. Doss & Bros., Madras*



గాంధిమహాత్ముడు, ఆతని శిష్యురాలు మీరాబాయి

# కీ. శే. కల్లూరి మాణిక్యాంబ

కల్లూరి వేంకటసుబ్రహ్మణ్య దీక్షితులుగారు

ఆంధ్రవిదుషీమణుల దివ్యచరిత్రమునందు స్థానమాక్రమింపఁగల .యీపతివ్రతామతల్లింగూర్చి యెఱిఁగిన విషయములఁ బ్రకటించుట యాంధ్రుఁడనగు నాకు విధియని నమ్ముచున్నాను. ఈవనితారత్నము గోదావరిమండలమున కోనసీమయని ప్రసిద్ధివడసిన అమలాపురముతాలూకా ముక్కామలయందు వెలనాటిశాఖఁజెందిన సాఁపువేదమువారియింట జన్మించినది. అత్తవారిగ్రామము రెడ్డిపోలవరము. భర్త శేషన్నగారు. ఈతఁడు కాకినాడ కలెక్టరుకచేరియందుద్యోగి. ఇపుడు 'ఓవర్‌సీయర్'గాఁ బనిచేయుచున్నాఁడు.

శాంతము, వినయము, సహిష్ణుత, ఈశ్వరచింతనము, విద్యాసక్తి యనునుత్తమలక్షణము లీమెచరిత్రమునకు ముఖ్యాలంకారములు. భర్తయెడఁగల యానుకూల్యము, అత్తమామలయెడలఁ జూపుభక్తివిశ్వాసములు, తోఁటికోడండ్రయెడఁజూపు సోదరీభావము, బంధువులయెడఁజూపు మర్యాద, అనుచరవర్గమునెడఁ గనఁబరచుదాక్షిణ్యము నీమెకు స్వభావసిద్ధములైన లక్షణములు. ఈసుగుణమణినడవడి స్త్రీసామాన్యమున కాదర్శమై యొప్పెననుటలో నావంతయు సందియములేదు. ఈమె భర్తతోఁ గాకినాడలోఁ గాపురముచేయుచు నీమె యార్జించినవిద్య ప్రశంసాపాత్రమైనది. గృహకృత్యములనెట్లో త్వరగా నిర్వహించి తనయమూల్యమగు కాలమును విద్యావ్యాసంగమునకు వినియోగించుచుండెడిది. నిరంతరము భాగవతాదిపవిత్రగ్రంథములం జదువుచు భక్తిపరవశయై యుండెడిది. రానురాను సంస్కృతగ్రంథములందలి సారస్యము గ్రహించుటకుఁదగినశక్తి యెట్లులభించునాయని తలపోయఁదొడఁగినది. ఎట్లో సంస్కృతమెఱిఁగిన వనితారత్నమొకతె యీమెకోరికఁదీర్ప సమర్థురాలయ్యెను. ఆమెకడ కావ్యపఠనమున కారంభించినది. స్వయంకృషివలన స్వల్పకాలములోనే యమితమగు భాషాజ్ఞాన మలవరచుకొనఁగలిగెను. నిరంతరగ్రంథపఠనమునందే తనకాలమును వినియోగించుచు భక్తిరసపారవశ్యమున లీనురాలైయున్నపుడీమెకొన్ని మనోహరగేయములంగూడ రచించుట కారంభించినది. అభ్యాసావస్థంగడచి యీమెరచనము మృదుమధురమై యలరారుచుండెడిది. ఈమె కవిత్వరచనమున కీమెనేర్చిన సంస్కృతభాషాజ్ఞానము చక్కని మెఱుఁగుఁగూర్పఁగలిగెను. క్రమముగా పద్యకవితయందుఁగూడ కృషిచేయవలెనని చాలయువ్విళ్ళూరుచుండెడిది. స్త్రీలకు సంస్కృతాంధ్రసాహిత్యగ్రంథముల బోధించి భక్తి, జ్ఞానవైరాగ్యములను, సర్వధర్మములను జేకూర్చుటవసరమని నిరంతరము నీమె గోరుచుండెడిది. సాంఘికస్త్రీవిద్యాసంస్థల యభివృద్ధింగూర్చి యీమెగావించిన చర్చలు మిగుల మనోహరములని విందును. స్త్రీవిద్యాభ్యాసము సక్రమపద్ధతిలో నేఁడు లేదనియు, నిదిమార్పుచేసి పవిత్రతను జేకూర్పఁగల నీతిబోధకగ్రంథములను, భక్తినిజేకూర్చుగ్రంథములను స్త్రీలకు

నేర్పుట కాధునికవిద్యావిధానమును సంస్కరింపవలసియున్నదని యీమెచూపిననిర్ణయము నిరుపమానమైనది. ఈమె యుదారాశయములు, నీమె మృదుమధురకవితాంకురములు, నీమెభక్తిరసబంధురానుభావములనుగాంచి యాంధ్రనారీమణులానందించు మహాభాగ్యము పూర్తికాకుండఁగనే యీమె స్వర్గస్థురాలగుట విషాదజనకమైన విషయము. ఈమె జీవించియే యున్నచో నీమెయందు నెలకొనిన జాతీయభావములు క్రమాభివృద్ధినొంది యెట్టి పరిణామమందెడివో, యెట్టిమహత్తరసాంఘికకార్యములు చేయఁగలిగెడివో, యీమె చరిత్రము విదుషీమణులచరిత్రమునందెట్టి స్థానమాక్రమింపఁగలిగియుండెడివో తెలియదుకదా! భర్తను, బంధుగులను దుఃఖసాగరమున ముంచి రెండేండ్లవయసుగలకుమారునిబాసి యిరువదియైదు సంవత్సరములు నిండకమునుపే స్వర్లోకము నలంకరించిన యీపరమసాధ్వి మరణమాంధ్ర వనితాలోకమునకు తీరనినష్టముఁగూర్చె ననుటలో సందియము లేదు. భూమిపై తనకీర్తి యాచంద్రార్కస్థాయియగుటకు స్వయముగనే యీమె కొంతమార్గము నిర్ణయించుకొనక పోలేదు. ఈమె కొన్ని గేయములు రచియించినది. భక్తిరసభావబంధురములగు నీగీతము లీమె యాంతరంగికభక్తికి సాక్ష్యములిచ్చుచున్నవి. ఈపాటల నామెభర్త కడనుండఁగా నేను సేకరించి పరిష్కరించితిని. వానింద్వరలోఁ బ్రకటించుచున్నాఁడను. ఇందుమూలమున శ్రీమాణిక్యాంబగారి యాత్మకు శాంతి చేకూరునుగాక!

## భారతనారి

శ్రీమతి పైడిమర్రి సీతాదేవిగారు

౧

పూతమైన యీభారతభూమియందు
భావపూరితమైనట్టి భరతనారి
ప్రబలమౌ యహింసావేశప్రతిభతోడ
శాంతిసంగ్రామమార్గంబుచక్కఁజేసి
నేఁడుగాకన్పట్టె నిజేచ్ఛ నింపుమీర.

౨

దీనయైయేడ్చుచున్నది దేశమాత
కానరోయమ్మ యాపెదాకష్టచరిత?
రాట్నలక్ష్మినిసేవించి రమణనొప్పి
ముదముఁగూర్చుఁడయామెకు ముదితలార?

౩

లలిలాతవణ్యహృందయంబులవిగో! కనుడు
నెమకుచున్నవి యకలంకసమతకొరకు;
బాధ్యతాయుతప్రభుత్వబాసలందు (?)
యువిదస్వాతంత్ర్యవాంఛలు యుద్భవిల్లు.

౪

అంటరానితనమునంత మంటకలపి
'పరద' పద్ధతినొమ్మొదలంట నరకివైచి
హిందుమహాలానుసఖ్యంబుపదిలపరచి
నారి! గాంధిదేవునాజ్ఞ నందుకొనుము.

౫

భారతభూమికి స్వాతంత్ర్యభానుఁడదుగో
స్వచ్ఛమహాదివ్యకమలంపు స్వేచ్ఛతోడ!
భారతీ! భవ్యభవదీయభావిచరిత
మెంతొసౌఖ్యప్రదాయియై మెఱయుచుండు.

# దానిమ్మ

డాక్టర్ యస్. శేషగిరి రావు గారు యల్. ఐ. యమ్.

దానిమ్మమానుచెక్క, వేరుచెక్క, ఆకు, మొగ్గ, పువ్వు, లేతకాయ, ముదురుకాయ, తొక్క వీటి రసము, చూర్ణము, లేక కషాయము వగరుగనుండును; బిగతీయును; గ్రహణి, రక్తగ్రహణి, నీళ్లవిరేచనములు వీటినికట్టును. దానిమ్మఆకురసము లేక లేతకాయలరసము గ్రహణిని, రక్తగ్రహణినికట్టును. పువ్వులరసము లేక లేతఆకులరసము 3, 4 చుక్కలు ముక్కులోపోసిన ముక్కునెంట రక్తముపడుటకట్టును. రెండుతులముల సీసములో 10 దానిమ్మపండ్లరసముపోసి తయారుచేయబడినకాటుక పశునేత్రచికిత్సలకు వాడబడుచున్నది. గ్రహణికి దానిమ్మగింజలరసముతీసి దానిలో పంచదారకలిపి పానకము తయారుచేసికొని ¼ తులము మొదలు 1 తులమువఱకు పానకము నీటితో పుచ్చుకొనేది. దానిమ్మపువ్వురసముగాని, దానిమ్మచిగురురసముగాని ముక్కులోపోసిన పీనసవ్యాధులు నశించును. ఆమాజీర్ణమునందు దానిమ్మ నిత్యమును సేవించదగునని యును; మలబంధము, గుదరోగములయందు వాడదగునని యును భావప్రకాశికయందు చెప్పబడినది. లేతదానిమ్మకాయలుగాని, లేతదానిమ్మఆకులుగాని వల్లమందులో కలిపిచేయబడిన పుటపాకము తగుమోతాదులలో రక్తగ్రహణి, అతిసారములందీయబడుచున్నది. పుటపాకమేగాక కాయలులేక ఆకులస్వరసముకూడ తేనెతో కలిపి తగుమోతాదులలో ఈయబడును. రక్తాతిసారమునందు దానిమ్మమారేడుపట్టలు, కొడిశపాలపట్ట వీటికి ఎనిమిదింతలునీరుపోసి ఒకభాగమున కషాయముకాచి పుడిసెడు తేనెతో త్రాగిన ఉల్బణమైనను (అనగా తీవ్రమైనను) రక్తాతిసారమునశించును.

## దాడిమాదిచూర్ణము

దానిమ్మ 2 పలములు; బెల్లము 8 పలములు; శొంఠి, పిప్పలి, మిరియాలు ఇవి ప్రత్యేకొ మొక్కొక్క పలము వీటినన్నిటిని యేకముచేసి చక్కగచూర్ణముచేసిన యది దాడిమాదిచూర్ణమనబడును. దాని సేవనవలన రుచి, అగ్నిదీపనము కలుగును. కంఠస్వరమును చక్కగజేయును. పీనసలు, శ్వాసకాసము హరించును. (అష్టాంగహృదయము)

## దాడిమాదిఘృతము

దానిమ్మపండురసము 2 భాగములు, ఆవునెయ్యి 1 భాగము వీటిని యొకటిగజేర్చి అందులో త్రికటుక కల్కముకలిపి ఘృతపాకవిధిగ పక్వముజేసి, యాఘృతములో యవక్షారముకలిపి కాసరోగికి భోజనానంతరము పానముచేయించవలయును. (అష్టాంగహృదయము)

## దాడిమాష్టకచూర్ణము

తవక్షీరి, చాతుర్జాతములు ఇవి ప్రత్యేక మొక్కొక్కకర్షము; వోమము, ధనియాలు, జీలకఱ్ఱ యివి ప్రత్యేకము 3 కర్షములు; మోడి-త్రికటుకములు యివి ప్రత్యేక మొక్కొక్కపలము, దానిమ్మపండు 8 పలములు, పంచదార 8 పలములు యిటుల వీటినన్నిటి నొక్కటిగకలిపి చక్కగ చూర్ణముచేసిన యది దాడిమాష్టకచూర్ణమనబడును. దోషావ్యవస్థానుగుణముగ పేయ, ఖలము మొదలగువానిలో నీచూర్ణముకలిపి వాతాతిసారరోగులకు పానముజేయించిన హితముకలుగును. (అష్టాంగహృదయము)

## దాడిమాదిఘృతము

దానిమ్మవిత్తులు, వాయువిడంగములు, పసుపు, చవ్యము, జీలకఱ్ఱ, త్రిఫలములు, సొంటి, పిప్పళ్లు, పెద్ద పల్లేరువిత్తులు, ఓమము, ధనియాలు, చింతపండు, మోడి, రేగుపండు, సైంధవలవణము వీటిని దినుసుకు కర్ష

ప్రమాణముచొప్పున గ్రహించి చక్కగనూరి కల్కముజేసి అందులో ఒక ప్రస్థము ఆవునెయ్యి కలిపి ఘృతపాక విధిగ పక్వముచేసి సర్వఋతువులయందును ప్రత్యేకముగ పానముచేసినను లేక అన్నములోకలిపి భుజించినను 20 విధములయిన ప్రమేహరోగములు, మూత్రాఘాతము, అశ్మరీరోగము, దారుణమైనమూత్రకృచ్ఛ్రరోగము, నానావిధములైన ఉదరశూలలు, కామలజ్వరము హరించును. ఇది అశ్వినీదేవతలచే నిర్మించబడిన దాడిమాది ఘృతము. ప్రమేహరోగములకు ముఖ్యమైనది. (వైద్యరత్నాకరము)

సీ. దానిమ్మవిత్తులు ధనియాలునొక్కొక్కపలములుగా నర్ధపలము చిత్ర
కమునుపిప్పళులునార్ద్రికము నర్ధపలము లెక్కనుగూర్చిజలమాఢకంబుబోసి
పరగనావులనెయ్యి పలములిర్వదిజేర్చి ఘృతపాకమునవండి ఘృతమునదించు
గాళోసియదియు నిక్కముగచట్టినమంచి ధాన్యపురంబిడి దానితీసి

గీ. పూటకరచేతిగుంటెడు బుచ్చుకొనిన
పాండువుల్ క్షయకాసలు పారవెళ్లు
శ్వాసరోగంబులెల్లను సమసిపోవు
వితతసౌఖ్యంబు దాడిమఘృతవరంబు.

(శరభరాజీయం)

## మోతాదు

దాడిమసారము: చూర్ణము 20 మొదలు 60 గోధుమగింజల యెత్తుచొప్పున దినమునకు 2 పూటలనివ్వనగును. దానిమ్మచెట్టు రసముయొక్క మోతాదు పూటకు 1½ మొదలు 2 తులములయెత్తువరకు. కషాయపు మోతాదు 2, 3 తులములయెత్తు. చూర్ణపుమోతాదు 30 మొదలు 60 గోధుమగింజల యెత్తువరకు. తియ్యనిదిగాని పుల్లనిదిగాని అయిన పండురసము సమభాగమగు నీటిలోకలిపి ఎనిమిదిలేక పదిఔన్సులు వాడవగును.

శుద్ధులయందును దానిమ్మ ఉపయోగముకలదు. రసకమునుకాల్చి దానిమ్మపండ్లరసమున ఏడుమారులు ముంచిన దోషములుపోసి పచ్చనివర్ణములు గలవియగును. ఔషధసేవాకాలమున పులుపువర్జింపవలసినపుడు కూడ దాడిమపులుపును, ఉసిరికపులుపును చేకొనవగును. నిషిద్ధముకాదు. ఆయుర్వేదమతముప్రకారము పులుపులలో దాడిమ అతిశ్రేష్ఠమైనది, నిరపాయకరమైనది, అపథ్యముకానిది. దానిమ్మయందు ప్రొటీనులు 4. 2, కొవ్వుపదార్థములు 18. 4, లోహపదార్థములు 0-6, జలపదార్థములు 76. 8, కాలరీసు 460 గలవు.

తియ్యదానిమ్మ త్రిదోషహరమైనది. రుచికరమైనది. తేలికయైనది. కొంచము వగరుగలది. ఉపశమనకారి. దాహమునుకట్టును. తీపు పులుపుకలిసిన దానిమ్మ జీర్ణశక్తిని పెంపొందించును. రుచికరమైనది. తేలికయైనది. కొంతవఱకు పిత్తమును తారుమారుజేయును. పుల్లనిది వాయువును కఫమును అణచును. పిత్తమును తారుమారుచేయును. దానిమ్మపండురసము మద్యరసముకంటె నాలుగురెట్లు పుష్టికరమైనది. దేహమున త్వరగవ్యాపించును. అందలి కార్బొహైడ్రేటు వెనువెంటనే పంచదారగ పరిణమించును. అందు హెచ్చుగ ఫాస్ఫేటులుఉండుటచే జ్వరములందు దీనిసేవనముమంచిది. తీపిదానిమ్మయందు 0-93 ప్రొటీడ్లు, 7-5 కార్బొహైడ్రేటుగలవు. పుల్లదానిమ్మయందు 0-61 ప్రొటీడ్లు; 6-5 కార్బొహైడ్రేటు గలవు. మధ్యజ్వరమున (ఉండుకాలము 11 రోజులపర్యంతము) దానిమ్మ ఈయవచ్చును. గ్రహణిభేదుల అనంతరము స్వాస్థ్యముకలుగుటకు ఈయబడు ఆహారములో తియ్యదానిమ్మయు, పుల్లదానిమ్మయు చేర్చబడుచున్నవి.



## మోరిస్ కళాశాలలో స్త్రీ ప్రొఫెసరు:—

"నాగపురమునందలి మోరిస్‌కళాశాలలో శ్రీమతి కుసుమావతీదేశపాండ్యాసతిని ఆంగ్లభాషాధ్యాపకురాలుగ నియమించి మధ్యమాగాణముల ప్రభుత్వమువారు సరియైనపని యొనర్చిరి. మధ్యమాగాణములందలి ఈకళాశాలయు, మఱికొన్ని ఇతరకళాశాలలును పురుషులతోబాటు స్త్రీలనుగూడ చేర్చుకొనుచున్నవి. సంయుక్తవిద్యాపద్ధతి నవలంబించు ఇట్టికళాశాలలన్నిటియందును కొందఱు అధ్యాపకురాండ్రుండుట న్యాయము. కలకత్తావిశ్వవిద్యాలయమునకు చెందిన పోస్టుగ్రాడ్యుయేటు తరగతులలో కొందరు విద్యార్థినులుగలరు. కీ.శే. రజనాగుహాకన్య పెక్కువత్సరములకుపూర్వము ఆంగ్లమున అధ్యాపకురాలుగ ఈతరగతులకు నియమింపబడెను. కాని ఇప్పుడు కలకత్తావిశ్వవిద్యాలయమున ఒక్కహిందూస్త్రీప్రొఫెసరైనను లేదు. కలకత్తాయందును, బెంగాలురాష్ట్రమున ఇతరపట్టణములందును గల పురుషులకళాశాలలలో పెక్కింటియందు స్త్రీలుకూడ చేర్చుకొనబడుచున్నారు. టాగూరుగారి శాంతినికేతనమునకు చెందిన విశ్వభారతియొక్క పాఠశాలశాఖయందును, కళాశాలశాఖయందును దినములుగ సంయుక్తవిద్యగలదు. అచ్చటి కళాశాలలో సంస్కృతబోధకు కొంతకాలము ఒకఅధ్యాపకురాలుండునది. కలకత్తాలో విద్యాసాగరకళాశాలలో స్త్రీపురుషులకు పాఠములు ప్రత్యేకముగ చెప్పబడును; ఆకళాశాల వైసుప్రిన్సిపాలు స్త్రీ; విద్యార్థినులకు ఆమె బోధించును. మాకు తెలిసినంతవఱకు ఇంతకుమించి బెంగాలునందలి ఏపురుషుల కళాశాలయందును స్త్రీ అధ్యాపకురాలుగ లేదు."

—*The Modern Review.*

## మద్రాసు క్వీన్ మేరీకళాశాల:—

"మద్రాసు క్వీన్ మేరీకళాశాలలోని విద్యార్థినులసంఖ్య ఆయేటికాయేడు పెరుగుచున్నది. 1931-వ సంవత్సరము మార్చి 31-వ తేదీ నాటికి ఈకళాశాలయందలి విద్యార్థినులసంఖ్య 186. జూలైమాసమున ఈసంఖ్య ఇంకను పెరిగెను. ఈకళాశాల స్థాపింపబడిననాటినుండియు తఱుచుమారకుండ ఒక్కరేప్రిన్సిపాలుగ నుండుట గమనింపదగిన విషయము. ప్రిన్సిపాలగు డిలా హేకన్యగారు కళాశాలలో విద్యావిధానమున కఠినతర నియమముల నవలంబించుదురు. క్లాసుపరీక్షలఫలితములుగూడ కఠినము. అగుట అందలి విద్యార్థినులు విశ్వవిద్యాలపు పరీక్షలయందు బాగుగ జయములనొందిరి. పలువురు గొప్పగౌరవములబడసిరి. ఈతగొట్టుటకు వీలగు స్నానకోట్టము నిర్మించుట; బి. యే.తరగతిలో భారతసంగీతపాఠముల నేర్పఱుచుట ఈవత్సరమున జరిగిన ముఖ్యమగు ఏర్పాటులు."

—*The Educational Review.*

### ఈగలను ఇంటిలోనికి రాకుండ చేయుటకు:—

"ఈగలను ఇంటిలోనికి రాకుండ చేయుటకు ఒకచక్కని క్రియగలదు. పరిశుభ్రమైన స్పాంజి (Sponge: సముద్రపుపాచి) కొంచము గ్రహింపుము. సలసలకాగుచున్న నీళ్ళలో ముంచితీయుము. ఒకపళ్లెమునముంచుము. దానిపై లవండరునూనెబొట్లు కొన్ని చిలకరించుము. రోజుకు స్పాంజిని రెండుమూడుతడవలు తడిచేయు చుండిన చాలును. ఆస్పాంజినుండి జనియించువాసన సరిపడకుండుటచే ఈగలు దానిచుట్టుపట్లకు రాకుండును."

—*Popular Chemistry.*

### మద్రాసులో పాలసరఫరా:—

"అనుమతులు పొందలగు వానికి కంట్రాక్టరులు పాలుసప్లయిచేయుదురు. మద్రాసున పాలుసప్లయి చేయు సంస్థ సహకారసంఘ (**Cooperative Union**) మొక్కటియే. ఆసంఘమువారు ప్రస్తుతము ప్రజలకంతకువలయు పాలను సరఫరా చేయుటలేదు; చేయలేరుకూడ. అగుట పాలసప్లయి వ్యక్తులమీదనిలచియున్నది. ఒకటిరెండు ఆవులు, ఒకటిరెండు గేదలతో వ్యక్తులు పాలు సరఫరాచేయుచున్నారు. ఈపశువులుఉండు స్థలములను గూర్చియు, వానిపోషణమునుగూర్చియు పలువురకు తెలియును. ఈపశువుల కొట్టములు—అసలట్టివియుం డుచో—ఒకటిరెండుతావులతప్ప చాల అనారోగ్యకరములుగనున్నవి. ఇట్టికొట్టములందు పేడ పర్వతముల వలె పడియుండుట మీరుచూచియుందురు. పాయిఖానాపెరళ్లకు మిక్కిలి సమీపమున ఈకొట్టములుండుట సర్వసాధారణము. ఈకొట్టములందలి ఒకభాగము పాకీదొడ్డిక్రింద ఉపయోగింపబడుటయుగలదు. ఈమాత్రపు కొట్టములనైన గలిగియుండజాలని పాలవాండ్రు పశువులను వీధులలోనే కట్టుదురు. మద్రాసు వీధులెంత అపరిశుభ్రముగనుండునో తెలిసినవిషయమే. కొట్టములందుగాని, పాలుగొనువారియిండ్లముందుగాని పాలు పితుకుదురు. ఇట్టి పరిస్థితులలో ఈపట్టణమున శుభ్రమైనపాలెట్లు దొరకును? ఉపయోగింపబడుటకుముందు పాలు కాచబడెడుమాట సత్యమే. అయిననేమి? క్షయ మొదలగు రోగములకు ఈపట్టణమున అపరిశుభ్రమైన పాలొకకారణము. పశువులకుకూడ రోగములుండుట సహజము కావున నిత్యము ఒకేపశువుదగ్గర పాలను కొనుటకంటె సాధ్యమైనంత తఱచుగ మార్చుచుండుట మంచిది."

—*S. Murari, B. Sc. (Oxon) F.L.S.*

### అవమానకరమగు సోదా:—

"దాసీలవిషయమై యిటీవల వెంకటగిరిసంస్థానమునందు మరియొక శాసనమేర్పడెనట. దాసీలు తమ చాకిరినంతయు దీర్చుకొని అంతఃపురమునుండి వెలుపలికివచ్చునపుడు తామేమియు నపహరించి తమ వస్త్రములలో దాచుకొని రాలేదన్నట్లుగా కావలియుండు సిపాయీలకు చూపిరావలయునట. ఏనాలుగు వత్సరములనాడో యొసంగబడిన సంపూర్ణజీర్ణవస్త్రములను ధరించుకొన్న ఈసిపాయీలు తమ దురవస్థకొరకే వేళయు చింతించుచు నిట్టిఉత్తరవులను నెరవేర్చవలయునన్న వారికే తలవంపులుగానున్నది. ఇంతకన్న ఈదాసీలకు అపకీర్తి వేరుకలదా? ఈ అవమానమును తమ బంధువులగు దాసులు మాత్రము పాల్గొనుటలేదా? వృత్తియా సేవాశ్వవృత్తి; జీవనమా పడుపువృత్తి. వీటికితోడు ఈఅపయశము ననుభవించు కర్మప్రాప్తించినపుడు జమీందారులసేవయందట్టిలాభము, సౌఖ్యము, గౌరవమును పొందుచున్నామను నమ్మకముతో తమజీవితమును వృథాపరచుకొనుచున్నారో గ్రాహ్యముగాకయున్నది."

—జమీందారీ రైతు.

### గంగాదేవి చేసిన కవిస్తుతి:—

"దసరాసంచికయందు శ్రీమతి నాగలింగం సరళాదేవిగారు "గంగాదేవి: మధురావిజయము"నుగూర్చి వ్రాసినవిమర్శ ఆయమగారి గ్రంథపరిచయమై శారద్యమును ప్రకటించుచున్నది. అందు గంగాదేవిస్మరించిన

పూర్వకవి ప్రశంసజేయుచు "తిక్కయకవి యెవఁడో తెలియవచ్చుటలేదు" అని వ్రాయబడియున్నది. ఈయన యుభయకవిమిత్రుఁడును, కవిబ్రహ్మయునగు మన తిక్కనసోమయాజియె. 1917-వ సంవత్సరపు జూలై నెలలో నెల్లూరునఁ జరిగిన ఐదవయాంధ్రమహాజనసభాసందర్భమున ఆంధ్రులగొప్పతనమునుగూర్చి ప్రసంగింపవలసిన యవకాశము నాకుకలిగి అప్పటివ్యాసమున నీగంగాదేవి ప్రశంసచేయుచు మధురావిజయమును బురస్కరించుకొని

"తిక్కయజ్వకవే స్సూక్తిః కౌముదీవకళానిధేః। సతృష్ణైః కవిభిస్స్వైరం చకోరైరివ సేవ్యతే"

తిక్కనసోమయాజి ప్రస్తావనముగల శ్లోకము గ్రంథమునుండి యుదాహరించితిని. ఈ వాదు శ్రీమతి సరళాదేవిగారికికలిగినసందియము నాదు నాగరాక్షరములయచ్చువలన నాకునుకలిగినది. సంస్కృతమున సలక్షణముగ కావ్యమును రచింపగలిగినయామె "తిక్కయః" అను ప్రథమైకవచనమునకు పాల్పడి దానిపై షష్ఠీవిభక్తిప్రత్యయముంచేర్చి "తిక్కయస్య" అని వ్రాసియుండునాయని పర్యాలోచనచేయగ "తిక్కయజ్వ" యనియె యుండవచ్చునని నిర్ణయించుకొంటిని. ఈమార్పువలన శ్లోకమునకు ఛందోభంగములేదు. మహాకవితోటి నైక్యమేర్పడుచున్నది. 1923 సంవత్సరము ఫిబ్రవరిమాసమున గృహలక్ష్మీపత్రికాముఖమున "తెలుగుస్త్రీకవులు" అను పేర వ్రాసినవ్యాసమున గంగాదేవి నామోచ్చారణజేసియుంటిని. ఇపుడు శ్రీమతిగారు చర్చించివ్రాసినవ్యాసమెంతయు పాండిత్యమై విశేషాంశములచే విరాజిల్లుచున్నది."—ఒంగోలు వేంకటరంగయ్య బి.యే.; బి.యల్.

స్వీడను రాకుమారుని నిజమైన ప్రేమ:—

"స్వీడనుదేశపు యువరాజగు లియొనార్డురాకొమారు డొకసామాన్యవర్తకునిపుత్రికను వరించెను. ఆమెపేరు కరినానిస్వందెత. స్వీడను పరిపాలకుడగు గస్టావురాజచంద్రుడు తనయునిపనికెంతయు కోపించెను. అతనిని భావిరాజుగ గాకుండగ సింహాసనభ్రష్టునిగ నొనరింతునని బెదిరించెను. రాజవంశమునుండి వెలివేతుననియెను. మహారాజకుమారునకు సామాన్యులతోడి సంబంధమెంతమాత్రము పనికిరాదని వాదించెను. కాని పురుషాగ్రగణ్యుడగు లియొనార్డు రాకొమారుడు సంపదలకాశపడలేదు రాజమర్యాదలకలరలేదు. పదభ్రష్టత్వమునకు తొణకలేదు. తాను ప్రేమించిన కాంతకొరకై సర్వస్వముత్యజించి యాలలనను జేపట్టి ధన్యుడైనాడు. కరినానిస్వందితా! నీవెంతయు ధన్యురాలవు. అట్టిపురుషుడు కేవలము దైవస్వరూపుడే. ఇట్టివారలే ఆదర్శపురుషులనబరగెదరు."
—పులవర్తి కమలావతీదేవి.

చెత్తకాగితముల ఉపయోగము:—

"చెత్తకాగితములను మెంతులను నీళ్లలోనానబెట్టి రాతిరుబ్బురోటవేసి మెత్తగారుబ్బవలెను. జిగి, చిక్కదనముగలుగువఱకు రుబ్బి ఈపిండిని ఏఆకారముగల పాత్రపైవేసిన ఆపాత్ర ఆకారముగల గట్టికాగితపు బుట్టతయారగును. ఆపిండి యెండి గట్టిపడి డొల్లవలె పాత్రకంటుకొనక సులభముగ ఊడివచ్చును. ఇట్టి కాగితపుపాత్రలు, పళ్లెములు మనస్త్రీలు శ్రద్ధవహించినచో చెత్తకాగితములనుండి చేయగల్గుదురు. స్కాట్లండులో ఎడింబరోపట్టణమున చెత్తకాగితములతో యంత్రములందు చక్కని పళ్లెములు, చిన్నగిన్నెలు, గ్లాసులు మొదలైనవి తయారుచేయుచున్నారు. ఈపాత్రలు నునుపుచేసి వార్నిష్‌వేయగా చూచుటకెంతో మనోజ్ఞముగ నుండును. లండనులో స్త్రీపురుషులదుస్తులమాదిరులను ప్రదర్శించుశాలలలో ఈచెత్తకాగితములపిండితో చేయబడిన మాదిరులే ప్రదర్శింపఁబడును. చైనా, జపానుదేశములవారీచెత్తకాగితముల పిండితో ననేకములగు వస్తువులను తయారుచేయుచున్నారు. అవి యెక్కువమన్నికగలవిగాను, నీరింకనివిగను, దహింపబడనివిగాను (Fire-proof), అలంకరణములుగానునుండును. ఇవి క్రిందపడినను సులభముగ పగిలిపోవు. ఇట్టిచిన్న కుటీరపరిశ్రమలు మనదేశీయస్త్రీలు చేపట్టి దేశీయపరిశ్రమములకు ప్రాపుకల్గింతురుగాక."—టేకుమళ్ల వెంకాజీ బి.యే.




**మొసలిమాంసము అంటురోగమునకు కారణమయ్యెను:—**

బొంబాయిరాష్ట్రమునకు చెందిన బోర్విలిఅడవియందు ఇరువురు మొసలిమాంసముతినిరి. వారి కొకవిచిత్ర రోగముతగిలి వెంటనే మరణించిరి. ఈరోగము అంటురోగమై కొద్దిరోజులలో ఏబదిమందిని కబళించెను. దీనికిభయపడి ఆఅడవియందలివారు ఆచోటు బాసిపోవుచున్నారు.

**విడాకుకిదియొక కారణము:—**

లాఏంజిలుకుచెందిన కెన్సలీజాఅను ఇరువదియేడుసంవత్సరములవాడు ఒక సినిమానటకుడు; అతని భార్య నట్టువరాలు. ఆమెకు వేదాంతము, చిత్రలేఖనము అభిమానవిద్యలు. ఆమెకు ఈవిద్యలయందుగల అభిమానమునుగూర్చి అతడు అధిక్షేపించెను. ఈఅధిక్షేపమునకు అలిగి ఆయిల్లాలు అతనినుండివిడాకుకొఱకు కోర్టులో దావా దాఖలుచేసెను.

**92 ఏండ్ల ముసలమ్మకు 3-వసారి దంతములువచ్చుట:—**

జర్మనీదేశమున హాలేస్టీన్ మండలమునకు చెందిన ఓల్డెన్‌బర్గ్‌నందు నివసించుచున్న కేథరైన్ రీమర్సుసతికి 1926-వ సంవత్సరమునకు 92 ఏండ్లవయస్సు. ఆమెకప్పుడు—ఆమె జీవితకాలములో మూడవ సారి—తిరిగి దంతములు మొలచెను. అయితే ఇవి చిరకాలముండలేదు. తొలుతవచ్చు పాలపళ్లు అయిదారు సంవత్సరములుండును. కాని ఇవి ఒక్కసంవత్సరముమాత్రముండి ఊడిపోయెను.

**జర్మనీలో జన్మనిరోధము:—**

మహాయుద్ధమునకుపూర్వము జర్మనుకుటుంబములందు సగటున నలుగురుపిల్లలు ఉండుచుండిరి. ఇప్పుడు ఇద్దరకుకూడ కొదవగాఉన్నది. యుద్ధముజరిగినవెంటనే అయిన వివాహములలో నూటికి నలుబదిమందికు నిస్సంతానములుగఉన్నవి; ఇటీవలజరిగిన వివాహములలో నూటికి అఱువదిమందికు నిస్సంతానములుగఉన్నవి. ఈకారణమున ఒక అర్ధశతాబ్దిలో జర్మనీజనాభా 45,000,000 లకు తగ్గునని అచ్చటి రాజ్యాంగవేత్తలు భయపడుచున్నారు.

**చనిపోయినశిశువు మరలజీవించుట:—**

సైజాముఇలాకా ఖరుఖునగరమునకు ఐదాఱుమైళ్లదూరములోనున్న ఒకకుగ్రామములో నొకస్త్రీకి ఇరువురుఆడపిల్లలు ఒకేసారిపుట్టిరి. అందు మొదటిబిడ్డ పుట్టిన మూడుదినములకును, రెండవశిశువుపుట్టిన ఏడు

దినములకును మరణించెను. రెండవశిశువును తీసుకొనివచ్చి మట్టిలోపూడ్చి నక్కలు మట్టిని పెకలించకుండుటకై పైన బండలు వేయుసమయమున ఆశిశువు రోదనధ్వని వినవచ్చెను. అంత వారు తిరిగిగోతిని త్రవ్విచూడగా శిశువు జీవముతో ఏడ్చుచుండెను. పిల్లకుబదులు ఒకకోడి నాగోతిలోపూడ్చి శిశువును తల్లిదండ్రులు తెచ్చుకొనిరి. ఇప్పుడా శిశువు క్షేమముగనున్నది. —గోలకొండపత్రిక.

### ఒకే కాన్పున ముగ్గురు బిడ్డలు:—

ఏలూరులోనున్న తంగెలమూడియందు ఒక స్త్రీకి రెండుసంవత్సరముల క్రింద మొదటికాన్పులో నిద్దరు మొగపిల్లలు పుట్టిరి. ఇంతవరకూ ఆయిద్దరుపిల్లలు క్షేమముగా నేయున్నారు. మరల అక్టోబరు 10-వ తేదీనాడు ఆ స్త్రీ ప్రసవించినది. మొదటిసారి ఆడశిశువును ప్రసవించినది. అరగంటసేపయినతరువాత మొగశిశువును ప్రసవించినది. మరల వెంటనే మరియొక ఆడశిశువును ప్రసవించినది. తల్లియు, పిల్లలు ఇంతవరకు క్షేమముగానే యున్నారు. చుట్టుప్రక్కలనుండి జనులువచ్చి ఈవింతను చూచుచున్నారు. —వై. వి. రామచంద్రరావు.

### చీమలు:—

ఆరుకాళ్ల పురుగులన్నిటిలోను చీమలు ఎక్కువ తెలివిగలవి. వీటికి మెదడు పెద్దదిగనుండును. చీమలు రెండువిధములు. ఎఱ్ఱచీమలు, నల్లచీమలు. మనుజులవలెనే ఎఱుపునలుపు వివక్షత, అసూయత (Colour hatred) వీటియందుగూడా కలదు. ఎఱ్ఱచీమలు నల్లచీమలను తమసేవకులవలె జూచును. ఎఱ్ఱచీమలు సేనలతోపోయి నల్లచీమల జయించి వాటినిపట్టుకొని తమసేవకులుగా నియమించుకొనును. నల్లచీమలు వాటియజమానులకు గూడ్లుకట్టి ఆహారమునువెతికి తెచ్చుచుండెను. టెక్సాస్ (Tekas)లో వ్యవసాయపుచీమలుగలవు. ఇవితమ గృహచుట్టుమండు ప్రదేశమును శుభ్రపరచి ఒకవిధమైనగడ్డిని మాత్రమే పెరుగునట్లుజేయును. ఆగడ్డికోతకు రాగానే తమడెక్కలతో గడ్డివిత్తనములను తెంపి శీతాకాలమున ఆహారము నిమిత్తము జాగ్రత్తపరచును. విత్తనములు మక్కిపోకుండా ఎండలోఎండపెట్టుచుండును. ఆఫ్రికా దేశములోనుండు యుద్ధపుచీమలు ఒక్కచోట నిలకడగానుండక తమ యాహారమునిమిత్తము వేటాడుచు తిరుగుచుండును. చిన్నచీమలను పెద్దచీమలు మోసుకొని పోవుచుండును. ఈ చీమలదండుగాంచి ప్రతిజీవియు పారిపోవుచుండును. ఇవి పురుగులు, పాలీప్లు, పిట్టలు, ఎలుకలు మొదలగువాటిని భక్షించును. అవి ఇళ్లలో ప్రవేశించిన ఆఇంటివారందరు గృహమునువదలి పారిపోయెదరు. ఈచీమలు ఇంట్లోప్రవేశించి ఆహారపదార్థములనుతినివేయును. దక్షిణఅమెరికా దేశములో ఆకులుకత్తిరించు ఒకవిధమైన చీమలుకలవు. ఇవి గుంపులుగుంపులుగా బయలుదేరును. వీటిలో కొన్నివృక్షములెక్కి ఆకులనుకత్తిరించి క్రిందవేయును. మరియొక గుంపు ఈముక్కలను వాటినెలవునకు తీసుకొనిపోవును. మఱియొకదండు వాటిని గృహములో జాగ్రత్తపరచును. కొన్నిచీమలు 'యాఫిస్' (aphis) అను పురుగులను-మనము ఆవులనుపెంచి పాలుపిండునట్లు-పెంచి వాటినుండి తేనెనుపిండును. చీమలకు ఒకవిధమైన భాషగలదు. వాటి డెక్కలపైయుండు రోమములలో సంజ్ఞచేసి ఎచ్చట ఆహారమున్నదో, ఎచ్చట శత్రువులున్నారో తెలియజెప్పగలవు. వాటికి స్నేహితులన్న ఎక్కువ ఆపేక్ష. సంవత్సరమైనను స్నేహితులను జ్ఞాపకముంచుకొని సత్కరించును. —కో కా కృష్ణవేణమ్మ.

### ఒక వంగబాలిక విజయము:—

కలకత్తాయందలి 'మాతృమందిర' పత్రికాసంపాదకులగు ఎ. నాందీగారి పండ్రెండుసంవత్సరముల తనయ అమలనందీకన్య పారిసునందలి కొలోనియలు ప్రదర్శనమున సెప్టెంబరు 16-వ తేదీని విఘ్నపూజయనుపద్ధతి నాట్యమునుచూపి బహుమానమునందెను.

# పత్రికాపరిచయము

## దరిద్రనారాయణ:—

పక్షపత్రిక. అగస్టు 28-వ తేదీని వెలువడిన ౧-వసంపుటము ౧-వసంచిక మాకు చేరినది. 'దరిద్రనారాయణులను సేవించుటకే ఈదరిద్రనారాయణ జన్మించినది. అస్పృశ్యతానివారణకై; మద్యపాననిషేధమునకై; సత్యము, అహింస, శాంతిమార్గముల స్వరాజ్యసంప్రాప్తికై నిరంతరప్రచారముసలుపుటయే ఈదరిద్రనారాయణయొక్క ముఖ్యోద్దేశము' సంపాదకులు మహాత్ముని అనుంగు ఆంధ్రశిష్యులకు ఎర్నేని సుబ్రహ్మణ్యముగారు. అగుట 'దరిద్రనారాయణ' ముఖ్యోద్దేశములు నెఱవేరుననుటలో సందియములేదు. ఈదరిద్రనారాయణసేవ నాదరించి దీవింప ఆంధ్రులను హెచ్చరింతుము. సాలుచందా ౧-౦-౦. కార్యస్థానము గుడివాడ, కృష్ణాజిల్లా.

## శారద:—

పత్తికొండనుండి ప్రతిశుక్రవారము ప్రకటింపబడుపత్రిక. సంపాదకులు వనం శంకరశర్మగారు. శ్రీశర్మగారిదివఱకు ఇంద్రావతియను పేరుతో ప్రకటించు పత్రికనిపుడు శారదగామార్చియున్నారు. రాయలసీమకు 'సాధన'యు, 'శారద'యు రెండే వారపత్రికలు కావున ఆసీమవారు దీనిని బాగుగ పోషింపవలసియున్నది. శారద చిరకాలము దేశసేవచేయును గాక! సాలు చందా రు 4-0-0.

## ప్రాథమికపాఠశాల:—

విద్యావిషయిక మాసపత్రిక. సంపాదకుడు అయినంపూడి గురునాథరావు. విమర్శనార్థముపంపబడిన 3-వ సంపుటము 9-వ సంచిక సెప్టెంబరుమాసపుది అందుకొన్నారము. శ్రీపండితారాధ్యుల నాగభూషణంగారు రచియించిన సత్యనారాయణస్తుతిపద్యములు ప్రథమమున చేర్చబడినవి. ఉపాధ్యాయవృత్తియందు అనుభవముగల చోడవరపు వేంకటేశ్వరరావు, వానపాముల శ్రీమరాచార్యులు, బుద్ధ కుటుంబరావుగార్లు ఈసంచికయందు వ్యాసములు వ్రాసియున్నారు. ప్రాథమికవిద్యయొక్క ప్రధానత గుర్తింపబడినఈ కాలమున ఇట్టిప్రత్యేకపత్రికల కవసరమెంతేనిగలదు. పత్రిక డెమ్మీసైజు. సాలు చందా రు 1-8-0. చిరునామా: ఘంటసాల; కృష్ణాజిల్లా.

## ఆయుర్వేదచంద్రిక:—

నెల్లూరుమండల పెరిదేపిపురవరస్థిత పి., శి. ఏ అండుకో ఆయుర్వేదసమాజమువారి ప్రాపున ప్రకటింపబడు మాసపత్రిక. ఆయుర్వేదము, ఆరోగ్యమునకు సంబంధించిన విషయములు సులభశైలిలో ఎల్లరకు ఉపయోగపడునట్లు వ్రాయబడుచున్నవి. మాపత్రికాపీఠముపై వెలయుచున్న 6-వ సంపుటము 4, 5 గుచ్ఛములు రుద్రజడ, పారిజాతము మొదలగు వస్తుగుణవర్ణనములతో; పాలు, గోధుమలు మొదలగు ఆహారపదార్థవివరములతో పఠనీయములైయున్నవి. దేశీయవైద్యప్రచారముచేయుట కేర్పడిన ఈపత్రిక ప్రోత్సహింపదగినది. సాలు చందా రు 2-8-0.

## సహకారము:—

ఆంధ్రసహకారసమ్మేళనముచే ప్రకటింపబడు మాసపత్రిక. 11-వ సంపుటము 3-వ సంచిక పరికించితిమి. ప్రథమమునగల సంపాదకీయవాక్యాలు చదువదగియున్నవి. గ్రామపునర్నిర్మాణము; క్రెడిట్సహకారతత్త్వము: దాని పరిణామముఅను వ్యాసములు ప్రశంసనీయములు. తెలుగుదేశమున సహకారాభివృద్ధికి దోహదముచేయుచున్న పత్రికలలోనిది శ్రేష్ఠమైనది. సాలుచందా రు 3-0-0. చిరునామా: కార్యదర్శి, ఆంధ్రసహకారసమ్మేళనము, బెజవాడ.

**ధర్మసాధని:—**

సౌష్ఠవముగ నిర్వహింపబడుచున్న తెలుగుపత్రికలలో ధర్మసాధనియొకటి. సెప్టెంబరు 25-వ తేదీని దానికి 19-వ సంవత్సరము ప్రారంభమైనది. తెలుగుపత్రికలలో కృష్ణాపత్రిక తరువాత ఇదియేవయస్సున మిన్నయైనది. స్త్రీయుద్యమములనుగూర్చి ధర్మసాధని వహించుచున్న శ్రద్ధ ప్రశంసనీయముగనున్నది. ధర్మసాధని పెక్కువత్సరములు ధర్మమును సాధించుచు తెలుగుమాగాణిని సేవించుగాక!

# గ్రంథపరిచయము

**చక్రపాణి:—**

నిరూపకనవల. పద్మనాయకగ్రంథమాలలో ప్రథమకుసుమము. గ్రంథకర్త చెలికాని సత్యనారాయణ గారు. కీర్తిశేషులైన శ్రీరాజా రావు వేంకటకుమారకృష్ణరంగారావు బహద్దర్ వారి కంకితమీయబడినది. శ్రీవారిచిత్రమును, గ్రంథకర్తచిత్రమును చేర్చబడినవి. వాడబడినభాష వాడుకభాష. **Sir A Conan Doyle** గారి **'Adventures of Norwood-builder'** నకు ఆంధ్రసంప్రదాయానుసారమైన అనువాదము. కథ రసవంతముగాను, రచనము ధారాళముగానుఉన్నవి. క్రౌనుసైజు: గ్లేజుకాగితములు: 56 పుటలు: వెల చందాదారులకు రు. 0—6—0. ఇతరులకు రు. 0—9—0. వలయువారు మానేజరు, పద్మనాయకగ్రంథమాల, పెంటనాగులవలస, రాజాంపోస్టు, విశాఖపట్టణముజిల్లా.

**విమలానందము:—**

గ్రంథకర్త్రి వడ్లపట్ల లలితాంబగారు. శ్రీఅన్నపూర్ణాదేవిగ్రంథమాలలో ప్రథమసంచిక. ఇందు కథారూపమున వేదాంతబోధ చేయబడినది. ఉపసంహారములో వేదాంతము వికచీకృతమొనర్పబడినది. 'మనువు స్మృతులసృజించె, మానినులహింసించె' అను శ్రీజనసాధారణమైనవాక్యమున కిందును ప్రవేశముగలిగినది. ఎచ్చట స్త్రీలు పూజింపబడరో అచ్చట అన్నిక్రియలు ఫలములేనివగుచున్నవనియు మనువు చెప్పియున్నాడు. తనకాలమునాటి ఆచారములకు సూత్రరూపమిచ్చిన మనువును నేడు దూషించి లాభమేమి? కథ నీతిదాయకమైనది. భక్తి మెండుకొనియున్నది. క్రౌనుసైజున 42 పుటలు. వెల 0—2—0 అణాలు. గ్లేజుకాగితములు. చిరునామా: బ్రాడీపేట, గుంటూరు.

**శ్రీత్యాగరాజు:—**

గాయకశిఖామణియగు త్యాగరాజస్వామి సాధుజీవితము, అతనికృతివిమర్శనము, అతడిచ్చిన సందేశమునుగూర్చి పుదుక్కోట మహారాజావారి కళాశాలలో ఆంగ్లభాషాధ్యాపకులగు యన్. సంజీవరావుగారు యం. ఏ; యల్. టి. ఆంగ్లమునఒసంగిన ఉపన్యాసమునకు గ్రంథరూపము. శ్రీయుత కె. యస్. రామస్వామి శాస్త్రిగారు బి.యే;బి.యల్. దీనికిమున్నుడిని వ్రాసియున్నారు. 'తనగీతి అరవజాతిని పాఠకులనుగా దిద్దితీర్చిన తెలుగువాణి' అనునుడికి కారణభూతుడు త్యాగరాజు. అతనిజీవితము ఆంధ్రులకు అవశ్యము పఠనార్హము.

**శారదాబిల్లు:—**

కర్త పులికొండ పరబ్రహ్మంగారు. శారదాబిల్లునకు స్వాగతోపచారములు చేయుచు చెప్పిన ఇరువదియేడుపద్యముల సంపుటి. సంస్కారప్రియులు ఆదరింపతగ్గది. శారదాశాసనప్రచారమప్పుడు ఇందలి పద్యములు చదువుటకు చాల అనుకూలముగనుండును. క్రౌనుసైజు 16 పుటలు. గ్లేజుకాగితములు. వెల రు. 0-2-0. వలయువారు గ్రంథకర్తగారిపేర చినపారుపూడి, ఉయ్యూరుపోస్టు, కృష్ణాజిల్లా అనుచిరునామాకు వ్రాయునది.

**ముక్తికాంతావిలాసము:—**

గ్రంథకర్త శ్రీమాన్ ఇనగంటి పున్నయ్యాచార్యులు. పరమార్థమునుగురించి తత్త్వములుగా వ్రాయబడినది. క్రౌనుసైజున 32 పుటలు. వెల 0-6-0 అణాలు. దొరకుచోటు: శ్రీమాన్ ఇనగంటి పున్నయ్యాచార్యులు, అప్పికట్ల, బాపట్లతాలూకా, గుంటూరుజిల్లా. లలితమైన పదములు, చమత్కారములైన ఉపమానములు, స్వతంత్రమైనధార, గంభీరమైన భావములు ఈతత్త్వములయందు నిండుకొనియున్నవి. ఈగ్రంథకర్త సనాతనసంప్రదాయసద్గురుపీఠాధిపతియగుటచే గాబోలు శాస్త్రదృష్టము, గురువాక్యము, స్వానుభవము ననుసరించుటయేగాక అంతర్గతమగు బ్రహ్మసాక్షాత్కారయోగరహస్యములను సయితము బహిర్గతమొనర్చినాడు. భక్తజనులకు అవశ్యపఠనీయమగు గ్రంథము.

**శారదావాచకము:—**

అయిదవవాచకము. కర్తలు శ్రీ చేకుమళ్ల రాజగోపాలరావుగారు. ఉన్నతపాఠశాలలలో ఉపయోగించుట కనువైనది. నన్నెచోడుని కుమారసంభవము, నన్నయ భారతము, మొల్ల రామాయణము, తిక్కన భారతము, పింగళి సూరన ప్రభావతీప్రద్యుమ్నము, దాశరథీశతకము, శ్రీనాథుని భీమేశ్వరపురాణము వీనినుండి గ్రహింపబడిన పద్యపుష్పములు—మిత్రలాభము, కృష్ణరాయలకాలమునాటికథలు, కాళిదాసమహాకవికథలు అనువానినుండి గ్రహింపబడిన గద్యపుష్పములుగలిగి ఈవాచకము రమణీయమైయున్నది. పెక్కుకవుల రచనావిధానముతో విద్యార్థులకు పరిచయముకలిగించుటకు పరమప్రయోజనకారి. క్రౌనుసైజున 102 పుటలు. వెల రు 0—8—0 మాత్రము. వలయువారు గ్రంథకర్తపేర 124, పెల్లాళవీథి, పరశువాకము, వేపేరిపోస్టు, చెన్నపురి అని వ్రాయవలెను.

**ద్రౌపదీవస్త్రసంరక్షణము:—**

గ్రంథకర్త్రి శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు. ద్రౌపదీవస్త్రసంరక్షణవృత్తాంతము స్త్రీలు పాటగా పాడుటకు సంక్షేపరామాయణము, పాముపాటలవరుసను ఇందు వ్రాయబడినది. స్త్రీలు పఠింపదగినది. క్రౌనుసైజు 26 పుటలు. వెల 0—2—0. వలయువారు గ్రంథకర్త్రిపేర బాపట్ల వ్రాయునది.

**మోతీలాల్జీనిర్యాణము:—**

రచయిత హిందీప్రచారక్ కర్ణ వీరనాగేశ్వరకవి. మోతీలాల్జీనిర్యాణమును ప్రస్తావించు పదునైదు సీసపద్యములకు గ్రంథరూపము. క్రౌనుసైజున 8 పుటలు. వెల రు 0—1—0. ఈపుస్తకమువలనవచ్చు ఆదాయము చీరాలయందలి మోతీలాల్ హిందీపుస్తకభాండాగారమున కొసగబడును. కావున తగుప్రోత్సాహము కలిగింప ఆంధ్రసోదరులు పూనుదురుగాక! వలయువారు గ్రంథకర్తపేర హిందీభవన్, చీరాలఅని వ్రాయునది.

**లలిత:—**

గ్రంథకర్త మరువాడ శంకరరావు. ఇదియొక సాంఘికనవల. బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి రామచంద్రవిజయమునందలి పోకడలుకొన్ని ఇందుగలవు. కల్లికోటకాలేజీ ఆంధ్రభాషోపన్యాసకులగు కావ్యతీర్థ వేమాని వేంకటనరసింహశాస్త్రిగారు పీఠికలో నిట్లు వ్రాసియున్నారు. 'నాయికయగులలిత సుబ్బారావును బరిణయమాడుటకై ఒనర్చినప్రయత్నము లతిచమత్కారముగా జూపబడెను. వివాహములలో గాంధర్వవివాహమే యుక్తియుక్తమైనదని యీగ్రంథకర్త యభిప్రాయమైనటుల గోచరింపకమానదు. సామాన్యజనులకుగూడ బోధపడునటుల నీగ్రంథము సులభశైలిలో రచియింపబడెను.' గ్రంథము గ్రంథకర్తగారి తండ్రికి అంకితమీయబడినది. చిన్నసైజు. గ్లేజుకాగితములు. 114 పుటలు. వెల 0—8—0 అణాలు. ప్రతులకు మరువాడ శంకరరావుగారు, బరంపురము (గంజాంజిల్లా) అని వ్రాయవలెను.

## డైరి

### సెప్టెంబరు

20:—రాజమహేంద్రవరములో శారదాచట్టమును సవరణచేయుటకు జరుపబడుయత్నములను ఖండించి చట్టమును బలపరచుటకును, రాజమహేంద్రవరపు ఆర్ట్సుకాలేజిని ఎత్తివేయుటకు జరుగుచున్నయత్నములను ఖండించుటకును, హిందూసమాజహాలులో రాజమహేంద్రవరస్త్రీలబహిరంగసభ జరిగెను. రావుసాహెబు ఆవసరాల రామారావుగారిసతీమణి శ్రీమతి వెంకాయమ్మగారు అధ్యక్షత వహించిరి.

21:—ఘంటశాల (దివితాలూకా) బోర్డుబాలికాఉన్నతప్రాథమికపాఠశాల వార్షికోత్సవమహాసభ బందరు రేంజిబాలికాపాఠశాలల సబ్ అసిస్టంటు యిన్‌స్పెక్ట్రెస్‌గారి అధిపత్యమున జరుపబడినది.

22:—

23:—

24:—శ్రీమాన్ పూజ్య కాకా కాలేల్కరుమహాశయుడు ఏలూరునందలి శ్రీఅన్నపూర్ణాదేవి జాతీయవిద్యాలయమును సందర్శించెను.

25:—

26:—మద్రాసు భారతమహిళాసంఘము యాజమాన్యమున మద్రాసునందలి స్త్రీలమెడికలుస్కూలును మూసివేయదలచిన ప్రయత్నమును ఖండించుటకు ఎగ్మూరు పాంథియనుతోటలయందు స్త్రీలబహిరంగసభ జరిగెను.

27:—

28:—

29:—రంగూనులో బర్మాస్త్రీలసంఘకార్యవర్గమువారు సభకేసి బర్మా రౌండుటేబిలుసభయందు స్త్రీలను నియమింపనందున, స్త్రీలను వెంటనేనియమింపవలెనని ఇండియామంత్రిగారిని కోరుచును, నియమింపనిపక్షమున ఇతరసభ్యులుగూడ సభకు పోరాదనియు తీర్మానించిరి.

30:—నగరం పోస్టుమేస్టరుఅయిన బొన్నాడ సూర్యనారాయణ క్షయరోగముచే చనిపోయెను. భర్త చనిపోవుటకుముందే ఆతనిభార్య సుభద్ర నూతిలోబడి స్వర్గస్థురాలయినది.

### అక్టోబరు

1:—డా. అనిబిసెంటుగారి 85-వ జన్మదినోత్సవము అడయారునందు దివ్యజ్ఞానసమాజమువారిచే అధికవైభవముగా జరుపబడెను.

2:—గాంధిమహాత్ముని జన్మదినము. సేతుశీతనగవ్యాప్తమగు భారతవర్షమున అన్నిప్రదేశములందును అన్నివర్ణములవారిచేతను జరుపబడెను.

3:—

4:—వేలంకేరియందు శ్రీయుత గౌ. ది. బ. బొల్లిన మునుస్వామినాయుడుగారి జనని అక్కమ్మగారు పరమపదించిరి.

5:—ఏలూరుకాపురస్థులు సత్యవరపు మాణిక్యంగారిభార్య వెంకమ్మగారు రాత్రి 1½ గంటలకు మరణించిరి. ఈమె యిటీవల ఏలూరులోని అన్నదానసమాజము అనే ఏలూరు అన్న, వస్త్ర, వైద్య, విద్యాదాన

సమాజమునకు శాశ్వతధర్మకర్తలుగానుండుటకు అంగీకరించి లోగడయిచ్చిన రు. 60 లు గాక లోతక్కువ నాలుగువందల నలభైరూపాయలు యిచ్చుటకు ఒకవిల్ వ్రాసియిచ్చినది.

6:—శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు ప్రొద్దుటూరు ఆర్యవైశ్య రీడింగురూములో స్త్రీల ప్రత్యేకసభ యందు ఉపన్యసించిరి.

7:—బాల్డ్వినుగారి సతి రౌండు టేబిలుసభ స్త్రీప్రతినిధులకు విందుచేసెను.

8:—కాకినాడ దేశసేవికాసంఘమువారు దేశసేవాధురీణులును, సంపూర్ణస్వాతంత్ర్యవాదులునగు శ్రీయుత మద్దూరి అన్నపూర్ణయ్యగారికి సన్మానపత్రము అర్పించిరి.

9:—పూనాలో ముసల్మాన్ మహిళాసభ జరిగెను. శ్రీమతి ఇబ్రహీం సతీమణిగారు అధ్యక్షురాలు.

10:—జమీగొల్వేపల్లియందు శ్రీ వల్లభనేని రామబ్రహ్మంగారిచే స్థాపింపబడిన శ్రీ అన్నపూర్ణాదేవి నేత పరిశ్రమాలయమునకు శ్రీమతి మాల్పూరు చుక్కమ్మగారిచే అత్యంతవైభవముగా ప్రారంభోత్సవము జరుపబడెను. తదుపరి శ్రీమతి కలగర పిచ్చమ్మగారిచే పతాకోత్సవము జరుపబడి నేతపరిశ్రమాలయమువద్ద పతాకస్థాపన జరుపబడెను.

11:—కాకినాడ హిందీబాలికాపాఠశాల అష్టమవార్షికోత్సవము శ్రీమతి పెద్దాడ కామేశ్వరమ్మగారి అధ్యక్షతను జరిగెను.

12:—లాహోరు నవయౌవనభారతసభాధ్యక్షురాలు శకుంతలాదేవిగారును, సిమ్లామండలకాంగ్రెసుసంఘాధ్యక్షునిసతి లక్ష్మీదేవిగారును శిక్షింపబడిరి. ఇరువురును రాజద్రోహకరములగు నుపన్యాసను లొసంగిరని విచారించిన అదనపు జిల్లామేజస్ట్రేటు నిశ్చయించుచు చెరి రు. 2000 జామీనైన చూపవలెను. లేదా ఒకసంవత్సరము విడిఖయిదు ననుభవింపవలెనని తీర్పుచెప్పెను. స్త్రీలిరువురును జైలుకే పోయిరి.

13:—కాళహస్తిలో స్త్రీలకు ప్రత్యేకసభ. శ్రీమతి రుక్మిణమ్మగారు అధ్యక్షతవహించిరి. శ్రీమతులు కనకపల్లి తాయారమ్మ, పాదర్తి సుందరమ్మగార్లు ఉపన్యసించిరి.

:—కలకత్తాలో కుట్రసలిపిరనియు బందిపోటుదొంగతనముజరిపిరనియు లైసెన్సులేక తుపాకులనుతమవద్ద నుంచుకొనిరను నేరములు కాంగ్రెసుప్రచారకురాలగు శ్రీమతి విమలప్రతీవదేవిగారిమీదను మరి పలుగురు యువకులమీదను మోపబడినవి. కోర్టులో శ్రీమతి ప్రతీవదేవి రక్తము వమనము చేసికొనిరి. ఆమె ఆరోగ్యము బాగుగలేదనియు అందుచే ఆమెను జామీనుపై విడుదలచేయవలయుననియు డిఫెన్సు వకీలు పిటిషను పెట్టిరి.

14:—కలకత్తాయందు రెండేసివేలరూపాయల జామీనులు రెండింటిమీద శ్రీమతి విమల ప్రతిభాదేవిగారు విడుదలచేయబడిరి.

15:—సిమ్లాలో నవయౌవనభారతసభాధ్యక్షురాలు శకుంతలాదేవిగారును, శ్రీమతి లక్ష్మీదేవిగారును చెరి రు. 2,000 జామీను చూపనందులకై ఒకసంవత్సరము విడిఖైదు విధింపబడి జైలుకువెళ్లిరిగదా! వారు అడిగిన జామీనిచ్చి విడుదలయిరి. ఇరువురుస్త్రీలును మేజస్ట్రేటు తీర్పుపై అపీలు చేయనున్నారు.

16:—

17:—

18:—

19:—




**మహాత్ముని ఆదేశము లేదుగావున:—**

భగవత్సింగును ప్రస్తుతించు అరవపాటనుపాడి శ్రోతలను ముగ్ధులుగ నొనర్చుటలో కుంభకోణమునివాసిని శ్రీమతి కె. బి. సుందరాంబాళ్ అందెవేసినచేయి. ఈనడుమ నామె కుంభకోణము కామాక్షియమ్మాళ్ నాట్యకళామందిరమున ఆడబడిన ఒకానొకనాటకమున పాత్రధారణమొనర్చెను. ఆమె పాడగా భగవత్సింగుపాటవిని ఆనందింపదలచి ప్రేక్షకు డొకడు నాటకమధ్యమున లేచి తనకోరిక వెల్లడించెను. ఇతరప్రేక్షకులు పలువురు దీనికి చంకలుతాటించిరి. ఈపాటను పోలీసువారు నిషేధించియుండిరి. సుందరాంబాళ్ ఆసంగతి ప్రేక్షకులకు దెలియజెప్పెను. ఆనిషేధపుటుత్తరువును ఉల్లంఘించి పాటపాడవలసినదిగా ప్రేక్షకులుకోరిరి. ఆఉచితజ్ఞురాలు ఈఅనుచితపుకోరికను మన్నించలేదు. ప్రజ్ఞఉట్టిపడ ఆమె ఇట్లు పలికెను: "ఒడంబడిక గీచినగీటు దాటవలదని మహాత్ముడు ఆదేశించి లండనుకు పోయి ఉన్నాడు. ఇట్టి నిషేధపుటుత్తరువులను ఉల్లంఘించుటకు మహాత్ముని ఆజ్ఞ లేదు. కావున నేనిప్పుడిద్దానిని మీరలేకుండనున్నాను." మహాత్ముని బోధామృతమునుగ్రోలుటచే స్త్రీలకు సయితము ఎంతటిసంయమము, లోకజ్ఞానము పట్టువడినవో?

**గోండాల్ మహారాజావారి గుజరాతి నిఘంటువు:—**

గోండాల్ మహారాజావారిది గుజరాతి మాతృభాష. ఆభాషకు ఆంధ్రమునకువలెనే ఇంతవఱకు సమగ్రమగునిఘంటువు లేకుండెను. ఆలోపమునుదీర్ప గోండాల్ మహారాజావారు గుజరాతినిఘంటునిర్మాణమునకు ఏర్పాట్లుగావించిరి. నిఘంటునిర్మాణము గేలప్ పరుగుమీాద జరిగెను. ఐదులక్షల రూప్యములు వ్యయముచేయబడెను. రెండులక్షలఏబదివేలపదములతో, పెక్కుచిత్రములతో, పెక్కుఉదాహరణములతో బ్రహ్మాండమగు ఆనిఘంటువు ముద్రణము తీరి గతమాసమున గుజరాతీసారస్వతార్చకుల గృహముల నలంకరించెను. అభినవాంధ్రభోజులగు పిఠాపురమురాజావారిప్రాపున పుష్కరములకుపూర్వము ప్రారంభింపబడిన ఆంధ్రనిఘంటువు అచ్చుతీరి ఇట్లు ఆంధ్రులగృహముల ఏనాడు అలంకరించునో?

**పదిరూపాయిలతో పరిణయము:—**

హిందూదేశమున మితిమేరలేని వివాహవ్యయములతో సామాన్యసంసారము లెన్నియో ఆరిపోవుచున్నవి. వివాహములందు అరుంధతీదర్శనమగుచున్నదో లేదో కాని వివాహములతో అప్పుదేవతమాత్రము దర్శనమిచ్చుచున్నది. అందుతో ఎత్తుపడిపోయిన సంసారి ఇకతేలుటయేలేదు. ఈదుస్థితి తొలగించుటకు ధార్వారులోని ప్రొఫెసరు వాల్వీ పదిరూపాయిలతో ఒకఆదర్శకవివాహమును జరిపినారు. పరిణయావసరమున తానే పౌరోహిత్యము నెఱపినారు. అనంతరము వధూవరులకు పదిరూపాయిలనోటు ఇచ్చిదానితో తమముఖ్యబంధువులకు మాత్రము యథోచితమగు విందుచేయ ఆదేశించినారు. స్వల్ప వ్యయముతో వివాహములు నిర్వహించు ఇట్టిపద్ధతి హిందూదేశమున అంటువ్యాధివలె వ్యాపించినచో విశేషలాభకారిగా నుండగలదు.

**మగనికొఱకు:—**

బొంబాయి. శ్రీమతి దయాబాయి. ఒకసతీరత్నము. భర్త యుద్యోగవిహీను డాయెను. తిరిగిఉద్యోగము సంపాదించుటకు అతడుచేసిన సకలప్రయత్నములును ప్రయత్నములుగనే ఉండిపోయెను. ఇకసంసారము సాగింపజాలక తనగతి ఏరీతినున్నను తనతో తన సతియు నిడుమలబడుటకు ఒడబడక తనకుతిరిగి పనిదొరికె ఇల్లు నడుపుకొనగలవఱకు నామెను ఆమె పుట్టింటికి పంపుటకు అతడు నిశ్చయించెను. ఉప్పో, ఉసురో; పస్తో, ప్రసాదమో, సుఖమో, దుఃఖమో ఆమె పతిపాదపంకేరుహములను పెడబాయుటకు బొత్తిగా ఒప్పుకొన లేదు. ఇచ్చట ఉద్యోగాన్వేషియై పట్టెడన్నముతో ఊకపాయవలె తిరుగుచున్న పతినివదలి తాను పుట్టింట పొట్టనిండిన తేనుపులతో సుఖించుట కాయిల్లాలు అంగీకరింపలేదు. ఉద్యోగాన్వేషణ మింకను సాగుచుండెను. ఆశాలేశమైనలేదు. ఉద్యోగముదొరకకుండుటతోడు తన భరణభారము మగనికి చింతాజ్వరమునుప్రకోపింపజేయుట ఆమెనిదానముచేసినది. ఒకనాడు యథాప్రకారము మగడు ఉద్యోగాన్వేషణమునకువెడలి తిరిగివచ్చునంతలో ఇంటఆమె తన శరీరమును అగ్నికాహుతిచేసినది. ఆమె బ్రతికినది మగనికొఱకు. చచ్చినది మగనికొఱకు. భారతరమణి బ్రతుకునది, చచ్చునది మగనికొఱకే. ఇది ఇక్ష్వాకులకు ఎన్నోయుగముల పూర్వమునుండియు అనుశ్యూతమై వచ్చుచున్న ఆచారము.

**శ్రీనంగాబత్తుల బైరాగమ్మగారి దేశభక్తి:—**

శ్రీనంగాబత్తుల బైరాగమ్మగారు రేపెల్లతాలూకా పేటేరుగ్రామకాపురస్థురాలు. ఆమె అపూటకు ప్రొయ్యిరాజనట్టి నిరుపేదరాలు. ఆమెకుగల ఆస్తియంతయు కొన్నితాటి చెట్లు. ప్రతిసంవత్సరమును వానిని కల్లుకీతకిచ్చి అవరుమానమువలన ఆమె పొట్టపోసుకొను చుండెను. ఈసంవత్సరము సత్యాగ్రహులు ఆమెను సందర్శించి 'అమ్మా! తాళ్లను కీతకీయ రాదని కాంగ్రెసునాయకు లాదేశించుచున్నారు. కావున తమకీతతాళ్లఆకులను నరికివేసి

అవి కీతకు పనికిరాకుండచేయవచ్చితిమి. తమ సెలవేమి?' అనిఅడిగిరి. కాస్త రాబడియు వదులుకొని కనకనమంటు ఆకలికిగురియగుటయా-లేక తనచిన్నపొట్టకుగాను కాంగ్రెసుఆజ్ఞను కాలదన్నుటయా—స్వార్థమా, లేక దేశమాఅని ఆమె ఒక్కనిముసమాలోచించెను. కనకనమనగల ఆకలిని తలంపలేదు; కాంగ్రెసుఆజ్ఞను తలదాల్చెను. స్వార్థమును చంపుకొనెను; దేశహితమును చేకొనెను. తాను స్వయముగ దగ్గరయుండి తన తాటిచెట్లఆకులను నరికించెను.

**శ్రీ మహాదేవ శేషమ్మగారి దైవభక్తి:—**

గుడివాడతాలూకా. చెన్నూరుగ్రామము. క్షత్రియవంశము. ఇంటిపేరు మహాదేవవారు. పేరు శేషమ్మ. తనకున్నది రెండుయకరములభూమి. కొడుకులు కొమ్మలు ఎవరునులేరు. కావున ఆమె చనిపోవుచు ఈరెండుయకరములభూమిని తనగ్రామమున వేంచేసియున్న శ్రీనారదలింగేశ్వరస్వామివారిపేర వ్రాయించియిచ్చెను. అయితే ఇతరమాన్యములవలె స్వామినోట మన్నుకొట్టి దీనిని పూజారులు గుటకాయిస్వహా అనుటకు వీలులేదు. ఏటేటజరుగు స్వామికల్యాణమహోత్సవసమయమున ఈభూమిమీదవచ్చు ఆదాయముతో బీదసాదలకు అన్నప్రదానముచేయవలయునని ఆమె విల్లులో వ్రాయించినది. అన్నార్తురలకు అన్నము. ఆఅన్నప్రదానము సక్రమముగ సంవత్సరసంవత్సరమును సాగుచుండుటకు స్వామి ప్రతిభువు. పాత్రత, పరిశీలనముగల ఇట్టిదానములు వరిష్ఠములు. ఈభక్తురాలు 26-8-31-వ తేదీని దివంగతురాలైనది.

**కాశీబాంబుకేసులో ఇరువురుకాంతలు:—**

కాశీబాంబుకేసు కడముట్టినది. బాంబుకేసులు పెక్కులు జరిగినవి; జరుగుచున్నవి. అయితే ఇంతవఱకు అట్టికేసులయందు స్త్రీలు ఇఱుకుకొనలేదు. కాశీబాంబుకేసునందలి ముప్వురు ముద్దాయిలలో ఇరువురుఇంతులు. అయిరువురిలో శ్రీమతి రాధారాణిఅను నామె నిర్దోషయని వదలివేయబడెను. రెండవయామె శ్రీమతి మృణాలిని ప్రేలుడువస్తువులచట్టము 5-వ సెక్షను క్రిందను, ఆయుధములచట్టము 19-వ సెక్షను క్రిందను కలిపి పదునాలుగేండ్ల ద్వీపాంతరవాసశిక్షనుపొందెను. పైగా 'సి' క్లాసు ఈయబడెను. స్త్రీయగుటచేగాని, విద్యావతియగుటచేగాని, మర్యాదకుటుంబమునకు చెందినదగుటచేగాని 'సి' క్లాసుశిక్షఆమెకు తప్పలేదు. స్త్రీవిషయమున ఇది కఠినశిక్షయనక తప్పదు.

**శ్రీ కమలాదేవి చటోపాధ్యాయగారి నియామకము:—**

హిందుస్థానిసేవాదళమునందు మహిళాశాఖను ఏర్పరచుటకు కాంగ్రెసు వర్కింగు కమిటీవారు కమలాదేవిఛటోపాధ్యాయగారిని నియమించిరి. ఈనియామకమునుగూర్చి సమదర్శిని ఇట్లు పొగడిచెప్పుచున్నది: "ఉద్యమరంగము నుత్సాహముతోడ బ్రవేశించి చూపరులనందర నాశ్చర్యమున ముంపగల నేర్పును, యువజనుల నుత్సాహపూరితులుగ నొనరించి కార్యరంగమునకు దింపు నైపుణియు నీయమకు వెన్నతోడ బెట్టినయవి. ఉత్సాహమెంత

కలదో యంతకు రెండింతలు దేశభక్తియు, పదియింతలు విద్యాసక్తియు గలిగిన యిట్టి మహిళారత్న మీనాటి భారతవర్షమున నుండుట భారతయువతీమణుల యదృష్టమేయని యనకతప్పదు. అట్టినారీమణిని మహిళాశాఖకు నాయికగ నియమించుట చాల సమంజసము".

**గాంధిమహాత్మునకు జన్మదినబహుమానము:—**

ఎలన్‌విల్‌కిన్‌సన్‌కన్య—పార్లమెంటు సభ్యురాలు—గాంధిమహాత్ముని జన్మదినోత్సవ సందర్భమున హిందూదేశమునందలి అశేషజనమునకును క్రిందిసందేశమును పంపినది: "గాంధి మహాత్ముని జన్మదినము తిరిగివచ్చునాటికి ఇంగ్లండునకు ఇండియాకు సామరస్యముకుదిరి భారతదేశము ప్రపంచమునందలి స్వతంత్రదేశములతో మాఱుమలయుగలదని నేనుగాఢముగ ఆశించుచున్నాను." ఈస్త్రీరత్నము ఆశయము నెఱవేరునట్లు అఘటనఘటనాసమర్థుడగు పరమేశ్వరు డనుగ్రహించునుగాక! హిందూదేశస్వాతంత్ర్యము గాంధిమహాత్మునకు రాబోవు జన్మదినోత్సవబహుమానమగుగాక!

**స్త్రీలహక్కులకై కష్టించువారిలో మేటి:—**

గాంధిమహాత్ముని అఱువదిమూడవ జన్మదినోత్సవమునాడు లండనునందలి హిందూస్త్రీసంఘమువారును, సరోజనళినీదత్తుస్మారకసంఘమువారును మహాత్మునకు నూటఅఱువదియైదుపౌనులనిచ్చిరి. నెహ్రూసతి అధ్యక్షతవహించెను. శ్రీమతి సరోజినీనాయుడు ఉపన్యసించి ముగించుచు మహాత్మునుద్దేశించి 'ఈతడు ప్రపంచమున స్త్రీలహక్కులకై కష్టించువారిలో మేటి' అనినుడివెను. మహాత్ముడు ప్రపంచమున స్త్రీలహక్కులకై కష్టించు వారిలో మేటియేయగును. ఫెడరలుస్ట్రక్చరుకమిటీలో సుబ్బరాయనుసతి వైచినప్రశ్నకు జవాబుచెప్పుచు నాతడు 'స్త్రీలను ధారాళముగ ఎన్నుకొనని శాసనసభలను నేను బహిష్కరింతును' అని చాటియున్నాడుగదా?

**నగకొఱకు డబ్బు అడిగినందుకు:—**

22-5-31ని. మధుర. దొరస్వామి. అతనిభార్య కారుతమ్మాళ్. మధ్యాహ్నమైనది. మగనిని నగకొనుక్కొనుటకు కొంచెముడబ్బు అడిగినది. ఆతడు ఈయలేదు. అంతతో ఊరుకొన్న అంతయు సవ్యముగ పోయెడిదే. కాని ఆతడు తన్నుభార్య డబ్బు అడిగిన కోపమున ఒడలుమఱచి ఔచిత్యమునువిడిచి ఆమెశీలవిషయమున కొన్నిదుర్భాషలాడినాడు. నగలులేక నాణెములులేక తాను దీపపుసెమ్మెవలె నుండుగాక, డబ్బులేకదస్కములేక తాను మొరడుమ్రాకువలె నుండుగాక భారతస్త్రీకి చింతలేదు. కాని శీలవిషయమున చీపురుముల్లంత జారుపాటుకూడ ఆమెభరింపదు. కావున కారుతమ్మాళ్ తనశీలవిషయమున వంకరకొంకర మాటలాడుచున్న మగనికి జవాబుచెప్పినది. భార్య తనయెదుట పళ్లెత్తిపలుకుటా? భర్త భరింపగలడా? చాకుపుచ్చుకున్నాడు. చేతికొలది పొడిచినాడు. తిరిగిపొడిచినాడు. చచ్చువఱకు పొడిచినాడు. తన్నుభరింపవలసినవానిచేతులలో ఆమె మరణించినది. ఇది

యింతయు నెందులకు జరిగినది? నగకొఱకు డబ్బు అడిగినందుకు. అడక్కనుడక్క ఎంతచాకిరీ చేసినను ఎబ్బెట్టుకాదు. మాఱుమాటఆడిన మరణశిక్ష. పురుషుడా! ఎంతకాలము నీ ఈదౌష్ట్యము?

**స్త్రీలు, గృహము: మహాత్ముని వ్యాసము—**

గాంధిమహాత్ముడు లండనులోని డెయిలీహెరాల్డుపత్రికకు వ్రాసిన వ్యాసములో భారతరమణులనుగూర్చి ఇట్లుప్రస్తావించినారు. "మాదేశములో స్త్రీలను తక్కువగాజూతురని మీరు వినియుందురు. ఇది కేవలము బయటికిమాత్రమే. నిజమునకు వారికి మొదటి నుండియు చాలయధికారప్రతిపత్తులుగలవు. మాదేశములో కొన్నిశతాబ్దములుగా స్త్రీలు పురుషులతోబాటు పనిజేయుచున్నారు. వారు పనిచేయమానినచో చాలమందిపురుషుల కన్న మేదొరకదు. నాట్లు, కోతలుమున్నగువానియందు స్త్రీపురుషులు కలసిపనిచేసికొందురు. వారిది చాలకష్టజీవనము. పనిలేనియుగ్రవర్ణములవారియందే ఈస్త్రీపురుషవిభేద మెక్కువగాగనబడుచున్నది. ధనముమూలమున స్త్రీలు సేవాప్రయోజనమును మఱచిపోయిరి. ఈవిధముగా ధనికురాండ్రు కేవలము నాభరణప్రాయులు, ఆటవస్తువులునై పోయిరి. అన్ని ఉద్యోగములు, వృత్తులు స్త్రీలకుగూడనుండవలయును. లేనిచో నిజమైనసమానతయుండదు. కాని స్త్రీలు తమప్రాచీనగృహరాజ్ఞిత్వమును మాత్రము కాపాడుకొందురనియే విశ్వసించుచున్నాను. స్త్రీ కాపదవి ఎన్నటికిని బోగూడదు. ఇల్లాలులేనిది యిల్లుకాదు. ఒక్క నిదర్శనము చూడుడు! గృహిణి పైటిపిస్టుగానో పనిచేయుచు ఇల్లు పట్టకుండినచో ఆయింటి సంగతి వేఱుగజెప్పవలయునా? ఇక పిల్లలను జూచువారెవ్వరు? వారేకదా పరమపేదసంసారమునకైనను నలంకారములైన రత్నశలాకలు. అయితే తెలివిగలస్త్రీలు బాగుగసంపాదించి పిల్లలను డబ్బిచ్చి పోషింపజేయువచ్చునను కొనుడు. అది ఎక్కడనో యొకచోటగాని కుదురదు. విశేషములెందైననుండును. అంతమాత్రముచేత నావిశేషమునుబట్టి సామాన్యపద్ధతిని సాధింపజాలము. మామూలుగ ధనమునార్జింపవలసినవాడు తండ్రి. తనసంసారము సుఖముగనున్నదను సంతోషములో నాతడు చేతులువిఱుచుకొని కష్టపడును. ఇక పిల్లలను తల్లిపోషించినట్లెవ్వరును బోషింపజాలరు. అదిలేకుండజేయుట పిల్లల నన్యాయముసేయుట. పిల్లలను పెంచి వారి శీలమును వర్ధిల్లజేయుట తల్లుల విధి. అంతకంటె పరమప్రియమయిన విధిలేదు. స్త్రీలకును పురుషులతోబాటు సమానప్రతిపత్తి యుండవలయునని నేనును అంగీకరింతును. కాని పిల్లలపోషణ మనుధర్మమును బరిత్యజించినచో దానికిక ప్రాయశ్చిత్తమనునది లేదు" (కృష్ణాపత్రిక) తమదృష్టిని పాశ్చాత్యనాగరికతపై లగ్నముచేసియున్న భారతసోదరీమణులు ఈహితోపదేశమును మననముచేయుదురుగాకయని కోరెదము.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.